క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం



# అధిక రుచికరం అధిక సంపూర్ణం

**ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు పాపాయి పెరుగుదలకు మంచిది.**




పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం. కలపడం సులభం. పాపాయికి తినిపించడం సులభం.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రోటీన్‌తో సమృద్ధం. ఆరోగ్యవంతమైన రక్తంకోసం అదనంగా ఐరన్ కలినది. గట్టి పళ్ళు, ఎముకలకోసం సరియైన నిష్పత్తిలో కాల్షియం మరియు ఫాస్ఫరస్ కలినది. పాపాయి సున్నిత జీర్ణశక్తికి అనువుగా ముందుగానే పచనం చేయబడినది.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

ప్రతి చెంచాలో అధిక సంపూర్ణ ఘన ఆహారం.

CLARION/B/GX/3/183 TEL

# చతుర

సంపుటి : 7 అక్టోబర్ 1984 సంచిక : 9


## ఈ నెల సమగ్ర నవల

"నువ్వు అశరీర స్థితిలో పదమూడు రోజులు గాలిలో తేల్తుంటావు. మనుషులు కనిపిస్తారు. జంతువులు కనిపిస్తాయి. వాళ్ల మనస్సులో ఏముందో చదవగలుగుతావు. వాళ్లకి నువ్వు కనపడవు. వాళ్ల మాటలు నీకు వినిపిస్తాయి. కాని, నువ్వు మాట్లాడలేవు. నీలాగే గాల్లో సంచరించే ఇతర ఆత్మలతో మాట్లాడగలుగుతావు. కాని, వాళ్ల ఆలోచనల్ని పసిగట్ట లేవు. నీ తల్లి, తండ్రీ' నీ పెంపుడు కుక్కా, ఒకరిద్దరు నీ స్నేహితులూ తప్ప నీ గురించి విచారించేవాళ్లుండరు. ఈ ఆత్మజ్ఞానంతో నువ్వు నివ్వెరపోతావు. నీ చావుకన్నా కూడా ఇది నిన్ను వేధిస్తుంది. నిజానికి నువ్వింకా చాలా చావులు చూస్తావు...."

ఈ మాటలు వింటున్న అతనికి నిజంగానే ఓ మాయా ప్రపంచంలోకి ప్రవేశించినట్టుగా వుంది. ఆ ప్రపంచంలో అతనికి....




గా దర్శనమిచ్చిన విషయాలేమిటి? వాటి పర్యవసానంగా అతను తెలుసుకున్నదేమిటి??

ఇంతకీ అతనెవరు? అతనికి ఏమయింది??

శివ్ కె. కుమార్

ఓ ప్రముఖుని మరణానంతరం, అతని పరిసర ప్రపంచంలోని వ్యక్తుల భావాల్లోని పరిణామాన్ని చిత్రిస్తూ రచించిన 'న్యూడ్ బిఫోర్ గాడ్'కు

'సహవాసి'

అనువాదం 'దిగంబరం' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : ప్రవీణ్‌కుమార్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-. అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.


చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.



# రక్షకులు

అమావాశ్య రోజులు...రాత్రి పది గంటలు కావస్తోంది. ఆకాశం కొద్దిగా మబ్బుపట్టి చీకటి చిక్కగావుంది.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో తుప్పు పట్టిన రేకుల డబ్బాలా శబ్దంచేస్తూ డిస్ట్రిక్ట్ బస్సు వచ్చి ఆగింది.

భుజానికి తగిలించిన చిన్న ఎయిర్ బ్యాగ్‌తో 'అరుణ' ఆ రోడ్డుపక్క షెడ్డు ముందు బస్సు దిగింది.

మరుక్షణం దుమ్ము రేపుకుంటూ బస్సు కనుమరుగు అయ్యింది.

అది వాగా పల్లెటూరు. అరమైలు దూరంలో ఉంది. ఆటోలు, రిక్షాలులాంటి సౌకర్యాలు లేవు.

బస్సుదిగిన అరుణకి ఒక్కక్షణం ఏం చెయ్యాలో తోచలేదు. దూరంగా వూళ్లో ఇళ్లు, మిణుకు మిణుకుమంటూ దీపాలు కనిపిస్తున్నాయి.

ఆ ఊరిలో రౌడీల గ్యాంగు కాస్త ఎక్కువే.

ఆ దారిలో తరచూ దారిదోపిడీలు జరుగుతూవుంటాయి. పార్టీ కక్షలతో ఖూనీలుకూడా గుట్టుచప్పుడు కాకుండా జరిగిపోతూవుంటాయి.

అరుణకి అవన్నీ జ్ఞాపకంవచ్చి ఒక్కసారి గుండె జలదరించినట్లు అయ్యింది. మళ్లీ అంతలోనే ధైర్యాన్ని కూడగట్టుకుని బ్యాగు మరో భుజానికి మార్చుకుని వడివడిగా నడవటం మొదలుపెట్టింది.

ఆరోజు ఉదయం పక్కనేవున్న సిటీలో అరుణ ఒక ఇంటర్వ్యూకి హాజరయింది. మధ్యాహ్నం అక్కడినుంచి ఒక బస్సు వుంది. అది చీకటిపడేలోపే తమ ఊరికి చేరుస్తుంది. కాని దురదృష్టవశాన బస్సుమధ్యలో ఫెయిల్ అయ్యింది. అందుకే ఇంత ఆలస్యం.

అరుణ గుండెలు భయంతో పీచు పీచుమంటున్నాయి. చేసేదిలేక ధైర్యాన్ని కూడగట్టుకుని వడివడిగా నడవటం మొదలుపెట్టింది.

దారంతా పొలాలు. పాలుపోసుకుంటున్న వరిచేలునిలువెత్తున పెరిగివున్నాయి. పంటకాల్వలో బోదురుకప్పలు బెకబెక మంటున్నాయి.

ఆ చీకట్లో మళ్ళ దారంట అరుణ వేగంగా అడుగులు వేస్తూంది. ఇంటి దగ్గర తల్లి ఒక్కర్తే వుంది. అరుణ ఇంటర్వ్యూకి బయలుదేరే సమయానికి ఆవిడకి బొత్తిగా ఒంట్లో బాగుండలేదు. దగ్గు, ఆయాసం ఎక్కువయిపోయ్యాయి.

అందుకే స్నేహితురాలు "ఓ పూట వుండి వెళ్ళవే అరూ" అంటూ బతిమిలాడినా వినకుండా వెంటనే తిరుగు ప్రయాణం అయ్యింది.

అరుణ వులిక్కిపడింది.

కాళ్ళకి సంకెళ్లు పడినట్లయి నడక ఆపి గభాల్న వెనక్కి తిరిగింది.

దూరంగా ఎవరో నీడలా నడిచి వస్తున్నారు.







అరుణ గుండె గుభిల్లుమంది.

ఒక్క క్షణం ఊపిరి నిలిచిపోయి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది. నడక మరింత వేగం పెంచింది. దాహంతో గొంతుక ఎండినట్టు అయ్యింది.

ఆరునెల్ల క్రితం సరిగ్గా ఆ ప్రాంతంలోనే రౌడీలు పొరుగూరునుంచి ఓ అమ్మాయిని ఎత్తుకొచ్చి పాడుచేసి...

అరుణ నడక వేగం పెంచింది.

దారంతా ఎగుడుదిగుడుగా వుంది. మళ్ళదారి. పంటచేలు జేగురుమంటున్నాయి. దూరంగా వూళ్ళో మాత్రం కరెంటు కనిపిస్తోంది.

"ఈష్...శ్శ్,..." వెనకాల సన్నగా

ఉషా కిరణ్




దర్శకత్వం:
వి.మధుసూదనరావు

నిర్వహణ:
అట్లూరి రామారావు

యూవీస్



సంగీతం: చక్రవర్తి
ఫోటోగ్రఫీ: ఎస్. గోపాలరెడ్డి

నిర్మాత
రామోజీరావు

ఈలపాట... ఈసారి చాలా స్పష్టంగా దగ్గరగా వినిపించింది.

ఆ పాటతో, పాటకు లయగా వడివడిగా అడుగుల చప్పుడు...

అరుణ గుండె గుభిల్లుమంది. గభాల్న నడక ఆపి పక్కన ఉన్న చెట్ల చాటుకి తప్పుకుని వెనక్కి తిరిగి చూసింది.

కాస్త దూరంలో రెండు మగ ఆకారాలు తన వైపే నడిచిరావటం కనిపించింది.

ఊపిరి నిలిచినట్లు అయ్యింది.

కళ్లు విప్పార్చుకుని మళ్ళీ చూసింది. సందేహంలేదు. ఒంటరిగా బస్సు దిగటం కనిపెట్టి మరీ తనని వెంట అనుసరిస్తున్నారు వీళ్లు.

అరుణ గుండె ఝల్లుమంది.

ఈ దార్లోనే ఆరునెలల క్రితం పద్నాలుగేళ్ళ బాలిక రేపింగూ, గొల్లపడుచు ఆత్మహత్య, గ్రామసేవిక టీజింగూ...అన్నీ మళ్ళీ ఒక్కసారి కళ్ళ ముందు కదిలాయి. భయంతో శరీరం కొయ్యలా బిగుసుకుపోయింది. గుండెల్లోంచి ఏడుపు తన్నుకుని వచ్చేస్తూంది.

శరీరంలోని శక్తి అంతా కాళ్ళలోకి తీసుకుని గుండె ధైర్యం చిక్కపట్టుకుని వేటగాడు తరుముతున్న జింకపిల్లలా పరుగు లంకించుకుంది.

ఆ చేల గట్లమ్మట అడ్డదార్న పడి ఆగకుండా పరిగెడుతూనే వుంది.

అలా పరిగెడుతూనే మధ్యలో మళ్ళీ ఒకసారి వెనక్కు తిరిగి చూసింది.

ఈసారి గుడ్డి వెలుతురులో ఆ ఆకారాలు స్పష్టంగా కనిపించాయి.

గుండె ఆగినంతపనయి "కెవ్వు" మనబోయి అతికష్టంతో ఆ కేకని గుండెల్లోనే అదిమేసింది.

"సందేహంలేదు. వాళ్లే... భగవంతుడా!"

పరిగెత్తి పరిగెత్తి ఎలాగో వూళ్ళోకి వచ్చిపడింది.

పెద్దవీధి సందు మలుపుతిరిగి నాలుగు ఇళ్లు దాటి తమ ఇంటి ముందుకి వచ్చిపడింది.

వీధి అరుగు చీడీలు ఎక్కి తలుపు మీద రెండు చేతుల్తో దబదబా బాదింది.

"అమ్మా....అమ్మా..."

"........."

అరుణ నాలుగుసార్లు బాదిన తరువాత ఇంట్లో లైటు వెలిగింది.

"ఎవరూ...?" అంటూ శాంతమ్మ లేచి వీధి తలుపులు తెరిచింది.

ఆపాదమస్తకం చెమటతో తడిసిపోయి గజగజా ఒణికిపోతూ గడపలో నిల్చున్న కూతుర్ని చూసి హతాశురాలు అయ్యింది.

"అయ్యో! అదేమిటే ఇంత రాత్రివేళ వచ్చావ్? అయినా ఇప్పుడు బస్సేముందని?"

అరుణ గభాల్న తల్లిని తోసుకుని లోపలికి వచ్చి తలుపులు మూసేసింది.

శాంతమ్మ అయోమయంగా వీధిలోకి తొంగిచూసింది.

"అమ్మా...ముందు తలుపెయ్యి" గట్టిగా అరిచింది అరుణ.

శాంతమ్మ బిత్తరపోయింది.

"ఎవరే...? ఎందుకంత భయం?"

"పోలీస్...లు..."

"ఆఁ...వాళ్లా ఇంకా ఎవరో రౌడీవెధవలనుకున్నాను...." ఖంగారుతో భళ్లున తలుపులు మూసి గబగబా లోపలికి వచ్చేసింది శాంతమ్మ!

—కాకాని కమల

# కాన్వెంట్

సాయంత్రం కాన్వెంట్ నుంచి ఇంటి కొస్తూనే – "మా టీచర్ ఈ చీటీ మీకిమ్మంది" అంటూ ఆ చీటీని సుందర్రావు చేతిలో పెట్టి లోపలకు తుర్రు మన్నాడు సుందర్రావు సుపుత్రుడు బుజ్జిగాడు.

'ఏవిట్రాసిందో ఏవిటో?' అనుకుంటూ ఆ చీటీని విప్పి చదివిన సుందర్రావు ఓ గట్టి నిట్టూర్పు విడిచేడు.

తాను 'పియర్‌లెస్' ఇన్సూరెన్సు ఏజన్సీ తీసుకున్నానని, బుజ్జిగాడి పేర్న ఓ ఇరవైవేలకైనా పోలసీ చేయమంటూ రాసి పంపింది బుజ్జిగాడి క్లాసు టీచరు.

సుందర్రావులో కోపం అధికం అయింది.

"ఛీ...ఛీ! వెధవ కాన్వెంట్లూ.... దిక్కుమాలిన టీచర్లూ. పిల్లల పేర్న ఇన్సూరెన్సు చేయాలట. చేయకపోతే ఏం చేస్తుందో?" అనుకుని మళ్ళా మనసులో



భయం పుట్టడంతో దిగాలుగా అయి పోయాడు సుందరరావు.

ఉన్నది బుజ్జిగాడొక్కడే. లేకలేక పుట్టేడు. మామూలు బళ్లోనయితే మిగతా మామూలు కుర్రాళ్ళతో కలిసి చదువు ఎగ్గొడతాడేమోనన్న అనుమా నంతో ఇంగ్లీషు కాన్వెంట్‌లో జేర్పిస్తే ఇదీ వరస...!

రైపిన్ను దగ్గర్నుంచి బూట్ల లేసుల్దాకా యూనిఫాం, ఆ తరువాత బండెడు పుస్తకాలూ, వందలకొద్దీ ఫీజులూ బుద్ధితక్కువై జాయిన్ చేసేనేమోనన్న సందేహం వచ్చింది సుందరరావుకు. అయితే ఆ వెంటనే అతని బుర్రలో తళుక్కున మెరిసిందో ఆలోచన.

'అవును అలాగే చెయ్యాలి.... అదే సరైన మందు. ఈ దెబ్బతో ఆటకట్టు' అనుకున్నాడు.

మరునాడు ఉదయాన్నే బుజ్జిగాణ్ని తీసుకుని వాడు ఇంగ్లీషు చదువు వెలగ బెట్టే కాన్వెంటుకు వెళ్ళేడు.

ప్రిన్సిపాల్ రూములోకి ప్రవే శించాడో లేదో....ప్రిన్సిపాలే ముందుగా బుజ్జిని, ఆ వెనక సుందరరావుని చూసి కూర్చోడానికి కుర్చీ ఆఫర్ చేసింది. ఆ వెనక అసలు వచ్చిన పనేమిటో తెలియజేయమని చక్కటి ఇంగ్లీషులో సుందరరావుకి, వీలైతే బుజ్జిగాడికీ అర్థ మయ్యేలాగా అడిగింది.

సుందరరావు ఓసారి గొంతు సవరించు కున్నాడు. గుండెల్లోని ధైర్యం గొంతు లోకి వచ్చింది. బుజ్జిగాడి క్లాసు టీచరు తనకు రాసి పంపించిన ఆ చీటిని ఆమె ముందుంచి 'ఏమిటిది?' అన్నట్లుగా చూసేడు.

ప్రిన్సిపాల్ ముందుగా ఆ చీటిని అందుకుని నెమ్మదిగా చదువుకుంది. అంత వరకూ ఆమె ముఖంలో వెలుగుతున్న చిరునవ్వు మాయమై, ఆ స్థానే కోపం పుట్టింది.

"ఛీ ఛీ... ఈ టీచర్‌కు బొత్తిగా బుద్ధిలేదండీ! సారీ...వెరీసారీ! సుందరరావు గారూ! ఇకనుంచి ఆవిడ నుంచి ఇలాటి ఇబ్బందులు మీకు కలగవని హామీ ఇస్తున్నాను" అంది.

సుందరరావు ముఖం ఆనందంతో వెయ్యి కేండిలు బల్బులా వెలిగింది. సంతోషంతో లేచి నుంచోబోయాడు "థాంక్సండీ!" అంటూ. కానీ ఆమె కూర్చోమంది.

"అయినా ఇలా చీటీరాసి పంపించడం పేరెంట్స్ అండీ! ఆవిడ ఈమధ్యనే పియర్‌లెస్ ఏజన్సీ తీసుకుంది కాబోలు మరి నేనో..?సుమారు పదేళ్లుగా 'ఎల్లైసీ' ఏజంట్‌గా ఉన్నాను. మీరు ఎలాగైనా సరే బుజ్జి పేరనో, మీ పేరనో ఓ పాలిక వేలకు ఎల్లైసీ చేయించారంటే అది మీకూ, మీ బుజ్జికి ఎంతో ఉపయోగ పడుతుంది"

అని చెప్పి లేచి బీరువావేపు కదిలి అందులోంచి ఏవేవో కాగితాలు తీసి వెనక్కు తిరిగి చూసి నిర్ఘాంతపోయింది.

కారణం...?

అక్కడ సుందరరావుగానీ, బుజ్జిగాడు గానీ లేరు.

అదే నిమిషంలో సుందరరావు ఆ కాన్వెంట్ బయట రోడ్డుమీద బుజ్జిగాడితో సహా పరిగెడుతున్నాడు- "వెధవ కాన్వెంట్ ....వెధవ టీచర్లు... వెధవ ప్రిన్సిపాలూ!" అనుకుంటూ.

-యం. ఉమామహేశ్వరరావు

ఎర్రటి మంటలు భుగభుగలాడ్తూ జ్వాలల నాలుకలు చాస్తూ, బుస్సుమని బుసలుకొడుతూ గాలిలోకి చూసుకొస్తున్నాయి. పురోహితుని కంఠంలోంచి శ్రావ్యంగా వెలువడే ఇంద్ర స్తోత్రాలకి పరవశించి పడగవిప్పి ఆడే వెయ్యితలల నాగులా మంటలు పిచ్చిగా ఊగుతున్నాయి.

వరుణదేవుణ్ణి శాంతింపజేయడానికని శివాలయంలో జరుగుతూన్న ఆ యజ్ఞానికి హాజరయ్యానంటే నేనేదో భక్తుణ్ణని కాదు. కేవలం సమాజ సంక్షేమ సౌభ్రాత్ర సమితి అధ్యక్షుని సంతోషంకోసం మాత్రమే వెళ్లాను. నిజం చెప్పాలంటే నామట్టుకి నాకది కేవలం వ్యాపార వ్యవహారం. రాష్ట్రంలో సంభవించిన వరదల తాలూకు భీభత్సాన్ని చిత్రించే పని ఆ సమితి నాకప్పజెప్పింది. వరద భీభత్సాన్ని నా సజీవ చిత్రాల్లో చూసి ప్రజలు కదిలిపోవాలని సమితి ఆశయం. ప్రజల్ని కదిలించటానికి తలపెట్టిన కార్యక్రమంలో భాగంగా ఏర్పాటుచేయబోయే చిత్రకళా ప్రదర్శన కోసం సమితివారు నన్ను బొమ్మలు గీసిపెట్టమని కోరారు.

జంటనగరాల్లో ఇంకా పెనువాన కురుస్తూనే ఉంది. మూసీనదికి ముంపొచ్చి ఒడ్డుకి ఇరుపక్కలా వున్న పల్లపు ఇళ్లన్నిటినీ ఊడ్చేసింది. చుట్టూ ఎటు చూసినా భీభత్సం తాండవిస్తోంది. నదిలో కొట్టుకొచ్చిన శవాలు అంత్యక్రియలకు నోచుకోక దిక్కూ మొక్కూ లేకుండా దీనంగా పడున్నాయి.

శివాలయం నుంచి బైటపడి నేను ఇల్లు చేరుకునేసరికి సాయంత్రమైంది. గదిలో అడుగుపెట్టానోలేదో ఫోను మోగింది.

"ఎవరూ....?"

జవాబులేదు.

"హల్లో...ఎవరండీ మాట్లాడేది?"

మౌనమే సమాధానం. ఓ క్షణం తరవాత అవతలి కంఠం మోగింది.

"మిసెస్ రామకృష్ణ ఉన్నారాండీ?"

అది పురుష కంఠం....గొంతు కొద్దిగా వొణికింది. నాలిక చప్పరించిన చప్పుడు వినిపించింది.

"ఇంట్లో లేరు. వచ్చాక ఏమైనా చెప్పమంటారా?"

మళ్ళీ ఓ క్షణం మౌనం.

పరుగు పందెంలో ఓడి అలసిపోయినవాడిలా అవతలి వ్యక్తి రొప్పటం ఫోన్లో తెలుస్తూనే ఉంది.

"ఆమెతోనే చెప్పాల్సిన..." అవతలి వ్యక్తి నీళ్లు నమిలాడు.

చలికాలం ఉదయం దట్టంగా పట్టే పొగమంచులా నా మనస్సులో ఓ వెధవ ఊహ...నా మేరీ కొత్త ప్రేమికుణ్ణి పట్టలేదుగదా!

"మీ పేరు తెలుసుకోవచ్చా...ప్లీజ్?" చివరి మాట ఒత్తి పలుకుతూ అడిగాను. నాలికమీద మర్యాద ఒలికించినా మనస్సులో సెగలు పొగలు కక్కుతున్నాను.

"జార్జి" అంటూనే ఫోన్ పెట్టేశాడు.

లోగడ రెండుసార్లు నేను ఫోన్ ఎత్తేసరికి అవతలివాళ్లు ఫోన్ పెట్టడం గుర్తుకొచ్చింది. నాలిక చేదెక్కిపోయినట్టు, కడుపులో దేవినట్టు వెధవ బాధ.

సోఫాలో వాలిపోయాను. మనస్సులో సుడిగుండాలు. బైట పూనకం వచ్చిన దయ్యంలా పెనుగాలి. కిటికీ రెక్కల్ని ఊడ్చి ఊడ్చి కొడుతూ వాన విసురు.

లైటు వేశాను. ఉరికంబానికి వేలాడే శవంలా పైన చాండిలీర్.

బైట గేటుముంగిట కారాగిన చప్పుడు




మేరీ వడిగా అడుగులేస్తూ లోపలికొచ్చింది.

"ఎక్కడికెళ్ళావ్?" నెమ్మదిగా అడిగాను.

"షాపింగ్" అంది మేరీ.

"ఇక్కడ దిగబెట్టి వెళ్ళినవాళ్ళెవరు?"

"ఎవరో 'లిఫ్ట్' ఇచ్చారు"

"ఎవరో!" మేరీకేసి గుచ్చి గుచ్చి చూస్తూ ఎద్దేవగా గునిశాను.

"యస్..."

"ఆ 'ఎవరో' ఎవరట?"

"స్టోర్స్‌లో ఏదో కొంటానికి వచ్చిన ఓ పెద్దమనిషిలే. చాలా మంచివాడు! లేకపోతే ఈ వర్షంలో..."

ఆమెని మాట పూర్తిచెయ్యనీకుండా, "నీ కోసం ఎవరో ఫోన్ చేశారు!" అన్నాను.

"ఎవరు?"

"జార్జ్!"

"ఓ... ఏం చెప్పాడు?"

"నథింగ్" అన్నాన్నేను.

"అలాగా" అంది చిరునవ్వు నవ్వి.

"ఎవరతను?" తీవ్రంగా అడిగాను.

"నువ్వెరగవ్" అంది నిర్వికారంగా.

"మిస్టరీ దట్టమవుతోంది" అన్నాను కవ్వింపుగా.

"నీకేమైనా పట్టిందా రామీ?" అంటూ గదిలోంచి అవతలికి విస విస నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

ఛీ... సిగ్గులేదు. లోలోపల కుళ్ళిపోతూ లేచి తలుపు బిగించి వచ్చాను. పైకప్పు విచ్చుకున్నట్టు, సిమెంటు పెళ్ళలు,ఇనప కమ్ముల గుట్టలో ఇరుక్కుపోయినట్టు ఉక్కిరిబిక్కిరయ్యాను. ఓ గంటపోయాక మేరీ తలుపుతట్టి భోజనానికి కేకేసింది. "నాకు ఆకల్లేదు. సన్నిట్లా వొదిలెయ్" అనరిచాను.

"మళ్ళీ నీకు తిక్కరేగిందన్నమాట!" గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

పరాకుగా, చిరాకుగా గదిలో పచార్లు చేశాను. అనుమానం పెనుభూతంలా నా మనస్సు తొలిచేస్తోంది. నా దగ్గర 'ఆర్ట్' నేర్చుకుంటున్నదాన్ని,అందునా నాకులం, జాతికానిదాన్ని పెళ్ళాడి రెండందాల ఫూల్‌ని అయ్యానా? పైగా మేరీ పెయింటింగ్‌ని వృత్తిగా స్వీకరించిన వ్యక్తి కాదు. అప్పుడప్పుడూ ఒకటీ అరా బొమ్మలు గీసేది అంతే. పోసి...

ఇప్పుడీవిడ ఓ ప్రేమికుణ్ని పట్టింది. కళ్ళెత్తి సీలింగుకేసి చూశాను. తడికి పడ్డ మాసికమీదే నా చూపు నిలిచిపోయింది. మచ్చల మచ్చల పొట్టమీద పాకే రాకాసి కోరల బల్లి ఆకారంలో ఉందా మాసిక. వారం రోజులబట్టి మృత్యువును తైలవర్ణ చిత్రంగా గిద్దామనే ఆలోచనతో సతమతమవుతున్నాను. మనిషివో, మృగానివో ప్రేగులు ముక్కున పట్టి, తుక్కుతుక్కయిపోయిన పిట్టగోడమీద భీకరంగా కూర్చున్న నల్లటి రాబందు రూపంలో మృత్యువుని చిత్రించాలని ఆలోచన చేశాను. ఇప్పుడేమో సీలింగు మీద ఆ తడి మాసిక...అది తలపించే ఆకారం.... ఏదో అజ్ఞాతశక్తి ఆ మృత్యువు స్వరూపాన్ని నా కళ్ళముందు నిలిపిందా అనిపించింది. ఆ వికృతమైన ఆకారంకేసి చూస్తూ నిద్రలోకి జారిపోయాను.

మర్రోజు ఉదయం మేరీ మొహం చూపించనే లేదు. ఇంకా నిద్రపోతూనే ఉందేమో! వెనక వరండాలో బ్రేక్‌ఫాస్ట్ సిద్ధం చెయ్యమని రాముని కేకేశాను. టేబుల్ ముందు కూర్చోగానే తెల్లటి మెత్తటి బొచ్చు కుక్క పీటర్ నా ముఖవైఖరి తీక్షణంగా ఉంటం కనిపెట్టినట్టుగా నా పక్కన ముడుచుకుని పడుకుంది.

తలెత్తి బైటికి చూశాను. వాన వెలిసింది. సూరీడు మొహం చూపిస్తున్నాడు. బ్రేక్ ఫాస్ట్ ముగించి లేచి వెళ్లబోయే క్షణంలో రామూ పత్రిక తెచ్చాడు.

"ముందే ఎందుకు తేలేదు? కాఫీ తాగుతూ చూసేసేవాణ్ణిగదా" అన్నాను కోపంగా.

"సారీ సర్" బిక్కమొహం పెట్టాడు.

"పోయి కార్లో పెట్టు. రాత్రికి నేనొచ్చేసరికి పొద్దుపోతుందని అమ్మ గారికి చెప్పు. నాకోసం వంటచెయ్యొద్దు.... తెలిసిందా?"

"సరే సర్"

మేరీకీ, నాకూ మధ్య పొరపొచ్చా లొచ్చిన రహస్యం తనకు తెలిసినట్టుగా అతని కళ్లు చెబుతున్నాయి. నేను వరండా దాటి బైటికొస్తుంటే నా పెంపుడు కుక్క దీనంగా నా వెనక అడుగులో అడుగువేస్తూ నడిచింది. కాని, దాన్ని దగ్గరకి తీసుకుని లాలించే మూడ్‌లో లేను.

కారు స్టార్ట్ చేశాను. బ్రిడ్జి ఇంకా పూర్తిగా దాటనైనా లేదు. నాముందు పెద్ద శవ యాత్ర సాగిపోతోంది. తప్పనిసరై ఊరేగింపు చివర్న కారు నిలిపివేయాల్సి వచ్చింది. రోడ్డుమీద ట్రాఫిక్ బందయింది. ఎలాగోలా ఊరేగింపుని తప్పించుకుని దాటి వెళ్లాలని సైకిళ్లు, కార్లు తిప్పలు పడుతున్నాయి. రోడ్డు పక్కన నిలబడ్డ వాళ్లు, దుకాణాలవాళ్లు, రోడ్డుమీద నడిచి వెళ్లేవాళ్లు యావన్మంది దృష్టి శవంవేపు లగ్నమైవుంది. కారు ఓ పక్కన పార్క్ చేసి, ఊరేగింపు వెనగ్గా నడిచాను.

"ఎవరిదండీ ఈ ఊరేగింపు?" అనడిగాను నాముందు నడుస్తున్న వ్యక్తిని. అతని బట్టలు మురిగ్గా వున్నాయ్. ఇనప సామాను బాగుచేసే మనిషిలా ఉన్నాడు.

"రామస్వామిది. పొద్దున పేపర్లో చదవలేదా?"

"చదవలే. లేబర్ లీడర్ రామస్వామా?"

"ఔను. నిన్న రాత్రి కారు ప్రమాదంలో చనిపోయాడు"

"అయ్యో....! పాపం..."

"నా కళాపోషకుల్లో ఒక పెద్దమనిషి పోయాడు! ప్చ్.... వివాదాస్పదమైన వ్యక్తే. కానీ కపటం ఎరగని మనిషి. ఎప్పుడూ సరదాగా ఉండేవాడు. అటు వంటి మనుషుల్తో మాట్లాడ్డమంటే నాకు మహా ఇష్టం. ఆయన నా ఆర్ట్ స్టూడియో కొచ్చి కూర్చున్నప్పుడల్లా నూరు కేండిళ్ల బల్బు జేగీయమానంగా వెలుగు తున్నట్టుండేది. అన్నట్టు ఆయన చిత్ర పటం ఒకటి తయారుచేశాను. నాకు ఘనంగా పారితోషికం ముట్టజెప్పాడు. నా స్టూడియోకొస్తూ ఉత్తి చేతుల్తో వచ్చే వాడు కాదు. స్కాచ్ సీసాయో, కనీసం డైజిన్ అయినా తేకుండా రాలేదు. మందొక్కటే ఆయన బలహీనత కాదు. పక్కన మగువ లేకుండా ఒంటరిగా నా స్టూడియోని ఎన్నడూ పావనం చెయ్య లేదు.

ఒకేఒక్కసారి మాత్రం పక్కన సాక్షి లేకుండా ఒంటిగా వచ్చాడు. ఓ పట్టుపట్టి చూద్దామని రామస్వామిని మాటల్లోకి దించాను. ఆనాటి సాయంత్రం మా ఇద్దరి మధ్యా నడిచిన సంభాషణ యావత్తూ మనస్సులో మెదిలింది.

"ఈ బొమ్మ మీరు సొంతానికి గియించుకుంటున్నారా?" అనడిగాను ఉద్దేశపూర్వకంగా.

"లేదు. మా యూనియన్ హాల్‌లో నా బొమ్మ తగిలించాలని మావాళ్లు ఉబలాటపడుతున్నారు. ఏం.... అమరజీవి నయ్యే హక్కు నాకు మాత్రం లేదా?" అన్నాడు.

"ఈ ఖర్చు ఎవరు భరిస్తున్నారు?" అనడిగాను.

"వర్కర్లు. వాళ్ళకి నేను బోనస్‌లు, స్పెషల్ లీవు, వైద్యసౌకర్యాలు, ఆఖరికి సమ్మెకాలానికి పూర్తి జీతం ఇప్పించగా లేంది, నాకీమాత్రం చెయ్యలేరా వాళ్లు!"

అతని ధోరాతనం చూసి నాకాశ్చర్యం వేసింది.

"నన్నొకమాట చెప్పనివ్వు. సీలో కొంచెమో గొప్పో పెద్దతనం లేకపోతే జనానికి నువ్వేమీ చెయ్యలేవు. అయినా నేను మరీ అంత దురాగ్రహుణ్ని కాను. మీబోటివాళ్ళతో నా సుఖాలు పంచుకుంటూనేవుంటాను" అన్నాడు నా కళ్ళలోకి సూటిగా చూస్తూ.

క్షణం ఆగి...

"నేవచ్చినప్పుడల్లా త ప వ కొ క అమ్మణ్ని ఎందుకు వెంట తెస్తానో తెలుసా?" అని గుసగుసలాడాడు.

"తెలీదు"

"పగలంతా పని చేసి చేసి అలసిపోయాక కాస్సేపు రవ్వంత మజా చేసుకోవాలని ఉండదూ?"

"ఉంటుంది" అని నసిగాను చిరునవ్వు నవ్వి.

"ఆ గుమ్మల్లో ఎవరైనా నచ్చారా?"

విస్తుపోయి ఆయనకేసి చూశాను.

"వాళ్ళలో మీకు నచ్చిన గుమ్మని ఏరుకోవచ్చు. పైకలా బీదగా కనపడొచ్చుగాని, పక్కలో పంచదార చిలకలు" అని ముసిముసినవ్వులు నవ్వాడు.

"నాకా అవసరం లేదు" అన్నాను తబ్బిబ్బుపడుతూ.

ఈ సంభాషణను మనస్సు నెమరేస్తోంటే, ఊరేగింపుకేసి చూశాను. ఊరేగింపు ముందు ఇద్దరు సన్నాయి వాద్యగాళ్లు సన్నగా గుండెలుకోసే విషాదరాగం పలికిస్తున్నారు. వాళ్ళ వెనక మరో ముగ్గురు వాద్యగాళ్లు వెర్రెత్తినట్టు డోళ్లు వాయిస్తున్నారు. మధ్యాహ్నపు ఎండలో మెడలమీంచి కారే చెమటలో వాళ్ల వీపులు నిగనిగలాడుతున్నై. రామస్వామి బ్యాండుమేళంతోసహా స్వర్గానికి వెళ్తున్నాడా అనిపించింది. స్వర్గంలోనూ అతనికోసం మదిర, మదవతులు ఎదురుచూస్తుండొచ్చనుకున్నాను.

ఊరేగింపులోని ఆడవాళ్లకేసి చూశాను. కన్నెవయసువాళ్ళూ, కమ్మని అందం గలవాళ్లూ కూడా ఉన్నారు. వాళ్లలో ఎందరికీ సరస సుందరుడితో పరిచయం ఉందో! వాళ్ల మొహాల్లో విషాదం గూడుకట్టుకొనివుంది. రామస్వామి వీళ్లందరికీ హెచ్చు జీతాలు, బోనసులు, వీటన్నిటినీ మించి ప్రేమ తెచ్చిపెట్టలేదూ! ఏం ఇప్పిస్తేనేం, ఎన్ని ఇప్పిస్తేనేం... రామస్వామి మరికలేడు! మళ్లీ పునర్జన్మ అంటూ వుంటే, అదృష్టం కలిసిరాక మానవ జన్మ కలగకపోతే రామస్వామి ఆంబోతుగానైనా మళ్లీ పుడతాడు.

* * *

ఆ స్మశానం 'మృత్యుమార్గ్' అనే ఓ ఇరుకు గల్లీ చివర్న ఉంది. బంజారా రాతితో కట్టిన గంభీరమైన గట్టి కట్టడం అది. బైట భారీ కొయ్య గేటు. దానికొక రాకాసి ఇనుప గొలుసు వేలాడుతోంది. ఆ హంగామా చూస్తే, మొఘల్ కోట ముఖ





ద్వారం జ్ఞాపకం వస్తుంది. అయితే గేటు పగలూ రాత్రీ తెరిచే ఉంటుంది. సమయం కాని సమయంలోనైనా శవాలకు స్వాగతం చెప్పటానికి బార్లా తెరిచి వుంటుంది.

ప్రధాన ద్వారంపైన యమధర్మరాజు నిలువెత్తు విగ్రహం దర్శనమిస్తుంది. గుండ్రటి ప్రాకారానికి ఇరువైపులా రాముడు, కృష్ణుడు, గణపతి ప్రభృత దేవతా విగ్రహాలు తొంగిచూస్తుంటాయి. గేటుదాటి లోపలికి అడుగుపెడితే అది ఓ క్రీడా మైదానంలా కనిపిస్తుంది.

రామస్వామి శవయాత్ర స్మశానానికి చేరుకోగానే ఊరేగింపు వెంట నడిచిన ఆడవాళ్లు ఆ ఇరుకు గల్లీలోనే నిలిచి పోయారు. పురుషులు మాత్రం శవం వెనక నిర్వికారంగా స్మశానవాటికలోకి నడిచారు.

శవయాత్రలో పాల్గొన్న వాళ్లలో చాలా మంది ప్రముఖులు కనిపించారు. పారిశ్రామికవేత్తలు, ప్రైవేటు - ప్రభుత్వ పరిశ్రమల మేనేజింగ్ డైరెక్టర్లు, లేబర్ డిపార్ట్‌మెంటు సీనియర్ అధికార్లు వగైరా పెద్దలంతా మల్లెమాలలు గులాబిదండలు పట్టుకొని మరీ వచ్చారు. మృతదేహం పైన దండలు,పుష్పగుచ్ఛాలు ఉంచబోతూ చుట్టూ చూశారు. కార్మికులంతా తమవేపు చూస్తున్నారో లేదో అని వాళ్ల ఆదుర్దా. మరికొంతకాలం సమ్మెలు జరక్కుండా గడువు పొడిగించేలా కార్మికుల్ని ఆకట్టుకోడానికి ఈ సందర్భాన్ని సద్వినియోగం చేసుకోవాలని వాళ్ల ఆరాటం, ఆయాసం.

ప్రహరీ దక్షిణపువేపు కొసన జనానికి దూరంగా ఒంటరిగా నిలబడ్డ సింగ్ వేపు చూశాను. అతను కంప్యూటర్ సంస్థ డైరెక్టరు. అది రక్షణశాఖ తాలూకు రహస్య విభాగం. అందులో సమ్మెలు గట్రా జరక్కుండా సరిచూసుకున్నాడు.

ఏమైనా అతని రాకలో ఏదో విశేషం ఉందనిపించింది.

"మీరు కూడా వచ్చారేమిటి?" అన్నాను అతనివేపు నడిచి. గేటుదగ్గర పూలదండల్తో, పుష్పగుచ్ఛాలతో నిలబడ్డ ప్రముఖులవంక చేయి చూపిస్తూ "మీకూ కార్మిక సమస్యలున్నాయాయేం?" అనడిగాను.

అతను చిరునవ్వు నవ్వి "అబ్బే..అదేం లేదు. రామస్వామి తమ్ముడు నా దగ్గర క్లర్కుగా పనిచేస్తున్నాడు" అన్నాడు.

''అలాగా!'' అన్నాను.

రోజూ సాయంత్రం మేమిద్దరం క్లబ్‌లో కలుస్తూనే ఉంటాం. ఈమధ్య వారం రోజులుగా, ముఖ్యంగా నేను సౌభ్రాత్ర సమితివారి పని తీసుకున్నాక పరస్పరం కలవటం పడలేదు.

చితి పేర్చడం దాదాపు పూర్తయింది. తెల్లటి పట్టుబట్టలు కప్పిన రామస్వామి శవం కట్టెలపోగు అడుగున పూడి పోయింది. కర్పూరం, నెయ్యి చల్లాక రామస్వామి పెద్దకొడుకు చితికి నిప్పంటించగానే భగ్గున మంటలేచింది. పురోహితుడు శ్లోకాలు చదివాడు. ఆ తంతు జరుగుతున్నంతసేపూ సింగు నా పక్కనే నిలబడున్నాడు. మధ్యాహ్నం కావచ్చింది. చితి కణకణ మండుతోంది. క్రమంగా రామస్వామి మృతదేహం బూడిద కుప్పయింది.

సింగ్, నేనూ గేటువేపు కదిలాం. జనం తోసుకుంటూ స్మశానంనుంచిబయట పడి గల్లీగుండా ఇళ్ళకు మళ్లారు. మృత్యు మూర్తిలో తొక్కిసలాడే జనం మధ్య నుంచి నడుస్తోంటే పాపవిమోచనస్థానం గుండా ప్రయాణం చేస్తున్నట్టనిపించింది.



ఆ గల్లీలోనుంచి బయటపడి రోడ్డెక్కాక ఊపిరి పీల్చుకున్నాను.

"పునర్జన్మలో మీకు నమ్మకం ఉందా?" అనడిగాను సింగుని.

"నేను నమ్ముతాను"

"సైంటిస్టులుగదా! మీరు కూడానా?"

"సైన్సు నా నమ్మకాన్ని ధృవపరిచింది" అన్నాడు సింగు దృఢంగా.

"ఎలా?"

"చూడండి...భగవంతుడు ఈ ఆత్మలన్నిట్నీ తన గిడ్డంగుల్లో గుట్ట పోస్తున్నాడా? మళ్ళీ ఆత్మల్ని జీవితంలోకి పునఃప్రవేశ పెడుతున్నాడు. నిశీధి గడిచాక సూర్యుడు నూతనోదయం పొందినట్టు, ఆవిరిగా మారిన సముద్రజలం మళ్ళీ వాన రూపంలో సముద్రాలని చేరినట్టు. శక్తిని పొదుపు చేయటమంటే ఇదే. లేకపోతే ఇన్ని కోట్ల ఆత్మల్ని నమోదు చేసుకోవాలంటే భగవంతుడు కంప్యూటర్లు వాడవలసివస్తుంది"

"పునర్జన్మకి సంబంధించి మీరింతటి చక్కటి సిద్ధాంతం దగ్గర పెట్టుకున్నారని నాకు తెలీదు" అన్నాను ఆయనిచ్చిన అద్భుత వివరణకి ముగ్ధుణ్నయిపోతూ.

"ఇది మామూలు లోకజ్ఞానమేగాని ఊహాకల్పన కాదు" అన్నాడు సింగ్.

"మీకు తెలుసోలేదో మీలాంటి వ్యక్తి తప్పకుండా మళ్ళీ జన్మలో కూడా మానవుడుగానే పుడతాడు. అంతేకాదు– గొప్ప కులీనవంశంలో పుడతాడు" అన్నాను.

ఆయన కాస్త సిగ్గుపడిపోయి కళ్ళు వాల్చి "నా సంగతేమో చెప్పలేనుగాని, నా పెంపుడు కుక్క టోనీ మాత్రం వచ్చే జన్మలో మనిషిగానే పుడుతుంది" అన్నాడు.

కుక్కలన్నా, సంగీతమన్నా మా ఇద్దరి అభిరుచులూ ఒక్కటే. నేనయితే ఒక్క పీటర్‌నే పెంచుతున్నాను. సింగ్ దాదాపు పది పన్నెండు కుక్కల్ని పెంచు తున్నాడు. అవంటే అతనికి గొప్ప మక్కువ.

"రామస్వామి అంత్యక్రియలు చూశాక నాకేమనిపించిందో తెలుసా! కర్పూరం, నెయ్యి, మంత్రాలు వగయిరా సకలహంగామాతో నా టోనీ కూడా అంత్యక్రియలు అట్టహాసంగా జరుపుతాను. దాని అస్థికల్ని గంగానదిలో నిమజ్జనం చేస్తాను. దానికాయోగ్యత ఉంది. అది చచ్చిపోతే నేరుగా స్వర్గానికే వెడుతుంది. ఎందుకంటే కుక్కలకున్న నిబద్ధత అటు వంటిది. అది శాశ్వతం. యజమాని మాటని ఎన్నడూ జవదాటదు. దానికి ఆశ లేవు, మోసం తెలీదు. యజమాని ముందు ఒకరకంగా, వెనక వేరేగా ప్రవర్తించటం ఎరగదు"

"నేను ఇపుడు పెద్ద తప్పుచేసిన వాడిలా ఫీల్ కావాల్సి ఉంది. ఎందు కంటారా... ఈ ఉదయం పీటర్‌ని కసురు కున్నాను. చాలా నిర్దయగా ప్రవర్తించాను" అన్నాను.

"అదొక మానసికమయిన క్రూరత్వం. అదే మీమీద ఉన్న ఫిర్యాదు. అయినా, కుక్కలు మీకు ఎదురు తిరగవు. చని పోయేదాకా మిమ్మల్నే అంటి పెట్టుకుని ఉంటాయి" అంటూ సింగ్ ఓక్షణం ఆగాడు. "సరేగానీ... అలా ఎందుకు ప్రవర్తించారు?" అనడిగాడు మరుక్షణం.

"అది అప్పుడప్పుడూ నాకు రేగే తిక్క అనుకుంటా" అన్నాన్నేను.

మేం ఇద్దరం పద్దెనిమిదేళ్ళనుంచి స్నేహితులుగా మెలుగుతున్నాం, ఎంతో చనువుగా వ్యవహరిస్తున్నాం, మేరీ గురించి నాలో రేకెత్తిన అనుమాన పిశాచం గురించి అతనికి చెప్పలేకపోయాను. ప్రాణ స్నేహితులముందు కూడా బైట పెట్టగూడని కొన్ని విషయాలుంటాయి గదా!

మృత్యుమార్గంలో రద్దీ తగ్గి, సందడి సమసిపోయాక సింగ్ ఇంజను స్టార్ట్ చేశాడు. దూరంగా పార్క్ చేసిన నా కారు దగ్గర దింపి, "ఈ రాత్రి నాతో కలిసి డిన్నరుకు కూర్చోగూడదూ?" అన్నాడు.

"సారీ... ఈరాత్రి నాకు వేరే ఎంగేజ్ మెంట్లున్నాయ్. ఇంకోరోజు కలిసి కూర్చుందాం" అన్నాను.

"రజియాతోనా?" అనడిగాడు నవ్వుతూ.

"వెల్..." నేను నీళ్ళు నమిలాను.

"ఈ చావులు, చితిమంటలు చూశాక కూడానా? ఏంటో...ఇది నాకంతుబట్టదు" అన్నాడు సింగ్.

"భయంకరమైన ఈ అనుభవాన్ని మర్చిపోవాలంటే అవిడే మత్తుమందులా పనిచేస్తుందేమో!"

"తప్పకుండా అలా పని చెయ్యాలనే నా కోరిక... గుడ్‌లక్!"







# 2

ఆ సాయంత్రం రజియాతో గడపాలని పెరపెరలాడానంటే నామనస్సులోని బాధ మర్చిపోదామనే తప్ప వేరే విశేషమేమీ లేదు. నిన్నటినుంచి ప్రతిదీ అడ్డం తిరుగుతోంది. తాడు కూడా పామై కరుస్తోంది.

క్లబ్‌లో లేటుగా లంచ్ పూర్తిచేసి నా స్టూడియోకి ఫోన్ చేశాను. నౌకరు ఫోనెత్తాడు. "సేఠ్ కిశోరీలాల్‌ని రేపు రమ్మన్నానని చెప్పు" అని ఫోన్ పెట్టేశాను. అతని బొమ్మ దాదాపు పూర్తయింది. ఒక్కరోజు ఆలస్యానికి నొచ్చుకోడనే నమ్మకంతో అలా పురమాయించాను. క్లబ్‌నుంచి కార్లో ఏకాయెకిని నా ఆఫీసుకు వెళ్ళి ముఖ్యమైన ఫైళ్ళు ఆదరాబాదరా చూసేసి రజియా ఇంటి వేపు దారి తీశాను.

గుల్షన్‌మంజిల్ లోపలికి కారు తిప్పాను. లాన్స్‌లో కాకీ బట్టలవాళ్లు తిరగడం చూసి విస్తుపోయాను. ఫౌంటెన్ పక్కన నిలబడి ఇద్దరు జవాన్లు చెవులు కొరుక్కుంటున్నారు.

మంజిల్ చివర్న రజియా గదికెదురుగా కారాపాను. నా కారు చప్పుడు విని రజియా కిటికీలోంచి తల బైటికి పెట్టింది. "ఏమిటో... ఈ ఉరుముల్లేనివాన!" అనరిచింది. నేను కారు పార్క్ చేసి మెట్లెక్కి ఆమె గదివేపు నడిచాను.

"ఈరోజంతా నువ్వు కనపడక పోతే నాకెంత 'ఇది'గా ఉందో తెలుసా?" అంది రజియా అభిమానంగా.

"నిజమా?"

"అవును. నీతో చాలా అవసరం ఉంది"

"నాకూను" అన్నానేను.

రజియా నా ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

"లాన్స్‌లో పోలీసులు విహరిస్తున్నారు. ఏమిటి కథ?" అనడిగాను.

రజియా ముఖం గంభీరమైపోయింది. "అంతా చెప్తాను. ముందు మందేమి కావాలో చెప్పు. స్కాచా, జిన్నా, షాంపేనా?"

"మందు తరవాత. ముందు ఈ పోలీసువాళ్ళ సంగతి చెప్పు" అన్నాను.

"మా తమ్ముడి ఘనకార్యం. నిన్న రాత్రి వాడేం చేశాడో తెలుసా? మా తోటమాలి కూతుర్ని రేప్ చేశాడు. అదసలే తల్లిలేని పిల్ల. ఇంకా మైనారిటీ కూడా తీరలేదు. రక్తస్రావం ఎక్కువై ఆ పిల్ల చనిపోయింది. వెధవ... ఎంత అఘాయిత్యానికి తెగించాడు?"

కుర్చీలో ముడుచుకుపోతూ "ఘోరం" అనరిచాను. "ఇంతకీ పోలీసువాళ్ళని ఎవరు పిల్చారు?" అనడిగాను.

"నౌకర్లే. బాబర్ పత్తాలేకుండా పారిపోయాడు. వాళ్ళంతా ఇప్పుడు బాబా మీద తెగబడ్డారు. తగినశాస్తి తప్పలేదు" అంది రజియా.

రజియాకి వాళ్ళ నాన్నంటే చెడ్డ రోత. వావి వరసా మర్చిపోయి అఘాయిత్యానికి తలపడే కిరాతకుడు. ఆయన



అమానుష ప్రవర్తన కారణంగానే తనతల్లి మరణించిందని రజియా నాతో చాలాసార్లు చెప్పింది. ఆమె తండ్రి మొఘల్ ప్రభు వంశీకుడు. ఫ్యూడల్ క్షీణయుగ లక్షణాలకు ఆయన మూర్తీభావం. బేగం బతికినన్నాళ్ళు భర్త ప్రవర్తనతో విసిగి వేసారిపోయింది. నవాబ్ సులేమాన్ అలీ రోజూ ఓ కొత్త నెరజాణని వెంటేసు కొచ్చి భార్య సమక్షంలోనే తన రసికతను సిగ్గువిడిచి ప్రదర్శించేవాడు. ఆయన విపరీత ప్రవర్తనకి వెగటు పుట్టుకొచ్చి ఆ ఇల్లాలు ఓ రాత్రి నిద్రమాత్రలు మింగి శాశ్వతంగా నిద్రపోయింది. మర్రోజు ఉదయం ఆమె విషాహారం భుజించడం వల్ల మరణించినట్లుగా డాక్టరు సర్టిఫికేట్ ఇచ్చాడు. ఆమె సమాధి ఫలకంమీద ప్రేమ కవితలల్లి చెక్కించాడు నవాబ్ సులేమాన్ అలీ.

రజియా మొహంలోకి తదేకంగా చూస్తోంటే ఆ విషాదగాథ నా మనస్సులో మెదిలింది.

చీకట్లు పరుచుకుంటున్నాయి. రజియా కళ్ళు మృగనయనాల్లా ధగధగలాడాయి.

"ఆ పిల్ల శవం ఎక్కడుంచారు?" అనడిగాను తడబడుతూ.

"సర్వెంట్స్ క్వార్టర్స్‌లో ఉంది. బాబా కేసు మాఫీచేయించాక 'హేమరేజ్' వల్ల చనిపోయిందనో, లేదా వేరే కథేదైనా గానీ బైట ప్రచారమవుతుంది. అంత్య క్రియలప్పుడు బాబా కన్నీళ్ళు తెచ్చిపెట్టు కొని ఆ కాస్సేపూ నటించవచ్చు" అంది రజియా.

చిత్రంగా ఉంది. ఉదయం బైల్దేరి నప్పటినుంచి రెండు చావుల సాలె గూళ్ళలో చిక్కుకున్నాను.

"ఉదయం నుంచి నేను పడ్డ యమ బాధ గురించి అడిగావుకాదు'' అన్నాను నేను.

రజియా ఆశ్చర్యంతో నోరు తెరిచింది.

"స్మశానం నుంచి వస్తున్నాను" అన్నాను.

"ఎవరు పోయారు?"

"రామస్వామి"

"అతను బాబర్‌కి తెలుసు. ఒకసారి బాబా కూడా మా భూముల విషయంలో అతన్తో గొడవపడ్డారు. చాలా తెలివైన వాడు...ఔనా?"

"ఔను. స్మశానం నుంచి సరాసరి ఇంటికివెళ్లి స్నానంచేసి రావాలని తెలుసు నాకు. అంత్యక్రియలకి హాజరైన హిందువు స్నానంచెయ్యందే మైల వొదల దని నీకూ తెలుసు..."

"స్నానందేముంది? ఇక్కడ చెయ్యి గూడదా ఏం! చిటికెలో ఏర్పాటు చేయిస్తా. బాత్‌రూంలో షవర్ కింద కూర్చుని శుద్ధి స్నానం చెయ్యి. బాబర్ ప్యాంటూ, షర్టూ వేసుకోవచ్చు. ఆ తర వాత హాయిగా పక్కలోకిరా. ఈ జీవితం దొర్లించటానికి ఇంతకన్నా రాజమార్గ మేముంది?" అంది రజియా. అవతలి గదిలోకి పోయి టవలు, బట్టలు తెచ్చి నా చేతుల్లో పెట్టింది.

"అక్కడ షవరు ఎదురుచూస్తోంది నీ కోసం. ఇక్కడ నేను ఎదురుచూస్తుం టాను నీ కోసం. శుభ్రంగా స్నానంచేసి నిగనిగలాడ్తూ సువాసనలు కక్కుతూ వచ్చెయ్" అంది రజియా.




బాత్‌రూంలోకి దూరి షవర్ తిప్పాను. గదిలోంచి రజియా పురమాయింపు విని పించింది. "ముంతాజ్! ఈ రాత్రి ఎవర్నీ ఇటుకేసి రానీకు....అర్థమైందా?"

బాత్‌రూంలోంచి నేను బైటపడేసరికి రజియా ఒంటిమీద నూలుపోగు లేకుండా విశాలమైన పాన్పుమీద వెల్లకిలా పడు కొని సవిలాసంగా నా చెయ్యందుకుని పక్కమీదికి గుంజింది. బెడ్ పక్కన టేబులుమీద షాంపేన్ బాటిల్, తళతళ లాడ్తూ రెండుగ్లాసులు సిద్ధంగా ఉన్నాయ్.

"బాప్‌రే...!"

పక్కలోకి చేరానేగాని ఒళ్లు వేడెక్క లేదు. ఉద్రేకం జగలు విప్పలేదు. ఆమె కవ్వించే వేళ్లు ఎక్కడెక్కడో తడువు తున్నాయేగాని నేను నిస్పృహాయంగా ముడుచుకుపోయి, ఉద్రేకరహితంగా పడుకున్నాను.

"డార్లింగ్! శవంలా ఒళ్లిలా చల్లగా ఉందేం?"

"శవంలానా?"

"ఇంకా స్మశాన వికారం పోలే?"

"ఆ పసిదాని రేప్ తాలూకు తల తిప్పు కూడా"

"అవన్నీ మర్చిపోలేవూ?"

"మర్చిపోగలిగితే బావుణ్ణు. సరేగానీ రజియా, కాస్సేపు మెదలకుండా పడు కుందామా!" అన్నాను నూతిలోంచి మాట్లాడుతున్నట్టుగా.

"అది అసహజంగా ఉండదూ!" అంది నన్నింకా వొత్తుకుంటూ. నా తలని రొమ్ముల మధ్యకి లాక్కుంది.

"ఏది సహజం?" ఎదురుప్రశ్న వేశాను. రజియా రొమ్ములమధ్య వెచ్చనిలోయలో నా కళ్లు, ముక్కు, నోరు, మొహం-మొత్తం పూడిపోయింది. అయినా నేను చలనం లేకుండా పడుకున్నాను. ఇలానే

నిర్వికారంగా ప్రశాంతంగా ఎందుకు పడుకోగూడదు అనుకున్నాను మనస్సులో. ఒకరికొకరు రెచ్చిపోయి, గాఢంగా వొత్తుకుంటూ, రక్కుకుంటూ, గిచ్చుకుంటూ, తోసుకుంటూ, పూసుకుంటూ, సన్నగా మూలుగుతూ, పారవశ్యంతో అరుస్తూ శరీరాలు రెండూ సర్కసు ఫీట్లు చేస్తేనే అది శృంగారమా?

రజియా చివాల్న పక్కకి జరిగి తల విదిలించి, "షాంపేన్ చప్పరిద్దామా!" అంది.

"అలానే" అని గొణిగాను నా ఆలోచనల్లోంచి బైటపడుతూ.

ఒక్క గుక్క కొట్టాక నా కళ్ళు ఆ ఒళ్ళు తాలూకు ఒంపు సొంపుల్లో, ఎత్తు పల్లాల్లో లోతుగా దిగబడిపోయాయి. రజియా పెదాలమీద నాజూకు చిరునవ్వు రేఖ విరిసింది. ఆమెకి తెలుసు నేను తన నగ్న శరీర సౌందర్య మధువుని కళ్ళతో జుర్రుకొంటున్నానని, ఎడారి వెర్రి గాలులు త్రిమూర్తి ఆకారంలో తీర్చి దిద్దిన తిన్నెలాంటి ఆ నున్నని ఒంటిని కళ్ళతో తాగేస్తున్నానని. కంటికి కనిపించని పట్టుదారాలు గాలిలోకి పట్టి లేపిన ఆమె శరీరాన్ని మనస్సులో హత్తుకున్నాను. ఆమెని నగ్నంగా చిత్రించాలని కలలు కంటూ ఆ శరీర విన్యాసాన్ని రకరకాలుగా మనసులోనే చిత్రించుకుంటున్నాను.

హఠాత్తుగా బైట కేకలు, అరుపులు, నినాదాలు.

"న్యాయం కావాలి"

"ప్రతీకారం జరగాలి"

రజియా తుళ్ళిపడి లేచింది. మొహం పాలిపోయింది. ఒళ్ళు భయంతో సన్నగా వొణికింది.

"నౌకర్లు కేకలు వేస్తున్నారు. మళ్ళీ గలభా మొదలయినట్టుగా ఉంది" రజియా గొంతు బొంగురుగా మోగింది.

ఆ కుటుంబగొడవల ఉచ్చు నా మెడకి బిగించుకోడం నాకు సుతరామూ ఇష్టం లేదు.

"రజియా... నేను త్వరగా బైట పడ్డం మంచిదనుకుంటాను. సారీ! కోరింది నెరవేర లేదు..." అంటూ చకచకా బట్టలు వేసుకుని బైటపడ్డాను.

ఇంటికిచేరేసరికి బాగా పొద్దుపోయింది. అలసిపోయి ఉన్నానేమో, సోఫా మీద నడుం వాల్చీవాల్చగానే గాఢ నిద్ర పట్టేసింది.

సుదీర్ఘ, శాశ్వత నిద్ర పట్టేసింది.



## 3

గుట్ట కొట్టకొసన కూర్చుని వరద బీభత్సదృశ్యం చిత్రిస్తున్నాను. ఎదురుగా దిగువన పరవళ్ళు తొక్కే మూసీ. తిమింగలం మొగ్గవేసి భయంకరమైన అల్లకల్లోలం సృష్టిస్తున్నట్టుగా ఉంది.

చివాల్న నా స్కెచ్ బుక్ మీద ఏదో నీడ పడింది. అంతలోనే ఎవరిదో చెయ్యి ముందుకి చాపినట్లనిపించింది. తల తిప్పి చూసేలోపే ఎవరో నన్ను బలంగా తోసేసినట్టు బిలియర్డ్స్ బంతిలా కిందికి దొర్లుకుంటూ మూసీలో పడ్డాను. ఇసుకలో కాళ్ళు గుచ్చి ప్రమాదం తప్పుకుందా



మని ప్రయత్నించేశాను. కాళ్లు స్వాధీనంలో లేవు. దొర్లుతున్నప్పుడు పక్కన రోడ్డు మీద పహారా తిరుగుతున్న పోలీసు కానిస్టేబుల్ లీలగా కనిపించాడు. గొంతెత్తి అరవాలని ప్రయత్నించేశాను. కాని గొంతు మూగవోయింది. ఓ పెనుకెరటం నన్ను తనలో లీనం చేసుకోబోయే ముందు, గుట్టమీద నిలబడి నాకేసి చేతు లూపుతూ ఓ వ్యక్తి కనిపించాడు.

"కృష్ణ గారూ...అక్కడే మజాగా ఉండండి. మీ భార్య బాగోగులు నే చూసుకుంటా. గుడ్‌బై..." అని అరిచాడతను. ఆ గొంతు నాకు బాగా గుర్తు. అతను జార్జి!

ప్రవాహం నన్ను లోపలికి నొక్కేస్తోంది. పైకి తేలాలని, ఈది ఒడ్డు చేరాలని ప్రయాసపడ్డాను. చేతులు చచ్చుబడిపోయాయి. కళ్ళకి పొర కమ్మింది. లోలోతులకి మునిగిపోతున్నాను. అంతః ప్రవాహం అదిమిపెట్టి అడుగుకి నొక్కేస్తోంది. బాక్సింగ్ రింగులో శృంగభంగం పొంది, సత్తువ ఉడిగిపోయి తాళ్ళమీద ఊగులాడుతున్నవాడిలా అయిపోయాను.

గొంతులో చావుగురక. చచ్చిపోతున్నానని నాకర్థమైంది. నా గుండె లోతుల్లోంచి ఆఖరి శ్వాస పెగిలి, కంఠనాళం లోంచి బైటపడింది. నీటిమీద బుడగలు లేచాయి. శరీరం నుంచి విడుదలై, ఊపిరి కన్నా

తెలిగ్గా నీటి అడుగున కొట్టుకుపోతున్నాను. నన్ను వదిలేసిన నా శరీరం చుక్కాని లేని తెప్పలా ఏకాకిగా, ఎడంగా కనిపించింది.

చిక్కటి నూనె మరకేదో నా వేపు కదిలి వచ్చింది. మొదట అది చిన్న మాసిక. తరవాత ఓ పెద్ద సుడిగుండంలా రూపెత్తింది. ఆ సుడిగుండంలోంచి ఓ రాకాసి ముఖం తొంగిచూసింది. స్మశాన వాటిక ముఖద్వారం మీద లోగడ నేను చూసిన యమధర్మరాజు విగ్రహం స్ఫురణకొచ్చింది.

"నన్ను గుర్తుపట్టావనుకుంటా"– ఆ ముఖంలో ముసిముసినవ్వు దోబూచులాడింది.

"యమధర్మరాజు?'' నసిగాను.

క్షణంముందు మూగవోయినగొంతుకు మళ్ళీ ప్రాణం వచ్చేసరికి నాకు ఆశ్చర్యం వేసింది. మాట స్పష్టంగా వచ్చింది. మృత్యువు నా ఇతర సర్వేంద్రియాల్నీ నాశనం చేసినా, కళ్ళూ, చెవులూ ఇంకా పనిచేస్తూనే ఉన్నాయి. చిత్రం...!

"నీకు పట్టబోయే గతేదో కూడా నువ్వు గ్రహించేవుంటావు" యముని బొంగురు గొంతు భీకరంగా మోగింది.

"తెలీదు... నాకేదో భయంగావుంది"

"నువ్వు అశరీర స్థితిలో పదమూడు రోజులు గాలిలో తేల్తుంటావు. మనుషులు కనిపిస్తారు. జంతువులు కనిపిస్తాయి. వాళ్ళ మనస్సులో ఏముందో చదవగలుగుతావు. వాళ్ళకి నువ్వు కనపడవు. వాళ్ళ మాటలు నీకు వినిపిస్తాయి. కాని నువ్వు మాట్లాడలేవు. నీలాగే గాల్లో సంచరించే ఇతర ఆత్మలతో మాట్లాడగలుగుతావు. కాని వాళ్ళ ఆలోచనల్ని పసిగట్టలేవు. నీ తల్లీ తండ్రీ, నీ పెంపుడు కుక్కా, ఒక రిద్దరు నీ స్నేహితులూ తప్ప నీ గురించి విచారించేవాళ్ళుండరు. ఈ ఆత్మజ్ఞానంతో నువ్వు నివ్వెరపోతావు. నీ చావు కన్నా కూడా ఇది నిన్ను వేధిస్తుంది. నిజానికి నువ్వింకా చాలా చావులు చూస్తావు..."

నేను నిజంగానే ఓ మాయా ప్రపంచంలోకి ప్రవేశించి నట్టుగావుంది.

"నావాళ్ళు అనుకున్న చాలామంది కంటే తమరు చాలా దయగా ఉన్నారు"

"ఆపు. పొగడ్తలకు పొంగిపోయేవాణ్ని కాదు. మీ మానవులకు తైరుకొట్టే అవకాశంఇస్తే నా ధర్మం నేను నిర్వహించగలనా!" అన్నాడు యముడు నన్ను సొంతం చెప్పనివ్వకుండానే.

ఆయన అంత పెళుసరంగా మాట్లాడినా మరణానంతర జీవితం గురించి ఆయన్ని అడిగితెలుసుకోవాలనే కుతూహలం అణచుకోలేకపోయాను.

"స్వామీ! మీరు చెప్పిన మనోవ్యధని సహించడానికి నేను సిద్ధమయ్యేవున్నాను. కాని నాబోటివాడికి నిష్కృతి ఉండదంటారా? ముఖ్యంగా నా కేసులో కొన్ని లోపాలు తప్పకుండా సమర్థనీయం అనుకుంటాను" అన్నాను.

"ఎట్లా సమర్థనీయం? నువ్వొక ఆత్మభ్రాంతిలో ఉన్నావు" అన్నాడు యముడు కరుగ్గా. ఆయన్నెలాగో ప్రసన్నుణ్ణి చేసుకుందామనుకుంటే నా మాటలకాయన మరీ రెచ్చిపోయాడు.

"ఆడవాళ్లతో నాకు జంఝాటాలున్నమాట నిజమే. కాని కళాదృష్టితో వాళ్ళ అంగాంగాలు అధ్యయనం చెయ్యక తప్పదని తమకు తెలియంది కాదు. లేకపోతే అన్ని చిత్రాలు ఎలా గీయగలిగానంటారు?" అంటూ ఒక్కక్షణం ఆగి మళ్ళీ మొదలెట్టాను– "నేను మనవిచెయ్యా

లనుకున్నదేమంటే, లైంగికసంయోగాన్ని మన పవిత్రగ్రంథాలు అంగీకరించాయి గదా అని..."

"ఏ పవిత్ర గ్రంథాలు?"

ఆయన గొంతు చిరచిరలాడినా, లైంగిక విషయం ఎత్తేసరికి ఆయన్లో కొంత ఆసక్తి ద్యోతకమయింది. ధార్మిక సంవాదానికి దిగటానికి ఆయన మెత్తపడ్డంచూసి నాకు మహదానందంకలిగింది.

"బృహదారణ్యకోపనిషత్తులో శ్వేతకేతు కామక్రీడ గురించి గౌతముడికి ఏం చెప్పాడో తమరు గుర్తుతెచ్చుకుంటే..."

ఆ నల్లటి ఆకారం అణుమాత్రం తొణకకుండా నిశ్చలంగా నిలబడిపోయింది.

"ఇంతకీ నువ్వు తత్వవేత్తవా, చిత్రకారుడివా?"

"బహుశా రెండూ కావచ్చు" అన్నాన్ను. కాని వెంటనే నాలుక కరుచుకున్నాను. మరీ అంత వాచ్యంగా వదరకూడదనిపించింది. నేనున్న భయంకర పరిస్థితిలో ఆ క్షణాన అది మనసుకెక్కలేదు.

"స్త్రీ కూడా ఒకరకంగా పరిశుద్ధిచేసే పదార్థమేనని ఉపనిషత్తులో శ్వేతకేతు గౌతముడికి బోధచేశాడు. యజ్ఞం ద్వారా మానవునికి ప్రాప్తించే అనుగ్రహాలన్నీ కామం ద్వారా కలుగుతాయని అందులో ఉంది. స్త్రీ వినీలకుంతలాలే పొగ, ఆమె యోని జ్వాల. ఆ జ్వాలామాలికలోంచి వెలుపడే ప్రకాశమే సుఖపారవశ్యం..."

"గుర్రం కట్టివెయ్!" అసరిచాడు ఉగ్గరగా.

"దయ్యాలు వేదాలు వల్లించటమంటే ఇదే. రతిని సంతానోత్పత్తి సాధనగా మాత్రమే అందులో సమర్థించాడు. అంతే గాని అదే అర్థం పరమార్థంకాదు. నువ్వు మంచీ-చెడూ విచక్షణ లేకుండా సాగించే కామలీలల్ని భగవంతుడు ఆమోదించాడనే అనుకుంటున్నావా?"

"ఎవరితో...? రజియాతోనా?"

"ఔను. నీకు అర్థమయినందుకు సంతోషం"

"స్వామీ! ఆమెతో నేనే పాపమూ చెయ్యలేదు. కేవలం ఆమె ఒంటి ఒంపు సొంపుల్ని మనస్సులో చిత్రించుకున్నాను... అంతే! అది కూడా ఒక రకంగా ధ్యాన ముద్ర కాదంటారా?"

"నువ్వూ, నీ ధ్యానమూ పాడుగాను.. నన్ను వెర్రివాణ్ణి చేద్దామనుకుంటున్నావా? కామం నీకు వ్యసనం. సంతానోత్పత్తి సాధనంకాదు. పోనీ, ఎవరికేనా, ఏనాడైనా సంతాన భాగ్యమంటూ కలిగించావా?"

"ఆ దోషం నాది కాదు, మేరీది" అన్నాను ఆయన మాటకి చురుకుపుట్టి.

"ఏమో... ఎవరికి తెలుసు?"

"నాకు తెలుసు. కచ్చితంగా నాలో లోపంలేదు"

"అట్లాగా?" యముడి గొంతులో ఎద్దేవ.

"ఔను. అది చేటుపత్ర. వైవాహిక నీతి నియమాల్లోనూ అంతే"

"నువ్వేదో సర్వజ్ఞుడిలా మాట్లాడుతున్నావ్"

ఓ క్షణం నిశ్శబ్దం.

ఓ రాకాసి చేప మా ఇద్దరి మధ్య పైకి తేలి నా శరీరాన్ని రాచుకుంటూ దూసుకుపోయింది. దాని వెనకాలే ఓ నీళ్ల పాము చరచరా ఉరికింది. నేను ఉలిక్కిపడ్డాను. అమ్మో... అది నన్ను కాటేస్తేనో...?

నా మనస్సులోని భయాన్ని చదివి నట్టుగా "కంగారుపడిపోయావా? అది

నిన్నేమీ కుట్టదు. నీళ్ల పాములు నిరపాయకరం. అయినా ప్రస్తుతం నీది కాని నీ శరీరం మీద నీకెందుకింకా భ్రమ!"

"అయినా అది నాదేగా!"

"అదో భ్రాంతి! ప్రాణంలేని పసుపుల్ని పట్టుకుని పాకులాడ్తావు. మీ మనుషులకున్న దౌర్బల్యమే అంత. మీరు పరమ అసూయాపరులు; ఎంత సేపూ కట్టుకుపోవాలనేయావ; సొంతలాభం తప్ప వేరే చింత లేదు మీకు. సరేగాని, కాస్సేపట్లో నీ శరీరం ఒడ్డుకి కొట్టుకుపోతుంది. నీ ఇష్టమొచ్చినంత సేపు తనివితీరా ఏడువు. మనిషిలాగా నీకు ఏళ్లుండవు. ఏ రాబందులో పీక్కుతినక ముందే నీ బంధువులెవరో నీ శవాన్ని ఇల్లు చేరుస్తారు"

"భయంకరం!"

"నీకు పట్టబోయే గతి నువ్వు గ్రహిస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. నువ్వు మహా మాటకారివి"

"ఏమన్నారూ!"

"ఉపనిషత్తులు క్షుణ్ణంగా తెలిసినవాడిలా కనిపిస్తున్నావు కాబట్టి 'కౌశీతకి' లోని ఒక అంశం గురించి మాట్లాడుకుందాం. అందులో గాంగ్యాని, గౌతముడితో ఏం చెప్తాడంటే శరీరం అనే ఈ పంజరంలోంచి ఎగిరిపోయిన ప్రతి ఆత్మ క్రిమిగానో, కీటకంగానో, చిమ్మటపురుగుగానో, చేపగానో, పక్షిగానో, పాముగానో, పందిగానో, ఇంకా ఇతరేతర పశుపక్ష్యాదులుగానో ఈ లోకానికి తిరిగి వస్తుంది. పూర్వజన్మ సుకృతాన్నిబట్టి మానవుడుగా కూడా మరలి రావచ్చు. ఏ రూపంలో తిరిగిరావటమనేది ఈశ్వరుని నిర్ణయం. ఆ నిర్ణయంకోసం నువ్వు కనిపెట్టుకుని ఉండాలి. అది నా అధీనంలో ఉండే శాఖ కాదు. నా పనల్లా బతుకు దివ్వెని ఆర్పటమే. దేనితో చంపాలన్నది నా నిర్ణయం. అది క్యాన్సరు కావచ్చు, రక్తం గడ్డకట్టుకుని హృదయచలనం ఆగిపోవటం కావచ్చు, పాముకాటు కావచ్చు, మరేదయినా కావచ్చు. ఆ క్షణం అలా తోసుకువస్తుంది. గాంధీమహాత్ముడు ప్రార్థనా సమావేశం ప్రారంభించక ముందే ఆయన ప్రాణాన్ని ఎలా హరించానో జ్ఞాపకం చేసుకో. ఉత్తమజీవుల్లో ఒకనిగా ఆయనని మాతో ఉంచుకుందామనుకున్నాం"

"అందే జార్జిని నా హంతకుడుగా ఎంపిక చేశారన్నమాట!"

"నీకు ఎలా తోస్తే అలా అనుకో" అన్నాడు యముడు.

నేను చుట్టూ చూశాను. నా శరీరం నీటి అడుగునుంచి పైకిలేవటం గమనించాను. పైకి తేలటంతోటే ఓ పెనుకెరటం నా శరీరాన్ని ఒడ్డుకి కొట్టేసింది. సీతాకోకచిలుకలాగా ఆ మృతదేహం చుట్టూ గిరికీలు కొట్టటం మొదలెట్టాను.

ఒడ్డున అయ్యో చప్పుళ్లన్నీ వినిపిస్తున్నాయి' రాబందుల రెక్కల చప్పుడు, ఆకతాయి పిల్లమూక కేకలు, కేరింతలు, పోలీసు జవాను బూట్ల నాదాల టకటకలు- అన్నీ వినిపిస్తున్నాయి.

గుట్ట కొట్టకొసన పెద్ద బండరాయివెనక నా హంతకుడు జార్జి పొంచి కూర్చుని తొంగిచూస్తున్నాడు. అతని మొహంలో మెరుపు...ఆ చూపులు నా శవంమీద గడ్డకట్టాయి. నేను రెక్కలు కట్టుకుని అతనివైపు ఎగిరి వెళ్ళాను. స్టెతస్కోపు పెట్టుకుంటే గుండె చప్పుడు వినిపించినట్టుగా అతని మనస్సులోని ఆలోచనలు

నాకు స్పష్టంగా వినిపించాయి.

అతను మనస్సులో అనుకుంటున్నాడు "నీటి అడుగునుంచి పైకి తేలటానికి ఎంత సేపు పట్టింది! అమ్మయ్య... ప్రవాహంలో కొట్టుకొచ్చిన కట్టెలా ఇసుకలో పడున్నాడు. చూశావా మేరీ! నువ్వు కోరిన పని చేసేశాను. ఈ మనిషి అడ్డు తొలగిపోయింది. మనం ఇక స్వేచ్ఛాజీవులం..."

కొద్దిక్షణాలు గడిచేక, అతను గుట్ట దిగి బోర్లాపడున్న నా శవం దగ్గర కొచ్చాడు. శవం తల ఇసుకలో కూరుకుపోయింది. కాళ్లు ఎడంగా బారచాపి ఉన్నాయి. రెండు క్షణాలు నా శవంవంక తదేకంగా చూసి పోలీసు జవానుకేసి చప్పట్లు చరిచాడు.

"ఇదుగో ఇంకో శవం కొట్టుకొచ్చింది"

ఎర్రటోపీ నా శవంవేపు కదిలొచ్చింది. శవంకేసి అతను చూసిన చూపులో ఆర్ద్రత లేదు. "అయితే ఏమంటావు? రోజూ శవాలు చూస్తుంటాను. వరదల్లో చచ్చిన మరో శవం"

"కొద్దిసేపటి కిందట ఈ మనిషి ఒడ్డున నడుస్తుంటే చూశాను. అదుగో ఆ గుట్టమీద నేనప్పుడు నిలబడున్నాను" అన్నాడు జార్జి చెయ్యెత్తి గుట్టవేపుచూపిస్తూ.

"అదేనయ్యా! నేనంటున్నదీ. వరదల్లో చచ్చి బైటపడ్డ శవాల్లో ఇదీ ఒకటి. దీని ప్రత్యేకత ఏముంది?" అన్నాడు పోలీసు జవాను.

"ఔను... నిజం" అని గొణిగాడు జార్జి. హత్యని అతి మామూలు సంఘటనగా తీసుకున్నందుకు జవాన్ని లోలోపల అభినందిస్తూ కొండంతబరువు దిగిపోయినట్టుగా సంతోషపడిపోయాడు.

పోలీసు నా ప్యాంటు జేబులోంచి పర్సు బైటికిలాగి ప్లాస్టిక్ మడతలు తెరిచి తడిసి ముద్దయిన నా విజిటింగ్ కార్డు తీశాడు. అతను కూడబలుక్కుంటూ చదువుతోంటే జార్జి అతని భుజంమీదికి వంగి చూశాడు.

"ఈయనెవరో వి.ఐ.పి. లాగున్నాడే! ఇంతకీ ఇక్కడెందుకు తిరుగుతున్నట్టు?"

"ఏమో!" అన్నాడు జార్జి.

"ఓ చిన్నపని చేసిపెడ్తారూ?"

"చెప్పు"

"ఇతని ఇంటికి కాస్త ఫోన్ చెయ్యండి. నేను డ్యూటీలో ఉన్నది చూస్తూనేవున్నారుగా" అన్నాడు పోలీసు కానిస్టేబుల్.

"తప్పకుండా" అన్నాడు జార్జి. ఇదీ బాగానే ఉంది అనుకున్నాడు మనసులో.

అరగంట గడిచాక మేరీ వచ్చింది. పోలీసు కానిస్టేబుల్ ఖాళీపర్సు, కారు తాళంచెవులు వినయంగా అందించాడు. జార్జి ఏమీ ఎరగని అపరిచిత వ్యక్తిలా మొహం పెట్టాడు.

"ఇంత ఘోరం జరిగిపోయినందుకు మేం చాలా విచారిస్తున్నాం మేడమ్. రూలు ప్రకారమయితే నేను తక్షణం ఈ చావు కబురు మా కంట్రోలు రూంకి తెలియబర్చాలి. వాళ్లు శవ పరీక్షంటారు. ఇంకా ఏవేవో అంటారు. ఈ ఆపత్సమయంలో మిమ్మల్ని ఏగొడవాలేకుండా శవాన్ని తీసుకుపోనిస్తున్నాను. అసలే కష్టకాలం. పైగా ఈ వరదలు.. చావులూ"

"మీది చాలా జాలిగుండె" అంది మేరీ

"దాందేముందిలెండి" అన్నాడు కానిస్టేబుల్ మనసులో పొంగిపోతూ.

"మిసెస్ రామకృష్ణగారూ! ఇది మీకు భయంకరమైన షాక్" అన్నాడు జార్జి విచారం నటిస్తూ.

"అవును. వినగానే నాకుకాళ్లూచేతులూ చచ్చుబడిపోయినై. నాకు టెలిఫోన్ చేసింది|





మీరేనా?" అనడిగింది మేరీ.

"నా ధర్మం నేను చేశాను. పదండి... మీతోపాటు నేనూ వస్తాను"

"చాలా థాంక్సండీ" అంటూ మేరీ ఆ ఇద్దరికేసే చూసింది. "కారు ఇక్కడే ఎక్కడో ఉండాలి. ఉత్తరంవేపు వొడ్డు దాకా నడుపుకొస్తాను. దయచేసి శవాన్ని కార్లో పెడితేచాలు...." అంటూ చకచకా నడిచి వెళ్ళింది. నా శవాన్ని కలప దుంగ అనుకుంది కాబోలు!

కారు చాదర్‌ఘాట్ బ్రిడ్జి దాటి ఒబెరాయ్ హోటల్‌ని చుట్టి,ఓ ఇరుకు గల్లీ గుండా కరీంగూడావేపు దౌడుతీసింది. కొద్దిసేపు ఇద్దరూ మాటాపలుకూలేకుండా మౌనంగా కూర్చుండిపోయారు. తరువాత జార్జి నెమ్మదిగా ఆమెని చుట్టేసి ఆమె పెదాలమీద ముద్దుపెట్టుకోబోయాడు.

"ఇక్కడొద్దు"

"ఏం?"

రేర్‌వ్యూ మిర్రర్‌లో నా శవాన్ని చూస్తూ-"నాకేంటో మహాభయంగా ఉంది అతనింకా మనిద్దరిపంకా చూస్తున్నట్టుగా అనిపిస్తోంది" అంది మేరీ.

"అతనుకాదు - అది. పొయ్యిలోకి పోవటానికి ఎదురుచూస్తున్న కట్టెముక్క" అన్నాడు జార్జి.

"అయినా నాకేంటోగా ఉంది... ఏదో నా చుట్టూ ఝుమ్మని రొద చేస్తూ తిరుగుతున్నట్టుగా ఉంది"

"అది నీ నరాల దౌర్బల్యం,డార్లింగ్! ఒక్క ముద్దుతో ఇవన్నీ తేలిగ్గా మర్చిపోయివుండేదానివి"

జార్జి ఉద్రేకంతో ఊగిపోతూ మేరీని తనమీదికి లాక్కుని పాలిపోయి వొణుకుతున్న ఆమె పెదాలమీద గట్టిగా ముద్దు పెట్టాడు. స్టీరింగువీల్ మీంచి ఆమె ఎడమ చెయ్యి జారిపోయింది. ఫట్‌మని కారు తిరిగిపోయింది. నా మృత దేహం సీటు మీంచి కిందికి జారింది. రెప్పపాటులో మేరీ కారుని అదుపులోపెట్టి మలుపులో ఆపేసింది.

"ప్లీజ్... మై డార్లింగ్! వెంట్రుకవాసిలో కరెంటు స్తంభాన్ని తప్పుకున్నాం" అంది మేరీ తడబడుతూ.



## 4

వాతావరణం ఉక్కగా ఉంది. దూదిపింజెల్లాంటి మబ్బు తునకలు ఆకాశంలో కొద్దిక్షణాలు సూర్యుణ్ని కప్పేశాయి. మబ్బుల మేలిముసుగు తోసేస్తూ సూర్యుడు విశాలమైన నింగినీలాల దీవుల్లోకి చొచ్చుకొచ్చాడు. ముతక కావిరంగు ముదురుఎండ నిశ్చలంగా ఉంది.

శనివారం సాయంత్రం పూట శవయాత్రకొచ్చేవాళ్ళు ఎందరుంటారు అనుకున్నాను. ఆమాటకొస్తే చనిపోవడానికి శనివారాలు అస్సలు పనికిరావు. శవం వెంట నడుస్తూ స్మశానానికి పోవటం కన్నా జనానికి వేరే హుషారు వ్యవహారాలు చాలా ఉంటాయి.

ముందు గదిలో కటిక నేలమీద పడుకోబెట్టారు నాశవాన్ని. మొట్టమొదట శవదర్శనానికి వచ్చినవాళ్లు మాపొరుగింటి గోపాల్, సరళా మీనన్‌లు.



"రాం చనిపోయాడంటే నిజంగా మేం షాక్ తిన్నాం" అన్నాడు గోపాల్ కన్నార్పకుండా నా శవంకేసి చూస్తూ. అతని భార్య సరళ మేరీ వంక విషాదంగా చూసింది.

"అంతా భగవదేచ్ఛ" అంది మేరీ విషాదం తెచ్చిపెట్టుకుంటూ. కళ్ళలోకి నీళ్లు తెప్పించుకోవాలని శ్రమ పడింది.

"ఏడవ్వద్దమ్మా! మాకు జరిగిన ఘోరమే చూడు. ఎలాగో సరిపెట్టుకుని బతుకుతున్నాం" అంది సరళా మీనన్ నా భార్య చెయ్యి నిమురుతూ.

నా మరణంతో ఆ దంపతులకి పోయిన కొడుకు జ్ఞాపకం వచ్చాడు. ఆ జ్ఞాపకాలతో ఆయన పెదాలు మెలితిరిగాయి. తలవాలిపోయింది. ఆయన లోలోపల కుళ్ళికుళ్ళి ఏడ్చే ఏడుపు వినపడింది.

"భగవంతుడా! ఇదేం న్యాయం? అస్తమానం నా బిడ్డ గుర్తొస్తాడు. ప్రతి రాత్రీ కళ్ళముందు మెదుల్తాడు. ఇప్పుడీ పొరుగింటి స్నేహితుడు పోయాడు...చావనేది ఎందుకింత కలత పెట్టే మాయగా మిగిలింది?"

నా కుక్క పీటర్ ఇటువేపే వచ్చిందింతలో.

మేరీ కసురుకున్నా లెక్క పెట్టకుండా పీటర్ నా మృతదేహం వద్దనే ఉంది. గట్టిగా గాలి పీల్చి చప్పుడు చేసింది. చుట్టూ అయోమయంగా చూసి, అరికాళ్ళ

మధ్య ముట్టి దూర్చి ఓ మూల ముడుచుకుని పడుకుంది.

పీటర్ మనస్సులో ఏమనుకుంటున్నదీ నాకు వినబడుతూనే ఉంది. "మేం మృత్యువుని ముక్కుతో వాసన పట్టగలం. కటిక నేల మీద కదలకుండా, శరీరం చల్లబడిపోయి నా యజమాని ఎన్నడూ ఇలా నిద్రపోడు. కిందటి రాత్రి ఆయన బాగా పొద్దుబోయి ఇంటికొచ్చినప్పుడు నేను సోఫా కింద దూరి పడుకున్నాను. రాత్రంతా ఆయన బరువుగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు తీశాడు. దేని గురించో తీవ్రంగా మధనపడుతున్నట్టు గమనించాను"

"బైటికి కదుల్తావా లేదా ?" మేరీ గర్జిస్తూ పీటర్ పడుకున్న మూలకి విసురుగా నడిచింది. దాని చెవి పట్టుకుని బైటికి గుంజింది.

"ఈవిడ నావెంట పడిందేమిటి! అసలే ఈవిడకు నేనంటే చెడ్డ రోత. నన్ను ఇంట్లోంచి గెంటేస్తుందేమో" అనుకుంది నా పెంపుడు కుక్క.

మేరీ కుక్కని బలవంతంగా ఈడ్చుకుపోతుంటే గోపాల్ కలగజేసుకున్నాడు.

"యజమాని పోయాడని అదీ శోకంలో ఉందేమో! కాస్సేపు ఉండనీండి"

"శవం పక్కన కుక్కనా?"

"అదేమైనా ఊరకుక్కా? అదంటే క్రిష్ణకు మహాఇష్టం. పీటర్ వెంట లేకుండా క్రిష్ణ మా ఇంటికి వచ్చేవాడు కాదు"

మేరీ చెయ్యి వెనక్కి లాక్కుంది. పీటర్‌నీరసంగా ఓ మూలకి పాకింది.

''ఎంత ఘోరం...! ఎంత ఘోరం!''– బాధతో, కంపించే గొంతుతో అంటూ సేఠ్ కిశోరీలాల్ లోపలికి అడుగు పెట్టాడు. "ఇప్పుడే విన్నాను. మిసెస్ కృష్ణా! మీకు తెలుసోలేదో, కృష్ణాజీ నా బొమ్మ గీస్తున్నారు. నేను గణేశ్ మిల్లు ప్రొప్రయిటరు కిశోరీలాల్‌ని''

"మీ గురించి విన్నాను"

కిశోరీలాల్ మనస్సులోఅనుకున్నాడు: "వీడు నా బొమ్మ పూర్తిచేసి చస్తే బావుండేది.నా దగ్గర అయిదువేలువసూలు చేసుకున్నాడని ఈవిడకి తెలుసా? అదీ అరకొరగా మిగిల్చిన బొమ్మకి. ఈవిడ ఇంకెవరితోనైనా కనీసం పూర్తి చేయిస్తుందా?లేదంటే నా డబ్బువాపసిస్తుందా?"

అంతలో నవనీత్ లోపలికి వచ్చాడు. ముందుగా వల్లెవేసుకొచ్చిన సంతాప వాక్యాలు ముచ్చటగా చెప్పేసి, ఓమూలకి జరిగి కూచ్చుని ఎక్వేరియంలో సుతారంగా తిరుగాడే చేపపిల్లలకేసి చూపుతిప్పాడు.

నా తరవాత మా కళాసంస్థకి కాబోయే ఛైర్మన్ ఆయనే.తన ప్రమోషన్ గురించి మనస్సులో తలుచుకుని పొంగిపోయాడు. రేపటినుంచి ఛైర్మన్‌గా తన దిపిటీ ఎలా వెలిగేదీ ఊహించుకుని కాలర్ సర్దుకున్నాడు. మేరీ అటుకేసి రాగానే కళ్లతో ఆమె అందాన్ని తాగేశాడు.

''పిక్కలు చూస్తూనే పిల్ల వయస్సు చెప్పలేమా? మొహంలోకి చూస్తేనేగాని తెలీదా? స్త్రీ శరీరంలోని ప్రతి అవయవం మీదా వయస్సు ముద్ర వేస్తుంది. అవునుగాని... ఈ నలభై ఏళ్ల నడికారు మనిషికి, ఈవిడకి వయసులో చాలా అంతరం ఉన్నట్టుగా ఉందే!" అనుకుంటున్నాడు నవనీత్.

"హిందూస్త్రీ తన మోకాళ్ల కింది భాగం కూడా ఎందుకు కప్పేసుకుంటుందో అర్థం కాదు. మెడనుండి నడుందాకా రవిక, ఆ తరవాత చీలమండలదాకా చీర మడతలు




గారడీవాడు పెట్టెలో పెట్టె పేర్చుకుంటూ పోయి ఆఖరికి ఓ బుల్లిపెట్టెలో కోడిగుడ్డు దాచిపెట్టినట్టుగా ఈ ఒళ్లు దాచుకోవటం ఎందుకో! వాడు ప్రేక్షకుల్లో చచ్చేంత సస్పెన్సు రేకెత్తిస్తూ ఒక్కొక్క పెట్టె తెరుస్తూ ఆఖరి బుల్లి పెట్టెమీద చెయ్యి వేసినప్పుడు కలిగే ఉత్కంఠ జ్ఞాపకం వొస్తుంది. అసలీ చీర దుర్భేద్యమైన కోటగోడ. ఇదొక చిక్కుముడి. అందుకే ఆడవాళ్లు గౌనేసుకుంటే నాకు ముచ్చటగా ఉంటుంది. మన వెర్రిటి ఊహలకి రెక్కలూ మొలుస్తాయి''

కిటికీరెక్క తెరిచి మేరీ వెనక్కి తిరగ్గానే "ఏమండీ! మీకే సహాయం కావల్సినా నన్నడగండి. ఏది కావల్సొచ్చినాసరే..." అన్నాడు నవనీత్.

"తప్పకుండా, నవీన్‌జీ" అంది మేరీ.

"ఏదైనాసరే మిసెస్ క్రిష్ణా'' అన్నాడు అతను మళ్లీ.

"థాంక్యూ. అంతరంచేనా" అంటూ మేరీ గదిలోంచి వెళ్లిపోయింది.

నవనీత్ సిగరెట్ పెట్టెకోసం జేబు తడుముకున్నాడు.

''శవాన్ని ఉంచిన గదిలో సిగరెట్టు తాగకూడదు కాబోలు! వెధవ సంప్రదాయాలు. కాసేపటికి ఇతగాడు చితిమీద పొగలొదుల్తూ కాలిపోడూ! ఏవిటో ఈ చాదస్తం! విద్యార్థిగా క్లాస్‌రూంలో పొగ తాగకూడదు. సినిమాహాల్లో సిగరెట్ అంటించకూడదు. గుళ్లో సరేసరి....బైటికెళ్లి దమ్మయినా లాగొస్తా" అనుకున్నాడు నవనీత్.

సాయంత్రం అవుతోంది. సూర్యుడు కిందకిజారుతున్నాడు. మా అమ్మానాన్న ఎప్పుడొస్తారోయేమో. వాళ్లొస్తేగాని ఈ దహనకార్యక్రమం తొందరగా తెమల్దు.

పెరట్లో గ్యారేజీదగ్గర పాడికడుతున్న గోపాల్‌కి గౌస్ సాయం చేస్తున్నాడు. ఎప్పుడొచ్చాడీ గౌస్? నేను గమనించనే లేదు.

''కృష్ణసాబ్ నాకు దొరేకాదు, దోస్తు కూడా. ఏనాడూ నన్ను కసురుకుని ఎరగడు. ఆడోళ్లపిచ్చి కాస్తంత ఉంటే మాత్రం ఏంపోయింది? అయినాకూడదంటు రాయివేపు జరిగే ఇనపముక్కల్లా వాళ్లే అయ్యగారిమీదికి ఎగబడేవాళ్లు...'' గౌస్ నన్నుగురించి మనస్సులో జ్ఞాపకం చేసుకుంటున్నాడు. వాడికి నామీద ఉన్న విశ్వాసం నన్ను కదిలించివేసింది.

దూషేశ్వరీ బెనర్జీ గుమ్మటం లాంటి మొగుణ్ణి వెంటబెట్టుకుని గుమ్మంలో అడుగుపెట్టింది. ఇద్దరూ కాలాంతకులే.

నవనీత్‌కి నా పదవి మీద కన్నుంటే, ఈ దంపతులిద్దరికీ నా ఫారెన్ వస్తువులు మొత్తం బండిమీద వేయించి ఎప్పుడు ఇంటికి తోలించుకు పోదామా అని తహతహ. ఆవిడ మొన్నీ మధ్య నా జర్మన్ ఎలక్ట్రానిక్ వాచీ బేరమాడింది. ఇక ఆ బెనర్జీకి ఇల్లంతా సల్లపచ్చే. "నా వధువు ఏమడిగినా లేదనేది లేదు" అంటూనా పిప్పళ్లబస్తా. వధువట వధువు! సంభై నాలుగుఏళ్ళు నడికారు ప్రౌఢని పట్టుకొని యాభైఏళ్ళు దాటిన ఈ వృద్ధ కేసరి వధువని సంబోధిస్తూ మురుసుకుంటాడు.

అయినా నా అంత్యక్రియలు జరిగే రోజు నాకి అర్థం పర్థం లేని పనికిమాలిన ఆలోచనలు వస్తున్నందుకు నన్ను నేనే మందలించుకున్నాను.

మరణించిన మనిషికి గౌరవ సూచకంగా తలమీదికి ముసుగు లాక్కొని దూషేశ్వరి బెనర్జీ నా భార్యకి సంతాపం తెలిపింది.

ఆమె భర్త కూడా విషాదంగా మొహం పెట్టి వంతపాడాడు. సంతాపం ప్రకటించ టానికొచ్చేవాళ్ళ భాషా దారిద్ర్యం కొట్టొచ్చినట్టు కనపడింది.

మేరీ తలూపి, వాళ్ళిద్దర్నీ అందరూ కూర్చున్న ముందు గదిలోకి రవాణా చేసింది. నా శవాన్ని పడుకోబెట్టిన గది లోంచి వాళ్ళు చల్లగా బైటకి జారుకుని తోటలో రాతి బెంచీమీద కూలబడ్డారు. ఏయే వస్తువులు కొనాలో తెల్సుకోడానికి వాళ్ళకి కాస్త ఏకాంతం కావలసివచ్చిం దేమో! నా దగ్గర ఇంకా చాలా ఫారెన్ సరుకుంది. ఫ్రెంచి డిష్ వాషర్, బ్రిటిష్ కలర్ టి. వి., స్విస్ కక్కూ గోడ గడియారం వగైరా వగైరా...

అరె! ప్రతిమ కూడా వచ్చిందే! ఇంతకీ ఈవిడెందుకొచ్చినట్టు? తను వస్తుందని నేను అణుమాత్రం అనుకో లేదు. ఈవిడ రాకవల్ల మేరీ మనస్సులో అనుమానాలు రేకెత్తవుగదా! ఆవిడ ప్రతిమని నా ప్రియురాలుగానో, మోడల్ గానో భావించటం ఖాయం. కాకపోయినా ఈ పంతొమ్మిదేళ్ళ సుందరాంగి శవ దర్శనానికి రావటమేమిటి! వొచ్చింది సరే- ఈ గుంపులోంచి బైట పడగలుగు తుందా? అందునా ఇటువంటి అందాల బొమ్మ! సవసీత్ వగైరాల కళ్ళన్నీ ఆమెమీదే గుచ్చుకొట్టి పోవూ! కనీసం నటన కోసమైనా తనంటే తపించిపోయే అబ్బాయిని వెంటపెట్టుకుని రావద్దా! ఆరోజు పార్టీకి కట్టుకొచ్చిన చీరతోనే ప్రతిమ లోపలికి నడుచుకుంటూ వచ్చే సింది...

“ఉద్రేకాలన్నీ ఉడికిపోయి ఎలా పడున్నాను చెప్పా! ఒకనాడు ఆకాశం మించి నా కోసం చందమామని తెచ్చి పెట్టి సాయంత్రమంతా నా చేతుల్లో పట్టి ఉంచాడు. ఓ ప్రఖ్యాత కళాకారుణ్ణి బుట్టలో వేసుకుందుకు ఎరవేసిన పోరం బోకు పిల్లగా ఆయన నన్ను భావిం చాడని నాకు తెలుసు. రామీ! ఇప్పటికీ మీరంటే నాకెంత ప్రేమో చూడండి! ఆరోజు సాయంత్రం ఒక్కసారంటే ఒక్కసారి నన్ను ముద్దుపెట్టుకుంటే పోలా! పితృభావంతో బుగ్గమీద ముద్దు పెట్టుకున్నట్టుగా కాదు... నిండుగా నా పెదాలమీద...

“తప్పు చేస్తున్నాననే భావన మీ కళ్ళలో చూశాను. నల భైకీ, పంథొమ్మిదికీ మధ్య వయస్సు తేడా వల్లనా? అది పట్టించుకునేదెవరు? డెభైఏళ్ళ ఓ ముసలి జడ్డి పంతొమ్మిదేళ్ళ పడుచుపిల్లని పెళ్ళాడా డని అమెరికన్ పత్రికలో చదివాను. రేపటి వసంతానికి నాకూ ఇరవై వసంతాలు నాలో వేడివేడి కోరికలు రేపి వెళ్ళి పోయారు మీరు. ‘పిల్లచేష్ట’లే అను కున్నారు. అట్లా కాదని నిరూపించటానికే నేనిక్కడికొచ్చాను”

ఆమె ఆలోచనలు ఆలకిస్తోంటే నాకు జ్ఞానోదయమైనట్టుగా ఉంది. ప్రతిమా! నా ఆలోచనలు వినగలిగే శక్తి నీకూ ఉంటే ఎంత బావుణ్ణు! ఆ సాయంత్రం జరిగిందానికి నేనెలా తయారుగాలేనో నీకూ అర్థమవుతుంది. నా హోదాలో ఉన్నవాడు యువ కళాకారుల క్లబ్బుకి వెళ్ళకుండా ఉండాల్సింది. అక్కడ మందూ, మాదక ద్రవ్యాలు ప్రవహిస్తా యని తెలుసు. అక్కడికొచ్చేవారంతా నవయవ్వనంతో నవనవలాడే యువతీ యువకులనీ తెలుసు... అయినా వచ్చాను. జంట లేకుండా వచ్చిన ఒంటరివాణ్ణి. ఆ ఒక్క సాయంత్రం ఎవరో ఒకర్ని




మసగుదాం అనుకున్నాను. నా బలి పశువులా అందమైన నువ్వు కనిపించావ్. నువ్వు అల్లుకుపోయిన ఆ బుల్లోడినుంచి నిన్ను విడదీద్దామనుకున్నా. రెండు స్కాచ్ పెగ్గులు బిగించాను. గంజాయి దమ్ము లాగాను. నిషా ఎక్కిపోయింది నాకు. తళతళలాడే గాజు కుండీలో ఉజ్వలంగా వెలిగే కొవ్వొత్తి కాంతిలాంటి నీ మొహం నా కనుపాపలో మెరిసింది. నా నాలిక వశం తప్పింది. కాని ప్రతిమా! అప్పుడు నీ రూపం నాకు కైపెక్కించింది. ఉద్రేకంతో ఒళ్లులుంగలు చుట్టుకుపోయింది. తరుణి అందమే భగవంతుని చరమ విజయం అని ఏమేమో వాగుతూ నీ మొహంమీదికి వంగాను. నీ బుగ్గలో సిగ్గులు పూచాయి. నువ్వు కరిగిపోవటం నేను కనిపెట్టాను.

"ఎందరు మగవాళ్లు ఇంత అందంగా ఆలోచించగలరు?"

నువ్వామాట అంటోంటే నేను నీ పెదాలకేసి చూశాను. విరిసీ విరియని పూలరేకుల్లా కనిపించాయి నీ పెదాలు. నిన్ను తాకానని తెలుసు నాకు. నీ ఒంటి ఒంపులన్నీ పరీక్ష చేశాను. నేను మోసుకుపోలేని కానుకని కొట్టేశానని తెలుసు నాకు. మరి నీ పెదాల్ని ఎలా ముద్దుపెట్టుకోను? నీ ఎడం బుగ్గమీద పెదాలు అంటించటం మించి మరేం చేయకూడదనుకున్నాను.

కాని నువ్వు నన్ను వొదల్లేదు. "మీలాంటి అద్భుత చిత్రకారుడు ఒకే స్త్రీ గుత్త సొత్తుగా ఎందుకుండిపోవాలి? అటువంటి ఒప్పందాన్ని నిషేధించే చట్టం ఉండాలి" అన్నావు.

"ప్రతిమా! దయచేసి వెళ్లిపో" అని నీ చెవిలో ఊదాలని తపించాను.

చూడు... నవనీత్ నీ వంక ఎలా కన్నార్పకుండా చూస్తున్నాడో!



## 5

అమ్మ, నాన్న వచ్చేశారు. అమ్మ నన్ను పడుకోబెట్టిన గదిలో అడుగుపెడుతూనే నా మృతదేహంకేసి చూసి కొయ్యబారి నేలమీద కుప్పకూలిపోయింది.

"నా శరీరంలో ఒక భాగం నన్ను విడిచిపెట్టిపోయాక ఈ తల్లి ఇంకెలా బతుకుతుందిరా?"— ఆమె శోకం కట్టలు తెంచుకొంది. రెండు క్షణాలు పోయాక కొంచెం తమాయించుకొని సంతాపం ప్రకటించటానికొచ్చిన పెద్దమనుషుల వేపు తిరిగి— "ఒక్క నిముషం బైటికి వెళ్ళండి. నా బాబుకు స్నానం చేయిస్తా..." అంది. ఒక్కొక్కరు బైటికి నడుస్తోంటే ఆమెకి మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చి బావురుమని ఏడ్చేసింది.

"వాణ్ణి నేను స్నానం చేయిస్తాను" అన్నాడు నాన్న.

"కాదు. నేనే చేయించాలి" అంది అమ్మ.

అమ్మ పక్కనే నిలబడ్డ సరళా మిసెస్ తను బకెట్‌తో నీళ్లు తేవడానికి ముందుకొచ్చింది. అమ్మ మేరీ వేపు తిరిగి వొణుకుతున్న గొంతుతో— "పన్నీరు కూడా తెప్పించమ్మా! వాణ్ణి శుచిగా స్నానం చేయించి, పన్నీరు చల్లి, కొత్తబట్టలు తొడిగి పెళ్లికొడుకులా సింగారిస్తా"

అంది.

ఆ మాటంటూనే ఆమె దుఃఖం పట్టలేక ఏడ్చేసింది. అమ్మా! నిన్ను నువ్వు ఎందుకింత నొప్పించుకుంటావమ్మా అనుకున్నాను మనస్సులో. ఈ మాంసం ముద్ద గురించి నీకెందుకమ్మా ఇంత దుఃఖం? ఈ శరీరం ప్రాణంలేని కట్టె జీవుడు నీ చుట్టు తిరుగుతూ, నీ మనస్సు చదువుతున్నాడు.

గదిలోంచి అంతా నిష్క్రమించారు. అమ్మ నా బట్టలు విప్పేసింది. ఆమె మళ్ళీ ఏడవలేదు. అదే ఆశ్చర్యం. మూగదానిలా నా ముఖంలోకి రెప్ప వెయ్యకుండా చూసింది. షాక్ వల్ల ఆమెకి ఎక్కడ మతి తప్పుతుందో అని నేను భయపడి పోయాను.

"రామీ! ఎనిమిదేళ్ళ వయసప్పుడు నువ్విట్లా లేవురా. 'అమ్మా! నాకు నీళ్ళు పొయ్యేవూ' అంటూ నువ్వు మేడగది లోంచి మెట్లుదిగి వచ్చేవాడివి. కమ్మీ మీదికి వంగి 'అమ్మా! నేను రెడీ' అని వంటింట్లోకి కేక పెట్టేవాడివి. 'క్షణం ఆగరా.. చేతులు కడుక్కొని వచ్చేస్తున్నా' అని నేను వంటింట్లోంచి అరిచేదాన్ని. నా బంగారు కొండవి నాన్నా. గులాబీ బుగ్గల్తో బొద్దుగా బొమ్మలాగా ఉండే వాడివి నాన్నా. నా కింత చక్కటి కొడుకు నిచ్చినందుకు భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకునేదాన్ని..."

అవునమ్మా అని చెప్పాలనిపించింది. ప్చ్... అవన్నీ నాకు బాగా జ్ఞాపకం. నాన్న పూజగదిలో శ్లోకాలు చదువుకుంటోంటే నేనూ, అమ్మా ఆటలాడుకునే వాళ్ళం. నువ్వు నన్ను మొండిమొలతో స్నానం చేయిస్తూ నా వీపు రుద్దుతోంటే నాకే మీసిగ్గనిపించలేదు.

"అయిపోయిందా?" నాన్న బైట నుంచి కేక పెట్టాడు.

"ఆఁ...బాబు రెడీ" అమ్మ బాధగా నిట్టూర్చింది.

గాస్, మీసన్‌లు నన్ను వసారాలోకి మోసుకెళ్ళి పాడెమీద ఉంచారు. సరిగ్గా అదే సమయంలో బక్షీష్ లోపలికొచ్చాడు. అతని మొహం పాలిపోయింది. మొహంలో ఆందోళన. ఎందుకింత ఆలస్యంగా వచ్చాడో? అందరికన్నా ముందు వచ్చి నాన్నని ఓదార్చవలసినవాడు. నగరంలో మతకలహాలు చెలరేగటంవల్ల తను రావటం ఆలస్యమైపోయిందని నాన్నకి సంజాయిషీ చెప్పుకుంటున్నాడు. ఈ పరిస్థితిలో నువ్వు రాకుండా వుండాల్సిందని చెప్దామనిపించింది. బహుశా ఇంకా మారణహోమం కొనసాగుతూఉండవచ్చు. నీ తలపాగా చూస్తూనే ఏ మతోన్మాదికైనా నిన్ను పొడవాలని పిచ్చి పుట్టవచ్చు. నిన్ను కార్లోంచి దిగనివ్వకుండానే నీ కారుకి వాళ్ళు నిప్పంటించవచ్చు. సిక్కు సజీవ దహనం...!

బహుశా రజియా కూడా ఈ కారణంగానే రాలేకపోయివుండొచ్చు.

మాబేశ్వరి బెనర్జీ భర్తతో సహా పాడె దగ్గరికొచ్చి నాన్నతో అంటోంది-"ఇప్పుడెలా స్మశానానికి తీసుకుపోవడం? పత్తర్ గట్టి ప్రాంతం యావత్తు అల్లర్లలో మునిగి ఉందంటున్నారు. వీధుల్లోకి ఎగబడి లూటీలు, హత్యలు విచ్చలవిడిగా చేస్తున్నారని చెప్పుకుంటున్నారు. శవాలు రోడ్ల మీద దిక్కూ మొక్కూ లేకుండా పడున్నాయట! స్మశానానికి వెళ్ళే రోడ్లన్నీ బందయ్యాయి. అంతా గందరగోళం..."

కళ్ళకి కట్టినట్టు ఆవిడ ఆ భీభత్స




దృశ్యాన్ని వర్ణిస్తోంటే ఆమె మొహంలో ఆందోళనకన్నా ఉత్సాహమే వెల్లివిరిసింది. జనమంతా తికమకలోపడి కొట్టుకుంటుంటే ఆమెకి ఆసక్తిదాయకంగా ఉంది.

"వేరేదారి వుందిసార్! సూరజ్‌గూడా చుట్టు దారిగుండా వెళ్తే ప్రమాదం కూడా ఉండదు" అన్నాడు గౌస్.

''నిజమే. ఉస్మాన్‌గుట్ట వెంబడి సూరజ్ గూడా కూరగాయల మార్కెట్‌గుండా వెళ్ళొచ్చు'' అన్నాడు నాన్న.

ఉస్మాన్‌గుట్ట పేరెత్తటంతోటే నేను ఉలిక్కిపడ్డాను. నాపైన, రజియాపైన ఆ గుట్టమీద జరిగిన దారుణ అత్యాచారం నాన్నకి తెలిస్తే...! ఆ భయంకర దృశ్యం మళ్లీ నా కళ్లముందు ఆడబోతుండగా సేఠ్‌కిశోరీలాల్ కంఠం అడ్డుపడింది.

"స్మశానానికి కబురెట్టమంటారా? మన రిజర్వేషన్ అలానే ఉంచమంటాను. పురోహితుడు నాకు తెలిసినవాడే. పైగా ఈరోజు శవాలరద్దీ ఎక్కువగాఉంటొచ్చు. అయినా మన రామకృష్ణ విఐపి...ఏ ఇబ్బందీ ఉండదు"

పాపం! ఈ మతకల్లోలాలలో మరణించినవారి గతేమిటి? శవదహనాలు, సమాధులకి బ్లాక్‌మార్కెటింగ్ కూడా జరగొచ్చునేమో! అదలా ఉంచి, యమధర్మరాజు ఈరద్దీనెలా నిభాయిస్తాడా అని ఆశ్చర్యంవేసింది. ఊపిరి సలపకుండా ఎలకలాగా ఉరుకులు పరుగులమీద ఉంటాడో ఏమో!

ఏమైతేనేం ఈ కొట్లాటలు, దొమ్మీల మూలంగా నేను ఇతర ఆత్మలతో సంభాషణలు జరుపుకునే అవకాశం కోసం ఎదురుచూస్తున్నాను. ఆత్మల మధ్య సమావేశం ఎంత ఉద్వేగభరితంగా ఉంటుంది! మా అందరికీ కలిపి యమధర్మరాజు స్వాగతవేడుక ఏర్పాటు చేస్తేనో...!



## 6

అందరూ గగ్గోలుగా చెప్పుకుంటున్న మాటల్నిబట్టి నగరం మతకల్లోల వెల్లువలో కొట్టుకుపోతోందని అర్థమైంది. అప్పుడప్పుడూ హిందూ ముస్లిములుభయుల్ని పీడించే ఒక సాంక్రమిక అంటువ్యాధి ఇది.

కొందరు ముస్లిములు మసీదులో ప్రార్థన చేసుకునే సమయంలో హిందువుల పెళ్లి ఊరేగింపు ఒకటి బ్యాండు మేళాలతో ఆ మసీదు ముందునుంచి కదిలిపోతోంటే కొట్లాటలు మొదలయ్యాయట. బ్యాండు తారాస్థాయిలో సాగటంతో నమాజు చేసుకుంటున్నవాళ్లు ఒక్క ఉదుటున బైటికి దూకి "కాఫిర్లని ఖతం చెయ్యండి" అని పెడబొబ్బలు పెట్టారు. పెళ్లికొడుకు ముస్లిముల కత్తి కెరకాగానే ఊరేగింపులో నడిచే హిందువులు ముస్లిములమీద తెగబడ్డారు. వీధుల్లో శవాలు పోగుబడ్డ కాస్సేపటికి పోలీసులు వెంచేశారు. కర్ఫ్యూ విధించారు.

ఆ గందరగోళం కళ్లారా చూడ్డానికి అక్కడికి ఎగిరి వెళ్లాలని మనసు తహతహలాడింది. ఎప్పుడైనా, ఎక్కడికైనా



ఎగిరి వెళ్లడానికి ఆత్మకి అడ్డంకి ఏముంది! కాని, ఒకవేపు నా శవ యాత్రకు సన్నాహాలు జరుగుతోంటే, నేను ఇల్లు విడిచిపెట్టి ఎలాపోను! ఆతిథ్యం ఇచ్చేవాడు అతిథుల్ని విడిచిపెట్టి వేరే విందుకు పరిగెత్తిపోయినట్టుగా ఉంటుంది. పెళ్లికొడుకులా అనుభూతిపొందుతున్న నేను అక్కణ్ణుంచి ఉడాయించలేను.

"బ్యాండుమేళం మానేయాలేమో!'' అన్నాడు నవనీత్ దేశ్‌పాండే మా నాన్నతో.

అటువంటి అశుభం పలికినందుకు దేశ్‌పాండేమీద నాన్న కోపంగా "ఎందుకు?" అనరిచాడు.

"అది పోలీసు కమీషనర్ ఉత్తర్వు. పాతబస్తీలో మతకల్లోలాలు జరుగుతున్నాయిగదా'' అన్నాడు దేశ్‌పాండే.

"అయ్యో... భగవంతుడా!'' నాన్న నీరసంగా గొణిగాడు.

తప్పెట్లు తాళాలులేని మూగ ఊరేగింపుతో నన్ను మోసుకెళ్లబోతున్నారు. నిజానికి నాకిలాంటి ప్రశాంత శవయాత్ర అంటేనే ఇష్టం. నేను పోయినందుకు అనేకమంది లోలోపల ఆనందంగా ఉన్నప్పుడు స్మశానానికి జనసందోహం తోసుకు రావటంలో అర్థంలేదు. జార్జి, రాము, దేశ్‌పాండేలు స్మశానానికి రారని ఆశించాను.

టాపు తీసేసిన డాడ్జి గేటుముందు ఆగింది. బహుశా నా శవాన్ని స్మశానానికి తీసుకుపోవటానికి ఈ వాహనాన్ని అద్దెకి మాట్లాడివుంటారు. డ్రైవరు చకచకా కిందికి దిగి, ట్రక్కు వెనక్కి పరిగెత్తి, గొలుసు ఊడదీశాడు. మూత తలుపు మోతపెడుతూ కిందికి వాలింది. బక్షీష్, గోపాల్, గౌస్, నాన్న కలిసి నా శవాన్ని మృదువుగా ట్రక్కులో దించారు.

"నా శరీరంలో ఒక భాగం వెళ్ళి పోతోంది. ఈ ముసలి అస్మా రోగిష్టి తల్లికి మాత్రం ఇంకా రోజులు నిండలేదు. నన్నూ ఆ చితిమీదికి దూకనివ్వ రెందుకు? నా కొడుకుతోపాటే నన్నూ కా లి పో ని వ్వ రెం దు కు?" అమ్మ గొణుక్కుంది.

అమ్మా, అదృష్టముంటేపదమూడోరోజు తరువాత మళ్ళీ మానవజన్మ ఎత్తుతా. ఇంకో తల్లి కడుపులోంచి ఈ భూమ్మీద పడతాను. మరో జీవితచక్రం పూర్తిచేస్తా. ఇప్పుడు నువ్వు శోకిస్తున్నట్టుగానే ఆ తల్లీ నా శవంమీదపడి విలపిస్తుంది. కనుక ఈ చక్రం అనంతంగా తిరుగుతూనే ఉంటుంది. మనిషి గతి ఇంతే. ఇక ఏడవ కుండా నీ కొడుక్కి కడసారి వీడ్కోలు ఇవ్వమ్మా. పునర్జన్మకుముందు నాకు మనశ్శాంతయినా కలుగుతుంది. అందరి కన్నా ఎక్కువగా నాకు నీ ఆశీస్సులే కావాలమ్మా.

ట్రక్కు కదిలింది. ట్రక్కు వెనక కార్లు బారుతీరాయి. అమ్మ శోకంతో గాలి ప్రతిధ్వనిస్తోంది. మెయిన్‌రోడ్డు చేరేసరికి స్పీడందుకుంది. శవయాత్రసాగుతోండగా హఠాత్తుగా వాహనాలన్నీ కీచుమంటూ ఆగిపోయాయి. ట్రక్కు డ్రయివరు సీట్లోంచి కిందికి దూకి ఇంజను మూత ఎత్తాడు. నాన్న కూడా కార్లోంచి దిగాడు.

"ఫ్యూయల్ పంపు చెడిపోయిందను కుంటా" అన్నాడు డ్రయివరు.

"బాగయ్యేసరికిఎంతసేపుపడుతుంది?" అనడిగాడు నాన్న. కార్లు డ్రయివ్ చేసు కుంటూ వస్తున్నవాళ్లుకూడా ఏమయిందో కనుక్కోడానికి ట్రక్కు చుట్టూ మూగు తున్నారు.

"ఇరవైనిముషాలు పడుతుంది సార్" అన్నాడు డ్రయివరు.

డామిట్! ఈ ముదనష్టపు ట్రక్కు ఇక్కడే ఆగిచావాలా? పైగా ఉస్మాన్ గుట్టపక్కన? ఒకనాటి సాయంత్రం నేననుభవించిన ఘోర పరాభవాన్ని గుర్తు చేయడానికి యముడి నాటకం ఆడు తున్నాడా? గౌస్ ఈ చుట్టుదారి సూచించక పోయినా బావుండేది. అయినా ఆ అమాయ కుడికి ట్రక్కు ఇక్కడ ఆగిచస్తుందని ఏం తెలుసు? ఈ గుట్టమీద నాకొకప్పుడు భయంకరమైన అనుభవం జరిగినట్టు ఏం తెలుసు? ఆ కుళ్లు జ్ఞాపకాన్ని నా స్మృతి పథంనుంచి శాశ్వతంగా చెరిపేసుకుందా మనే నా తపన ఎవరికి తెలుస్తుంది?

హఠాత్తుగా ఏదో అతీతశక్తి నా ఇష్టా నికి వ్యతిరేకంగా నన్ను ఆ గుట్టమీదికి నెట్టుకుపోతున్నట్టుగా అన్పించింది. నేను గు ట్ట మీ ది కి చేరీచేరగానే ఆనాటి సాయంత్రం జరిగిన అనుభవం నా మనోనేత్రం ముందు గిర్రున తిరిగింది.

"ఇక్కడికి తీసుకొచ్చావెందుకు?" గుట్టమీదికి రాగానే రజియా అడిగిన మొట్టమొదటి ప్రశ్న.

"ఇటువంటి ప్రశాంత, ఏకాంత ప్రదేశం నీకు నచ్చలేదా? నాకిది నందన వనంలా ఉంటుంది"

"నీకేదో పిచ్చి పట్టిందనుకుంటా.




కనీసం పచ్చగడ్డయినా లేదు. బండరాళ్లు, బ్రహ్మజెముడు పొదలూతప్ప ఏమున్నాయ్? ఎటుచూసినా రాళ్లు-బండరాళ్లు!" అంది రజియా విసుగ్గా.

"ఔను. అయితేనేం మనోహరంగా లేవూ? ఉలితో చెక్కిన శిల్పాల్లా లేవూ? వాటికి వార్ధక్యం లేదు. అవి నిత్య యవ్వనాలు. అజరామరమైన అందాల ప్రతిమలు. సూర్యాస్తమయ సమయంలో ఈ రాళ్ళ మీద వెల్లకిలా పడుకుని క్షణక్షణం రూపుమార్చుకునే మబ్బుల్ని చూస్తుంటే ఏం అనుభూతి! మబ్బులు కావవి, నక్కల వేటలో అరితేరిన వేటకుక్కల గుంపులు; వెదల్పు దవడల్తో వెరపుపుట్టించే మొసళ్ళ మందలు; సర్కసు బఫూను రకరకాల రంగురంగుల దుస్తులు; ఓడి పారిపోయే సిపాయిల పటాలం...

"నాకీ పైశాచిక వర్ణనలు గిట్టవ్. నీ వేటకుక్కలు, వెదల్పు దవడల మొసళ్లు ఎవరిక్కావాలి? నేనయితే చక్కలిగింతలు పెట్టే చక్కని ఊహాచిత్రాలు ఊహించు కుంటాను"

గుండ్రటి మచ్చల పిచ్చుక ఒకటి గుండ్రాయిమీద వాలి రజియా మాటల్తో శృతి కలుపుతూ నన్ను ఎద్దేవచేస్తూ కిచకిచలాడి తుర్రుమని ఎగిరి పోయింది.

"నా నందనవనాన్ని ఎగతాళి పట్టిస్తున్నావ్!"

"మహాశయా! ఇది మీ నందనవనమే. మరి నన్నెందుకు ఇక్కడికి తీసుకొచ్చి నట్టు? నా నగ్నచిత్రం గీద్దామనా? లేదా నాతో లవ్వాడుదామనా?" అంది రజియా పరిహాసంగా కన్నుగీటుతూ.

"రెండూ కాదు"

"మరెందుకో?"

"సృష్టిలో తొలి స్త్రీ పురుషులు ఆడం, ఈవ్‌ల మాదిరిగా ఆడుకుందామని"

"ఏమిటో ఆ ఆట?"

"ఒంటిమీద నూలుపోగు లేకుండా ఈ రాతి పలకమీద వెల్లకిలా పడుకుని ఆకాశంలోకి తదేకంగా చూద్దాం" అంటూ బట్టలు విప్పుతున్నాను.

"అంటే, అలౌకిక ధ్యానమా? చిత్రకారుడు-ప్రేమికుడు- పిచ్చివాడు, ఈ ముగ్గుర్నీ కలబోసిన మూర్తిత్రయం!"

దూరంగా రాత్రి షిఫ్టు పనివాళ్లని కేకేస్తూ మిల్లు కూసింది. వాటి దూసుకున్నాను. ఏడుంటావు. ఎర్రటి సూర్యబింబం పడమటి సముద్రంలో మునిగి పోయింది. మునిమాపు చీకట్లు ఐదలు విరబోసుకుంటున్నాయి. నింగిలో చంద్రో దయమైంది. తెల్లని కలహంసలా చంద్రుడు బాలేనృత్య భంగిమలు ప్రదర్శిస్తూ ఆకాశంమీద వడివడిగా అడుగులు వేస్తున్నాడు.

"అటు చూడు" అంది రజియా చందమామకేసి చూపిస్తూ. "జాబిల్లి మనకేసి ఎలా రెప్పార్పకుండా చూస్తుందో చూడు. దానిముక్కు కొనమీద చూపు నిలిపితే సంపూర్ణమైన మొహం కనిపించడంలేదూ? విశాలమైన నుదురు, చెవులు, చెంపలు, నోరు, చుబుకం...అంతా స్త్రీముఖాకృతి. ప్రియునికోసం ఒంటరిగా ఎదురు తెన్నులు చూసే అభిసారికలా లేదూ?"

"అద్భుతం! నీకూ కవితావేశం పూనింది....రజియా! నవాబ్ సులేమాన్ అలీ విత్తనం వేసినా నువ్వు నిజంగా కళాకారుని వెన్నెలిగా పుట్టావంటే నమ్ము" అన్నాను పరవశత్వంలో.

"రానురాను నువ్వు మరీ చిలిపివాడి వవుతున్నావ్ రామీ!"

రజియా చెప్పినట్టు నీలాల నింగిలో

జాబిల్లివంక చూపు నిలపాలనుకుంటూనే పక్కకి చూశాను. రజియా నగ్నంగా నా పక్కన మేనువాల్చింది. భగవత్ప్రీతికోసం అభ్యంగన స్నానం అభిషేకం చేయించిన స్త్రీమూర్తిలాగా.

"ఆదం! మరి నీ సంగతేమిటి?" గుసగుసలాడింది రజియా. నిర్మలమైన వెన్నెట్లో ఆమె నల్లటి కళ్లు కాంతులు పుక్కిలించాయి.

నేనూ పూర్తిగా బట్టలుతీసేశాను. ఆమె అందం నాకు కైపెక్కించింది. పదగ్గది నాలుగు గోడలమధ్య అటువంటి అందం నాకు ఏనాడూ అనుభవం కాలేదు.

"నువ్వు జాబిలిలో లీనమైపోయావు" అంది రజియా.

"ఔను. చందమామను చూస్తుంటే నేనీ లోకమే మర్చిపోతాను. మనస్సుని కాన్వాసులోకి చొప్పిస్తే కనిపించే చిత్రవ్వ.... ఈ బాహ్య ప్రపంచపు స్పృహే ఉండదు నాకు"

"ధ్యానంలో మాదిరిగానా?" అంది రజియా చిరునవ్వు నవ్వుతూ.

"ఏమో!"

ఏదో కలకలం వినిపించింది. కుమ్మరి పురుగు ఝుంకారం... ఎక్కడో గుట్ట అవతలి వేపునుంచి గుడ్లగూబ అరుపు... పక్కన చెట్టుగుబురులో కౌజు పిట్టల చప్పుడు...

రజియా నా రొమ్ముమీద మెత్తగా చేతో నిమురుతోంది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో ఉద్రేకపు పొంగు...

"వొద్దు, డార్లింగ్! చందమామని, మబ్బుతునకల్ని చూస్తూపొద్దుపుచ్చుదాం."

"ఎందుకట్లా?"

"అట్లాకాకపోతే, నా 'ఈవ్'కి గర్భం రాదూ? నందనవనంలో మంత్రసానులు, ప్రసూతి వైద్యులు గర్భస్రావం చేసే వాళ్లు ఉండరు. వాళ్లంతా పాపం పుట్టాక వచ్చారు..."

"ఏం ఫరవాలేదు. ఆ పాపమేదో ఇప్పుడే ఇక్కడే పుట్టనివ్వు" అంది రజియా గోముగా నన్ను చుట్టేసుకుంటూ.

"ఆటన్నా తరవాత నిబంధనల ప్రకారమే ఆడాలి. నువ్వు కోరేదితరవాత చేసుకుందాం"

"కాదు. ఇప్పుడే ఇక్కడే కానిద్దాం!"

రాతిగుండు వెనకనుంచి ఎవరిదో కర్కశమైన కంఠం మోగింది. రజియా, నేనులేచి బట్టలు సర్దుకుందామనుకునే లోపునే ముగ్గురు ఆయుధ పాణులు మా ముందు యమకింకరుల్లా నిలబడ్డారు. ముగ్గుర్లో ఒకడు భారీగా ఉన్నాడు. వాడు అమాంతం నామీదికి దూకాడు. ఆకు పచ్చ టోపీలు పెట్టుకున్న మిగతా ఇద్దరు రజియాని లేవనీకుండా నేలకి అదిమిపట్టి నోట్లో గుడ్డలు కుక్కారు. నామీదికి దూకినవాడు నా చేతులు మెలిపెట్టి తల గుడ్డ విప్పి పక్కన చెట్టుకు కట్టేశాడు నన్ను. నా నోట్లో రుమాలు కుక్కాడు.

నేను నోరెత్తి అరవలేను. కాలూచేయి కదపలేను. నాకు కళ్లలో నీళ్లుబికాయి. ఆ ఎద్దు చకచకా బట్టలు విప్పేసి రజియా మీద పడ్డాడు. ఆకుపచ్చ టోపీల వాళ్లిద్దరూ రజియా కాళ్లు కొట్టుకోకుండా నేలకి అదిమిపెట్టారు. గుహల్లో నివసించిన ఆదిమ మానవుడి శక్తే నాకుండి, నన్ను కట్టేసిన తలగా బట్టని చించేసి, ఈ ముష్కరుల పామెడలు విరిచెయ్యగలిగితేనో! కాని నేనెంత? నా బలమెంత??

వాళ్లు నా కళ్ళకి గంతలు కట్టినా బాగుండేది. ఆ ముగ్గురు దయ్యాలూ ఒక అబలని మానభంగంచేసే ఘోరకలి




కళ్ళబడకుండానైనా ఉండేది. ముగ్గురు మనుషులు నిర్బంధించినా రజియా ఆడ పులిలా వాళ్ళని కాళ్ళతో తన్నింది. పళ్ళతో రక్కింది. కాని ముగ్గురు బలాఢ్యులముందు ఓ అబల బలం ఎంత? చొప్పకట్టలా కదలిక లేకుండా పడుంది. నేనూ జీవచ్ఛవంలా మొహం వాల్చేశాను. ముగ్గురూ పని ముగించి చకచకా బట్టలు వేసుకున్నారు. రజియా లేచి చీర చుట్టుకుంది. ఆమె కళ్ళు నిప్పులు కురిశాయి. గొంతు తడారిపోయింది. పెదాలు ఒణికాయి.

ఎద్దులాంటి సిక్కు నా కట్లు విప్పాడు. వాడి కళ్ళలో విజయహాసం తొణికిసలాడింది.

"టోస్... జీవితంలో సరదాలన్నీ ఇతర్లతో కలిసి పంచుకోవాలి. మీ అమ్మ నీకు చిన్నప్పుడు ఇంత చిన్న విషయం నేర్పలేదా?" అన్నాడు కొంటెగా.

దెబ్బతిన్న బెబ్బులిలా రజియా అతని మీదికి దూకింది. వీపు మీద గుద్దింది. ఎడం భుజంమీద కొరికింది. అయినా వాడు తిరిగి చెయ్యిచేసుకోలేదు. వికారంగా నవ్వాడు.

"ఒసేయ్...నాచిచింౖద్రీ! ఇట్టారక్కితే నేనే ప్రేమకి చక్కిలిగింత! కాని నీ మగాడు వేలు కదిపినా పేల్చిపడేస్తాం జాగర్త! వీడి శవాన్ని కాకులకి, గద్దలకి వేసి మరీపోతాం" అన్నాడు గడ్డాలోడు.

వాడు ఆ మాట అన్నాడోలేదో మిగతా ఇద్దరూ బాకులు తీసి నా వేపు నడిచారు.

"చిలకా...నీ కడుపున మూడుకాయలు కాయాలే!" అన్నాడు సిక్కు రజియా కేసి తిరిగి.

"పంది వెధవలు" రజియా పళ్ళు పటపటలాడించింది.

"నీ మగధీరుడు చూడు ఎంత నెమ్మదిగా ఉన్నాడో! తన పరిమితులేమిటో అతనికి తెలుసు. తెలివైనవాడు!"

ఈ కూతలకన్నా వాడి బాకు పోటే నయం. నపుంసకుణ్నయిపోయి శక్తియుక్తీ ఉడిగిపోయి నీరసంగా నిలబడిపోయాను. లోపల సిగ్గుతో చితికిపోయాను. నాడాలుకొట్టిన బూటు కింద అణగిపోయిన పేడ పురుగులా అయిపోయాను.

ఆ రాక్షసులు ఈలవేసుకుంటూ కదిలిపోయాక కూడా నేను చెట్టుకి అంటుకుపోయి ఆకాశంకేసి శూన్యంగా చూస్తూ నిలబడిపోయాను. చందమామ కూడా నా చేతగానితనానికి ఉమ్మేసింది. తలమీద చినుకుపడింది. నిజంగా చందమామ ఉమ్మా, వాన రాకడకి సూచనా?

"పద పోదాం" రజియా గొంతు బొంగురుగా మోగింది.

నాకు తల కొట్టేసినట్టుగా ఉందని తను చప్పున గ్రహించింది. చొక్కా, ప్యాంటు తీసి అందించింది.

"బట్టలు వేసుకో...జరిగిందేదో జరిగిపోయింది"

గబగబా బట్టలువేసుకున్నాను. ఇంతటి అత్యాచారానికి బలైకూడా రజియా తేరుకుంది. నేనుమాత్రం అప్పటికీ చచ్చుబడిపోయినట్టే వున్నాను.

"ఊఁ!" మూలిగాను.

ఓ క్షణం గడిచాక పెద్ద చప్పుడు వినిపించింది. ఏదో పగిలిన శబ్దమైంది.

ఇద్దరం మెల్లగా గుట్ట దిగాం. కార్లో ఎక్కి కూర్చుని ఇంజను స్టార్ట్ చేశాను. కారు ఒక వైపుకి తూలింది.

"టైరులోగాలిపోయింది"అన్నాన్నేను.

"పోతూపోతూ చేసిన కిరాతకం! టైరు పేల్చేశారు"

ట్రంకులోంచి జాక్ బైటికి తీశాను. స్పేర్ టైరు బిగించాను. ప్రశాంతమైన రాత్రిని కెలుకుతూ ఎండుటాకులమీద టపటప రాలే చినుకుల చప్పుడు. నా తల, భుజాలు పూర్తిగా తడిసిపోయాయి.

కార్లో కూర్చున్నాం నిశ్శబ్దంగా. గుల్షన్ మంజిల్ చేరేదాకా మా ఇద్దరి మధ్యా మాటా పలుకూ లేదు.

"ఇక నన్ను ముట్టుకోవనుకుంటాను. నేను మైలపడిపోయానుకదూ!"

"అంతా మర్చిపోదాం"

"ఆల్ రైట్. ఎవరితోనూ చెప్పవుగదూ!"

"చెప్పను"

"మనిద్దరిమధ్యా కూడా మళ్ళీ ఈ ప్రసక్తి తేవుకదూ!"

"తేను"

ఇంటివేపు కారు తిప్పాను. దారి పొడుగునా ఒక దృశ్యం నా మనోనేత్రం ముందు గిర్రున తిరుగుతోంది. రెండు శవాలు: ఒకటి నేలమీద వెల్లకిలాపడుంది. రెండవది చెట్టుకి కట్టిపడేసివుంది. అవమాన భారం నా గుండెని పిండేస్తోంది. కాని ఆవిడభరించిన అవమానమో! అదేనన్ను నేను ప్రశ్నించుకున్నాను.

మరు రోజు సాయంత్రం క్లబ్‌లో సింగు ముందు కూర్చున్నాను. అతను నా చిరచిర కనిపెట్టేశాడు.

"ఏమైంది?" అనడిగాడు బక్షీష్-నేను బేరర్‌ని ఓ స్మాల్ పెగ్ తెమ్మంటుండగా.

"ఏంలేదు" అన్నాను.

"నేను నమ్మను. మీ గుండెల్లోని క్షోభ మీ కళ్ళల్లో కనిపిస్తోంది.రజియాతో ఏమైనా...."

"గొడవపడ్డానా అంటారా? లేదు... అలాంటిదేమీ లేదు"

నిన్నటి సాయంత్రం జరిగిన భయంకరానుభవం ఎవ్వరికీ తెలియనివ్వనని ప్రమాణం చేసినా, నా గుండెల్లోని భారం వేరే రూపంగానైనా దించేసుకోవాలనే తపన ఎగదన్నింది.

"అవమానమనేది ఆత్మని కుంగదీస్తుంటాదంరా?" అనడిగాను.

బక్షీష్ విస్కీగ్లాసు కింద పెట్టి, ముందుకు వొంగి నా ఆత్మక్షోభకి క్లూ కనిపెట్టేవాడిలా నా మొహంలోకి చూశాడు.

"దేశ్‌పాండే మళ్ళీ నీపైన కొత్త కుట్రేమైనా పన్నుతున్నాడా!"

"లేదు. అతనికి నేనడిగిన ప్రశ్నకి సంబంధంలేదు"

"అయితే ఇదేదో అంతుపట్టని నిగూఢ రహస్యమే. మీరేదో మహా వేదాంత ధోరణిలో మాట్లాడుతున్నారు"

"అవమానం గురించి మీరెప్పుడూ ఆలోచించలేదా?"

"ఆఫ్‌కోర్స్...అది ఒక నిర్దిష్టమైన సంఘటనతో లేదా పరిస్థితితో ముడిపడి వుంటుంది"

"అవమానం అనే దానిమీద జనరల్‌గా చర్చించుకోవచ్చుకదా?" అన్నాన్నేను పట్టు విడవకుండా.

"అలాగే. మీరు ఇందాక అన్నట్టుగా కాకుండా అవమానం ఆత్మశోధనం కూడా చేస్తుంది. అది చేతనకి పర్యాయపదంగా తీసుకోవచ్చు. మనిషి ఆత్మజ్ఞాని అయ్యే అమూల్య క్షణం అది. బాధపడతాను గనుకే నేను బతికి ఉన్నాను అన్నారొకరు. ఆ మాట ఎవరన్నారు చెప్మా?"

"సాధారణమైనదాన్ని అసాధార





ణంగా చెప్పే నిస్సారమైన తత్వం అది" అన్నాను విస్కీ చప్పరిస్తూ.

"మీ మనస్సుని తొలిచేదేదో బైటికి కక్కేయండి. అప్పు చెప్తాను..." బక్షీష్‌సింగ్ గ్లాసుపైకెత్తి ఓ గుటక వేశాడు. నా ఆస్యం చస్తే బైట పెట్టను.

ఇద్దరిమధ్యా క్షణం నిశ్శబ్దం.

"మీ రెప్పు నా అవమానం భరించారా?" అనడిగా సూటిగా.

"ఔను...క్కసారి"

"అదెలా గింది?"

"మా రా మంత్రితో జరిగింది. ఆయన నా ట్యాటీ ముందు నామీద కేకలు వేశా ఏదో ఆర్థిక కుంభకోణం గురించి నావ విచారణ జరిపిస్తానని బెదిరించాడ

"ఆ మానానికి మీరెలా రియాక్ట్ అయ్యార

"నేచిరునవ్వు నవ్వాను. ఎప్పుడు ఎవరిము లెక్కలు చూపించమన్నా నేను మే అన్నాను"

'యన మిమ్మల్ని అవమాన పరచ్చన అవసరం ఏమొచ్చింది!" అన్నాను.

ఆయన గౌరవార్థం ఇచ్చిన ఒక వికి నేను హాజరుకాలేదని కక్ష గట్టా డే అనుకుంటాను. నిజానికి నేను నకి అమర్యాదకలిగించాలని ఏనాడూ కోలేదు. ఏమైతేనేం... ఆ అవమానం కొక గుణపాఠం నేర్పింది" అన్నాడు క్షీష్.

"ఏం నేర్పింది?"

"నేనూ మానవమాత్రుణ్నేననీ, దూషణతిరస్కారాలకు అతీతుణ్నికాననీ నీతి నేర్పింది. నిన్ను గాయపరిచినవాడి పట్ల కూడా నీకు జాలిగుణం ఉండాలని నేర్పింది. నీ చైతన్యం అప్పుడు సంపూర్ణ వికాసం పొందుతుంది"

"అది చాలా స్వల్ప విషయం"

"మీకు జరిగినదాంతోపోల్చుకుంటే"

నేను దాదాపు బైటపడిపోయేక్షణం వచ్చేసింది. వెంటనే తమాయించుకున్నాను.

"లేదు. నేను ప్రస్తావించింది వ్యక్తిగతమైందికాదు" అని నీళ్ళు నమిలాను. మొహం తిప్పుకున్నాను. బక్షీష్ చెప్పిన దాంట్లో నా హృదయాన్ని తాకిందేదో ఉంది.క్లబ్‌నుంచి సరాసరి గుల్షన్‌మంజిల్ వేపు బయల్దేరాను.

"మేమ్‌సాబ్ ఉన్నారా?" అనడిగాను లాన్‌లో గోళ్ల గిల్లుకుంటూ కూర్చున్న ముంతాజ్‌ని.

ముంతాజ్ గబగబాలేచి, "గడియ పెట్టుకుని గదిలో కూర్చుండిపోయారు సాబ్. నిన్న రాత్రినుంచి పచ్చి మంచి నీళ్లు ముట్టుకుంటే ఒట్టు" అంది.

నేను గుమ్మంలో నుంచుని తలుపుమీద నెమ్మదిగా తట్టాను.

"ఎవరది?" లోపల్నుంచి రజియా గొంతు కటువుగా మోగింది.

"నేనే"

అడుగుల చప్పుడు వినిపించింది. తలుపు ఓరగా తెరిచి బయటికి తొంగి చూసింది.

"నువ్వా?" అంది పక్కకి తొలిగి.

లోపలికి అడుగుపెట్టి తలుపు బిగించాను. సుకుమారంగా ఆమె బుజాలు పట్టుకుని పక్కమీదికి లాగాను. గోడ మీద నాట్యమయూరి బొమ్మ చూడగానే నాకు రెండు పరస్పరవిరుద్ధమైన మొహాలు కళ్ళముందు కదలాడాయి. ఒకటి ఆనంద



తన్మయత్వంలోని నాట్యకత్తె ముఖం. రెండోది కత్తివాటుకు నెత్తురు చుక్కలేని రజియా ముఖం.

నేను చకచకా బట్టలు విప్పేసి పక్క మీద చేరాను. రజియా స్థాణువై నిలబడి వుంది- కళ్ళు బైర్లుకమ్మే కాంతికి రోడ్డు మధ్య నివ్వెరపోయి నిలుచుండిపోయిన కుందేలులా.

నేను పక్కమీంచి ముందుకు వంగి రజియాని మీదికి లాక్కున్నాను. మతి కోల్పోయినదానిలా నా పక్కన అచేతనంగా పడుకుంది. ఆమె కళ్ళలోకి చూడాలంటే భయంవేసింది. ఆ కిరాతకుల ఆకారాలు ఆమె కనుపాపల్లో గడ్డకట్టుకుపోయాయేమోనని.

"అబ్బ... రద్దూ!" గుసగుసలాడాను.

"ఇట్లాగే ఎందుకు పడుకోకూడదు?"

"అది అసహజంగా వుండదూ!"

ఆమె మాట ఆమెకే అప్పజెప్పాను. అది పనిచేసింది. వాడిపోయిన ఆమె మొహంలో వంద బల్బులు వెలిగాయి. ఆమె పెదాలమీద చిరునవ్వు విరబూసింది. ఆమెని చేతుల్లో పొదివిపట్టుకున్నాను. మొహం, మెడ, రొమ్ములు ఒళ్ళంతా ముద్దుల్తో ముంచెత్తాను. కుమ్మరి సారె మీది మృత్తికలా నా స్పర్శకి మెత్తబడి పోయింది. నెమ్మదిగా బట్టలు ఒక్కటొక్కటీ లాగిపారేశాను. ఆమె కళ్ళు నా

వేళ్ళమీద నిలబడిపోయాయి.

ఆమెని దగ్గరికి తీసుకున్నాను. గట్టిగా ఒత్తుకున్నాను. ఇద్దరం ఒకరినొకరు చుట్టుకుపోయాం. ఆర్యసమాజం గుడిలో పూజారి గదిలో మృదువుగా సరాగాలాడుకునే పిచ్చుకల జంట గుర్తొచ్చింది. ముక్కుల్తో రక్కుకోవటంలేదు. ముదిరిన ఉద్రేకంలో దురుసుగా తోసుకోడంలేదు.

రజియా చివాల్న పక్కలో లేచి కూర్చుని, చేతుల్తో మొహం కప్పుకుని సన్నగా ఏడ్చింది.

"ఏమైందిప్పుడు?" అన్నాను - ఆమె జుత్తులోకి వేళ్లపోనిచ్చి ప్రేమగా నిమురుతూ.

ఓ క్షణం మౌనం.

"థాంక్యూ" అంది రజియా నిట్టూరుస్తూ.

*　　　*　　　*

ఫ్యూయల్ పంపు బాగయింది. ట్రక్కు కదిలింది. మళ్ళీ శవయాత్ర సాగారింది. చీకటి జ్ఞాపకాల గుహలోంచి బయట పడ్డాను.

ఊరేగింపు గాంధీబొమ్మదగ్గర మళ్ళీ ఆగిపోయింది. కర్ఫ్యూ పరిధికి కొద్దిగా అవతలవున్న ప్రాంతం అది. చీకటి పడకముందే వెచ్చాలు కొనుక్కుని ఇళ్ళకి పరుగెత్తాలని తొక్కిసలాడే జనం, వాహనాల రద్దీ.

ట్రాఫిక్ పోలీసు అందర్నీ తప్పుకోమని సైగచేస్తూ నా ట్రక్కుకి దారి ఇచ్చాడు. మరణించిన వాళ్ళపట్ల గౌరవ సూచకంగా కావచ్చు. రోడ్డుకిరుపక్కలా జనం నా శవంకేసి నోళ్లు వెళ్లబెట్టిచూస్తూ నిలబడ్డారు. "ప్రఖ్యాత చిత్రకారుడు రామకృష్ణ శవం" అన్నారెవరో.

"వచ్చే నెల ఆయన చిత్ర ప్రదర్శన చూడాలని తహతహలాడిపోయాను"

"వాన రాకడ ప్రాణం పోకడ ఎవరు చెప్పగలరు!''

"తను ఎక్కువ ప్రేమించేవాళ్లనే భగవంతుడు తొందరగా ఎత్తుకుపోతాడు"

''అయ్యో, ఎంత పాడురోజు పోయాడు! పరలోకానికి పంపించేప్పుడైనా మేళతాళాలు లేవు...ప్చ్...''

''పాపం చాలా మంచివాడు. ఆలిండియా రేడియోలో ఆయననిగురించి ఎంత ఘనంగా పొగిడారో!''

"ఆలిండియారేడియోవాళ్లు అందర్నీ అలానే ఘనంగా పొగుడుతారు. ఎవర్నిగురించైనా అదే అరిగిపోయిన రికార్డు''



# 7

నా శవాన్ని స్మశానంలోకి మోసుకుపోతోంటే, అప్పటికే అక్కడ మందుతోన్న అరడజను చితుల్ని చూసి నాన్నకి గుండె బేజారయింది. తెల్లటి మస్లిన్ బట్టల్లో చుట్టిన అనేక శవాలు గోడ వెంబడి నేలమీద పడుకోబెట్టి ఉన్నాయి. రాత్రి బాగా పొద్దుబోయి వచ్చే రైలు కోసం చలికాలం సాయంత్రం మడతల్లో చుట్టిపెట్టిన అలసిపోయిన రైల్యుప్రయాణికుల్లా ఉన్నాయి ఆ మృతదేహాలు.

"మీరిక్కడే నిలబడండి. నేను ఆఫీసు మేనేజర్‌తో మాట్లాడి వస్తాను" అన్నాడు గోపాల మీనన్ మా నాన్నతో.

దహనక్రియకి సైతం సిఫారసు

చేయించాల్సిన పరిస్థితి ఏర్పడింది. శవాల క్యూ పెరిగిపోవడంతో మేనేజరుకు గిరాకీ హెచ్చింది.

"సేఠ్ కిశోరీలాల్ కబురెట్టానన్నారు" అన్నాడు నాన్న.

"దానివల్లా కొంత పని జరగొచ్చు"

గోపాలమీనన్ ఆఫీసు గదిలోకి నడిచాడు. మేనేజరు ఓ విశాలమైన టేబులుముందు కూర్చున్నాడు. బైట గందరగోళంతో నిమిత్తం లేకుండా తామరాకు మీది నీటిబొట్టులా తాపీగా నిర్వికారంగా కాగితాలు చూసుకుంటున్నాడు. ఓ వ్యక్తి తన బంధువు చితాభస్మం తీసుకుపోవడానికి నిలబడున్నాడు. అతని వెనక గోపాల మీనన్ నిశ్శబ్దంగా నిలబడ్డాడు. చితాభస్మం పాత్ర లో సేకరించి ముందున్న పెద్దమనిషి వెళ్లిపోగానే గోపాల మీనన్ మేనేజరు ముందుకుజరిగి "జ్ఞాపకం ఉన్నానాండీ?" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

"మీనన్‌గారు కదూ ! ఏమిటిలా వచ్చారు?" అనడిగాడు మేనేజరు.

"ఓ చిన్న సహాయం చేసిపెట్టాలి"

"చెప్పండి"

"నా ఆప్తమిత్రుడొకరు పోయాడు. అతని శవదహనం గురించి వచ్చాను. చాలా పెద్ద క్యూ ఉంది"

మేనేజరు గంభీరంగా నవ్వి, కుర్చీలో ఓ పక్కకి ఒరిగి కిటికీలోంచి బైటికి చూశాడు. ఆయన జవాబు చెప్పకముందే గోపాల మీనన్ అయిదు పదులు తీసి ముందుపెట్టాడు. మేనేజరు అమాంతం ఆ అయిదు నోట్లూ జేబులో కుక్కుకుని, నిండుగా నవ్వాడు.

"వెంటనే వివరాలు నింపండి. ఎడ్వాన్సు రిజర్వేషన్ కింద ట్రీట్ చేస్తాను" అన్నాడు.

"థాంక్స్" అన్నాడు గోపాల మీనన్.

వెంటనే వివరాలు పూర్తిచేసి రిజిస్టర్‌లో సంతకం చేశాడు.

"మేనేజరుగారూ! సేఠ్ కిశోరీలాల్ మీకేమీ మెస్సేజ్ పంపించలేదా?" అనడిగాడు మీనన్.

"లేదే"

కిశోరీలాల్ పచ్చి అబద్ధం ఆడాడన్నమాట! ఎంత దగా! గోపాల మీనన్ అయిదు పదులూ సమర్పించబట్టి పని చకచకా ప్రారంభమైంది. నా శవాన్ని చితిమీద ఉంచారు. చిన్న పురోహితుడు హడావుడిపడుతూ వచ్చాడు.

"చనిపోయినవారి కుమారుడెక్కడ?" అనడిగాడు వస్తూనే.

పురోహితుడికి మతిగానీ పోలేదు కదా! అనుకున్నాను. చనిపోయిందే కుమారుడు, తలకొరివి పెట్టేది మృతుని తండ్రి అని వివరంగా చెప్పాక అతనికి అర్థమైంది.

"మరి ఆయనేరి?" అనడిగాడు పురోహితుడు.

"ఇక్కడే ఉన్నాను పంతులుగారూ!" అన్నాడు నాన్న. చితికి నిప్పంటించారు నాన్న. భగ్గున అగ్ని జ్వాలలు పైకి లేచాయి. ఆ వెలుతుర్లో నాన్న కన్నీటి బిందువులు వేసవి ఉదయకాంతిలో మెరిసే మంచు ముత్యాల్లా అగుపించాయి.

"ఇక నా బాబు లేడు" నాన్న భారంగా నిట్టూర్చాడు.

స్మశాన వాటికలోకి హిందువులు స్త్రీలని ఎందుకు రానివ్వరో అప్పుడు నాకర్థమైంది. నిజంగా మా అమ్మ ఆ సమయంలో అక్కడ వుండివుంటే,

అమాంతం చితిలోకి దూకేసేది.

పురోహితుడు మంత్రాలు చదివాడు. వాటి భావం నాకు బోధపడింది,

పాంచ భౌతికమైన ఈ దేహం
తిరిగి పంచభూతాలలో కలుస్తుంది.
శబ్ద గుణకమైన శ్రవణం ఆకాశంలో
ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వాయువులో
అగ్ని అర్థ భాగమైన చక్షువు అగ్నిలో
ఆకాశవాయు సంయోగ జనితమైన మనస్సు చంద్రునిలో
భూజనితమైన శరీరం మృత్తికలో లీనమైపోతాయి
ఆత్మ చిదాకాశంలో
శిరోజాలు మొక్కల్లో
రోమాలు చెట్లల్లో
రక్తము, వీర్యము జలభాగంలో కలిసిపోతాయి.
సర్వాధికారం గల కర్మ మాత్రమే
పరలోకానికి నీవెంట వస్తుంది.
కామితార్థాలు నీవెంట కదలిరావు.

పురోహితుడు చావు మంత్రాలు చదువుకుపోతోంటే, నా చుట్టూజుమ్మంటూ ఏదో వింత శబ్దంహఠాత్తుగా మోగింది.

''మళ్లీ ఇక్కడ కలిశాం!"

నేను ఉలిక్కిపడ్డాను.

"నేను...రామస్వామిని;కాదంటే అతని ఆత్మని"

"నువ్వా రామస్వామీ! ఆశ్చర్యం!"

"ఇప్పుడు నన్ను రామ్ అని పిలువు"

"అయితే నేను రామీ"

"మనిద్దరిముందు పేర్లు ఒక్కటేనని నాకిప్పటిదాకా తెలీదు సుమా!''

"ఔను"

"రామీ ! ఇక్కడికి నువ్వెలా ఊడిపడ్డావ్? అంటే, నీ శరీరం నుంచి ఎలా బైటపడ్డావు?"

"మునిగిపోయి''

"ప్రమాదమా?''

"కాదు"

"నాదికూడా సహజమైన చావు కాదు. అటువంటివాటివెనక ఏదో ప్రచ్ఛన్న హస్తం ఉంటుంది"

"నువ్వు కారుప్రమాదంలోపోలేదా?"

"అది పత్రికల కథనం. నా ప్రియురాళ్లలో ఒకత్తి చేసినపని ఇది. కిందటిసారి నీ స్టూడియోకి ఒకదాన్ని వెంటబెట్టుకొచ్చా...జ్ఞాపకం ఉందా?"

''నీ పదహారువేలమంది గోపికల్లో ఎవర్నని గుర్తుపెట్టుకోగలను!''

గాలిలో నవ్వువాక.

"సరేసరే... వాళ్లలో ఒకత్తి. నేను వేరేదాంతో కులకటం చూసి అది ట్రక్కు డ్రయివరుకి సొమ్మిచ్చి నా కారుని గుద్దించింది"

''నిజంగా?"

''చచ్చిపోయినవాడు అబద్ధమెందుకు ఆడాలి? మనకిప్పుడు డొంకతిరుగుడుగా మాట్లాడే అవసరం లేదు. మన గుట్టురట్టు చేసేవాడు లేడు. నీ ఉద్యోగం, ఆస్తి కబళించేవాడు లేడు. ఆత్మజ్ఞానం వల్ల కలిగే బాధ ఒక్కటే."

"నన్ను పొట్టనపెట్టుకున్నదీ ఆడదే. ఎవరో కాదు — నా ప్రియభార్య. తన ప్రియుడిచేత నన్ను మూసీలోకి తోసేయించింది"

"అరి భగవంతుడా!" అతను బాధగా అరిచాడు.

నాన్న, బక్షీష్, గోపాల్, గౌస్‌లు శవదహనంకాగానే వెళ్లిపోయారు. నా ఆత్మ ఇంకా స్మశానంలోనే తిరుగుతోంది. వాళ్లు వెళ్లిపోయిన కాసేపటికి మరో శవం స్మశానంలోకి ప్రవేశించింది. బంధువులు,




స్నేహితుల ఏడుపులు, పెడబొబ్బల్తో వాతావరణం ప్రతిధ్వనించింది. ప్రతి మరణానికీ విలాపాగ్నులు, విషాదా శ్రువులు ఉంటాయి. అయితే ఈ శవం విషయంలో బంధుమిత్రుల శోకాలు భరించలేనంతగా ఉన్నాయ్.

"నమస్తే సాబ్" ఆ గొంతు నాకు లోగడ పరిచయం ఉన్నట్టుగాలేదు.

"ఎవరండీ?" అనడిగాను.

"లలిత్ దూబే. మీరు నన్నెరుగరులెండి. ఇంతకుముందు మీరు మరో ఆత్మతో మాట్లాడ్డం విని మీ గొంతు గుర్తుపట్టాను. చిత్రకళా ప్రదర్శనలు జరిగిన అనేక సందర్భాల్లో మీరు మాట్లాడ్డం విన్నాను"

"మీ పరిచయంకలగడం నాకు చాలా సంతోషం" అన్నాన్నేను - నా మరణానంతర కీర్తికి పొంగిపోతూ.

"నేను యువకళాకారుల క్లబ్‌లో సభ్యుణ్ణి. నిజానికి మిమ్మల్ని ఎక్కడ కలుసుకున్నానంటే..."

"అదిసరేగాని... మీరిక్కడికెలా వచ్చారు? ఆ శోకాలు పెడుతున్న వాళ్లు మీ వాళ్లా?" అనడిగాను అతని మాటకు అడ్డొస్తూ.

"అవునండీ! ఈవాళ ఉదయం పక్కామసీదుదగ్గర కత్తిపోట్లకు ఖతమైన పెళ్ళికొడుకును నేనే" అన్నాడతను.

"అయ్యో పాపం! ఆ కొట్లాట గురించి విన్నాను. పెళ్ళి ఊరేగింపయినా పూర్తి కాకముందే వధువుకు విధవ కావడం ఎంత దారుణం!" అన్నాను విచారంగా.

"నేనప్పటికి ఆ పిల్ల మెళ్ళో మూడు ముళ్ళు వెయ్యనేలేదండీ"

"అట్లాగా!" అన్నాను అప్పటికింకా వాళ్ళకి పెళ్ళికాలేదని గ్రహించి. "అయితేనేం వలచిన కన్యని వదిలిరావట మంటే...."

"మా మధ్య ప్రేమలు గట్రా లేవు లెండి. అదికూడా ఆపద్ధర్మ వివాహం. నేను గిటారు వాయించేవాణ్ని. ఆమె పాటలు పాడేది. స్త్రీ-పురుషుల మధ్య వ్యవహారం ఎలా ముగిసేదీ మీకు తెలియనిదేముంది! ఆవిడకి కడుపయింది. నేను కంగారుపడిపోయాను. గర్భస్రావం చేయించుకో అన్నాను. ఆ వెధవపని తనవల్ల కాదని మొండికెత్తింది. "నువ్వు నన్ను చేసుకోకపోయినా నీ వల్ల కలిగే బిడ్డని నీ జ్ఞాపక చిహ్నంగా కాపాడు కుంటాను. కడుపులో పిండాన్ని చంపట మంటే భ్రూణహత్యకాదా?" అంటూ పతివ్రతా ధర్మాలు వల్లించింది. ఆ విధంగా నేనా పెళ్ళి ఉచ్చులో చిక్కుకున్నాను"

"చూడూ... ఈ వెధవ వ్యవహారం యావత్తూ నడిపింది నువ్వేగదా! ఆవిడ కడుపులో ఒక ఆత్మని ప్రవేశపెట్టి చివరికి నువ్వే మరో స్త్రీ గర్భంలో ప్రవేశించబోతున్నావ్"

"నేనీ జంఝాటాలేవీ పెట్టుకోలేదు. నేను వేరే అమ్మాయి ప్రేమలోపడిపోయి కూడా ఈమెనే చేసుకుంటానని ముందు కొచ్చానా లేదా?"

"ఓహో! నీ గిటారుకి ఇంకో తీగ కూడా ఉందన్నమాట!"

"ఔను. ఆవిడొక వెన్నెలవాక. ఆ సంగతి చెప్పబోతుండేనే మీరు మధ్యలో అడ్డొచ్చారు. మిమ్మల్ని లోగడ కలుసుకున్నానని చెప్పాను...ఔనా! యువ కళాకారుల క్లబ్‌కి పదిహేనురోజులకిందట మీరొచ్చారు. నా దేవత ఆరోజు అక్కడే వుంది"

"ఎవరామె?"

"ప్రతిమ"

నేను తుళ్ళిపడ్డాను. విషయం మార్చ టానికి ప్రయత్నంచేశాను.

"మిమ్మల్నొకటి అడగాలను కున్నాను" అన్నాన్నేను గంభీరంగా.

"అడగండి"

"ఆ మతకొట్లాటల గురించి. అందులో నిజంగా తప్పెవరిది?"

"మా నాన్నది కావచ్చు. నా పెళ్ళి ఊరేగింపుకోసం యాభై వాయిద్యాల బ్యాండుమేళం ఏర్పాటుచేశాడు. మొఘల్ కోటని ముట్టడిస్తున్నట్టుగా మసీదుముందు నుంచే పదండని పురమాయించాడు. ముస్లిములు నమాజు చేసుకుంటున్నప్పుడు మ్యూజిక్ వాయిస్తే వాళ్ళకెంత పిచ్చెక్కి పోతుందో మీకు తెలుసు. వాళ్ళ దృష్టిలో అది అత్యాచారం"

"నిజమే ఒక హిందువుకి ఇంతటి సత్యదృష్టి ఉండటం అసాధారణం" అని అభినందించాను.

"మరణంవల్ల కలిగే మార్పను కుంటాను. మరణం మనం కళ్ళకి కట్టు కున్న గంతల్ని ఊడదీసి పారేస్తుంది. ప్రతి విషయాన్ని సరయిన దృక్పథంతో చూసే తెలివి ప్రసాదిస్తుంది"

"మనం పరస్పరం మన భావాలు విప్పి చెప్పుకోడానికి ఆత్మలన్నిటితో కలిపి ఒక క్లబ్బు పెట్టుకుంటేనో!" అన్నాన్నేను.

"అది సంచారక్లబ్బుగా ఉండా లండోయ్. సభ్యత్వం పదమూడు రోజులే. అంతర్జాతీయ విమానాశ్రయంలో కాస్సేపు ఆగే ప్రయాణీకుల్లాంటివాళ్ళం మనం"

ఆ మాటకి నేను నవ్వాను. ముందు న్నాయి ఒంటరితనం, నైరాశ్యం. రజియాని చూసి వస్తేనో! నేను పోయినట్టు ఆమెకసలు తెలుసా?



# 8

నా ఆత్మ ఇప్పటిదాకా చేసిన యాత్రల్లో స్మశానం నుంచి గుల్షన్ మంజిల్‌కి చేసిందే సుదూరమైంది. స్మశానమెక్కడ? గుల్షాన్ మంజిల్ ఎక్కడ? అయితేనేం శబ్దవేగాన్ని మించిన వేగంతో ఆత్మ అంతరిక్షయానం చెయ్యగలదనేది నాకు మొట్టమొదటిసారి అర్థమైంది. ఆటోమేటిక్ కెమేరా క్లిక్‌మనే లిప్తకాలం కన్నా ఇంకా తక్కువ కాలంలో నేను గుల్షన్ మంజిల్‌లో వాలి వుండాలి. అంతా రెప్పపాటులో జరిగిపోయింది.

రజియా కోసం మంజిల్ మొత్తం గాలించాను. లాంజ్‌లో లేదు. పడగ్గదిలో లేదు. రజియా నాన్నగారి ప్రైవేటు గది వేపునుంచి ఏవేవో చప్పుళ్ళు కలగా పులగంగా వినిపించాయి. నవ్వులు, చప్పట్లు, అరుపులు—అన్నీ కలిసిపోయి రణగొణ ధ్వని వినిపించింది. రజియా వాళ్ళ నాన్న గదిలో ఉందాఏం? ఆగదిలో నేను లోగడ ఒకే ఒకసారి అడుగు పెట్టాను. అదీ కొత్త సంవత్సరపు వేడుకల సందర్భంగా.

నేను లాంజిలోకి ఎగిరెళ్లేసరికి అక్కడ ప్రత్యక్షమైన దృశ్యంతో నాకు తల తిరిగిపోయింది.

నవాబ్ సులేమాన్ అలీ రాచఠీవితో

ఊదా రంగు గద్దెమీద ఆశీనుడయ్యాడు. చెరొక పక్క ఆయన దోస్తులు సమర్ ఖాన్, చౌధరి బర్ఖత్ అలీషాలు ఆసనాలు అలంకరించారు. జాజ్వల్యమానంగా వెలిగే చాండిలీర్లకింద కోడి పందెం తిలకిస్తున్నారు ముగ్గురూ. వాళ్లకి కొంచెం ఎడంగా రజియా, ఆమె తమ్ముడు బాబర్ కుర్చీల్లో కూర్చున్నారు. వాళ్ల దృష్టి కోడి పందెంమీద లేదు. ఇద్దరూ తండ్రి మొహంకేసి చూస్తున్నారు. ఆ కళ్లలో ఆదుర్దా, ఆందోళన.

నవాబుకిదేమీ పట్టలేదు. ఆయన తదేకంగా కోడి పందెం చూడ్డంలో నిమగ్నుడైపోయాడు. రజియా, బాబర్ల వేపు కనీసం చూపు తిప్పలేదు. కోళ్ల పందెం కోసం తివాచీలు చుట్టేయించాడు. బరిలో కోళ్లు రెండూ కుమ్ములాడుతున్నాయి. ఎరుపు ఈకల పుంజు కత్తిలాంటి ముక్కుతో ప్రత్యర్థినిపొడవటానికి మెరుపు వేగంతో దూకుతోందే నవాబు, నవాబు దోస్తులు ఒళ్లుమర్చిపోయి ఊగిపోతూ చప్పట్లు చరుస్తున్నారు. సులేమాన్ అలీ మొహం ఉత్సాహపు పొంగుతో తళతళ లాడ్తోంది. ఉదయం నుంచి అదే పనిగా నమిలిన తమలపాకుల్తో నోరంతా రక్తసిక్తమైపోయినట్టుగా ఉంది. ఆయన దృష్టంతా కోడి పందెంమీదే ఉంది. కోడి పందెమే ఇప్పుడాయన ప్రపంచం.

"అబ్బా... ఒక్కక్షణం మీతో మాట్లాడాలి. చాలా అర్జంటు" అంది రజియా ఆదుర్దాగా.

"డామిట్!" నవాబు కయ్యిమన్నాడు. అయినా కోళ్ల మీంచి కళ్లు తిప్పలేదు. కాస్సేపయ్యాక అయిష్టంగా తలతిప్పి "నిజంగా అంత అర్జంటా?" అనడిగాడు రజియాని.

"ఔనబ్బా"

"చెప్పు. కోడిపందెం చూడ్డంకన్నా మించిన జరూరు పనుంటుందా ?" అన్నాడు నవాబు నిర్లక్ష్యంగా. తన దోస్తులకేసి తిరిగి, "ఏమంటారు?" అన్నాడు.

"ఉండదు... ఉండదు" ఇద్దరూ వంత పాడారు.

రజియా ముఖం కోపంతో ఎరుపెక్కింది. నిలబడిందల్లా మళ్లీ కుర్చీలో కూలబడింది. కోడిపందెం నడుస్తూనే ఉంది. ఎరుపు ఈకల పుంజు భీకరంగా విజృంభించి ప్రత్యర్థి మీదికి కలబడి మొహంమీద, మెడమీద, పొట్టమీద కత్తిలాంటి ముక్కుతో పిచ్చెక్కినట్టు గాట్లు పెట్టింది. వేడి ఎరుపు నెత్తురు నేలమీద ధారకట్టిందాకా అది చెలిగి చెలిగి పొడుస్తూనే ఉంది. నవాబు పట్టరాని ఉద్రేకంతో శభాష్ అనరుస్తూ, చేతులు నొప్పిపుట్టేది కూడా తెలీకుండా తెరిపి లేకుండా చప్పట్లు కొడుతూనే ఉన్నాడు.

"ఓహ్... ఏం కండబలం! నా పుంజు దెబ్బకి అవతలిది ఇక లేవదు" వెకిలిగా అరిచాడు నవాబు.

ఆయనన్నట్టే మరుక్షణం అవతలి పుంజు కుప్పకూలిపోయింది. దాని తల నెత్తురు మడుగులో నానింది.

"అబ్బా!" రజియా మళ్లీ నోరు తెరిచింది. కుర్చీలోంచి లేచివెళ్లి నవాబు పక్కన నిలబడి, "మీతో ఒకమాట చెప్పాలి. అది మీకు సంబంధించిన మాట" అంది రజియా బిగ్గరగా. చెప్పి తీరాలనే పట్టుదల ఆమె గొంతులో ధ్వనించింది.

"ఇలాగా తండ్రితో మాట్లాడేది?" గర్జించాడు నవాబ్ సులేమాన్ అలీ.

"అబ్బా! అపతల కోపలంటుకు పోతున్నై. వాళ్ల నీ నెత్తురుతాగుతాం అంటున్నారు" రజియా పళ్లు నూరింది.

"అబ్బా..దీదీ చెప్పింది నిజ చేతులు కాలకుండా చూసుకోవాలని దీ హెచ్చ



రిస్తోంది. ఆలస్యమైతే ప్రమాదం" అన్నాడు బాబర్ దీదీ పక్కన లేచినిలబడి.

"ఈ పిల్లకాకులు నన్ను జడిపించటానికి చూస్తున్నాయ్" అన్నాడు నవాబు వ్యంగ్యంగా.

రజియా తన తండ్రి దోస్తులవంక వాడిగా చూసింది. పరిస్థితి అర్థమై, ఆ ఇద్దరూ ఆవతలికి జారుకున్నారు. ఇప్పుడు గదిలో నవాబ్ సులేమాన్ అలీ, ఆయన పిల్లలిద్దరూతప్ప మరో పురుగులేదు.

"సరే...ఇక చెప్పండి. ఆ నౌకరు వెధల సంగతేనా?" అనరిచాడు నవాబు.

"ఔనబ్బా! ఆ మానభంగం గురించి వాళ్లు గరెచ్చిపోయున్నారు."

"కవయివేలూ ఇస్తానని చెప్పా గదా!"

"డబ్బుతో వాళ్ళ నోళ్లు ముయ్య లేరు"

"అయితే, ఏం కావాలంటారు?" నవాబు గొంతు కొద్దిగా వొణికింది.

"మీరు మాపణలు చెప్పాలి. లేదా మీ నెత్తురు కళ్ళజూస్తారు"

"హహ్హా..." నవాబు పగలబడి నవ్వాడు. "ఈ ముష్టివెధవలు, నేలమీద

పాకే ఈ పురుగులు శహన్‌షా షాజహాన్ వంశీకుణ్ణి తమముందు మోకరిల్లమంటారా! ఎవడిముందూ తలవంచం మేం" అన్నాడు నవాబు దార్ష్టికంగా.

ఆయన మౌనంగా కొడుకు మొహం లోకి చూశాడు. తరువాత రజియావేపు తిరిగి, "మీకు క్షమాపణలు చెప్పలేదూ!" అనడిగాడు.

"అది సరిపోదట. మీరు చెప్పాలని పట్టుబట్టారు"

"మేమెందుకు చెప్పాలి? దాన్ని మేం రేప్ చెయ్యలేదే"

"అబ్బా...వాళ్ళ గౌరవమర్యాదల్ని మీరు రేప్‌చేశారు. నిన్న మీరు తోట మాలిని అవమానించలేదూ! కుక్కకి ఎముక విసిరేసినట్టుగా, డబ్బు పారెయ్య లేదూ! అబ్బా..మీరుపోలీసుల్ని లంచంతో మంచి చేసుకోవచ్చు. కాని, ఈ బీద జనాన్ని మాత్రం కాదు"

"వ్యవహారం ఇంతదూరం వచ్చిందా? నవాబు మండిపడిపోయాడు. ఆయ గొంతులో శ్లేష్మం అడ్డుపడింది. "మీ చూస్తూ ఉండండి. ఈ జనాన్ని బట్టలఊ డీయించి బాదిస్తా. నువ్వా వాళ్ల తరఫున వాదిస్తావా లేకిదానా? తక్షణం బఁటికి కదులు. నీతో పాటు నీ ముంతాపి తమ్ముణ్ణి తీసుకుపో"

"మీకు పూర్తిగా పిచ్చెక్కింది" అనరిచింది రజియా.

"ఒసేయ్. నీనోటిదురుసుకి చెంపలు పగలగొట్టాలే."

"ఆ పనే చెయ్యండి" అం రజియా సవాలు విసురుతున్నట్టుగా.

కూతురు గొంతులో ధ్వనించిందేదో ఆయన నోరుకట్టేసింది. రెండునిముషాలు నిరుత్తరుడైపోయాడు.

"న్నెందుకింత ఒళ్ళుమరిచి పేలు తున్నా! నాకు తెలుసు. నీ ప్రియుడి అంత్యక్రియలకి వెళ్ళలేకపోయావనేకసి"

"నికి దీనికి సంబంధంలేదు. ఎంత క్కొట్లాటలు జరుగుతున్నా నేను వెళ్ళదలుచు కుం వెళ్ళితీరేదాన్ని. అతని ఆత్మకు శ్రద్ధాంజలి సమర్పించాలంటే అదొక్కటే మ్మంకాదు. నేను వెళ్లలేదంటే, నిన్ను మృత్యువునుంచి కాపాడ్డానికే. నేను వెళ్ళి ఁటే ఇంకొకరు సమాధి అయివుండే ళ్లు" అంది రజియా.

"ఇదంతా నీకెలా తెలుసు" అనడి గాడు నవాబు. అతని మొహంలో ఆదుర్దా తొంగిచూసింది.

"ముంతాజ్‌ద్వారా"

"నువ్వా విన్నావురా?" అనడిగాడు నవాబు కొడుకువంక తిరిగి.

"ఔనబ్బా"

"అయితే ఇద్దరూ నామీద కత్తికట్టా రన్నమాట! అయితే ఆలస్యమెందుకు? ఇద్దరూ కలిసి నన్ను చంపేయండి. ఈ మంజిల్ యావత్తు ఇద్దరిమధ్యా పంచు కోవచ్చు" అని ఉరిమాడు సులేమాన్ అలీ.

"మీ కోడిపందాలూ, మీ తాగుబోతు దోస్తులూ, నాట్యప్రదర్శనలిచ్చే మీవృత్తి వేశ్యలూ... ఇది ఇల్లా, పాములపుట్టా? నరకం అంటే ఇదే....ఇదే ఇదే. నీ ఆస్తి పాస్తులు మాకేం అవసరం లేదు. మీ జీవితపాత్ర నిండిపోయి బయటికి పొర్లి పోతోందని ఎందుకు ఒప్పుకోరు?? మీకు కాలం..."

"తీరిపోయిందా?" సాగదీశాడు నవాబు.

చివాల్న ఆయన దృష్టి ఎదురుగా గోడ మీద ఇరాకీ యవనిక పైన, చెట్టుకింప




కూర్చుని పానసేవ చేస్తున్న ప్రేమికుల జంటమీద పడింది. కళ్లు తిప్పుకుని నేల మీద నెత్తురు మరకల కేసి చూశాడు. 'జీవనమరణాల వింత అన్యోన్యత' అనుకున్నాడు మనస్సులో.

బైట హింసోన్మాదంతో చెలరేగే జనం గుమిగూడినట్టుగా హఠాత్తుగా పెను కేకలు వినిపించాయి. ఏమిటా ఈ అల్లరని నేను బైటికెగిరిపోయాను. తిరుగుబాటు మొదలయిందా? నవాబు లాంజ్ కి కొద్దిగా దూరంగా లాన్ లో గుల్షన్ మంజిల్ నౌకర్లు చాకర్లు గుమిగూడారు. ఆడామగా అందరి మొహాలు పగతో, ప్రతీకారంతో కణకణలాడుతున్నై. మంది మధ్యలో కండలు తిరిగిన పస్తాదులిద్దరు నిల బడ్డారు. ఒకడు గునపం, రెండవవాడు గొడ్డలి పట్టుకుని భీకరంగా ఉన్నారు. ఆ వేసవి రేయి వెండి వెన్నెట్లో కిక్కిరిసిన ఆ కంచు మొహాలు, లాంజివేపు ఎక్కు పెట్టిన ఆ చూపుల తూపులు నాకు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అంతలోనే గాలిలో ఝుంకారం వినిపించింది. మరో ఆత్మా? ఈ సమయంలో ఇక్కడ తిరిగే ఆత్మ ఎవరిదో!

"సలాం సాబ్" ఎవరిదో మృదుల స్వరం.

"ఎవరు మీరు?"

"సాబ్... మీరు నన్నెరగరు. నేను మెహబూబా ఆత్మని. రజియామేమ్‌సాబ్ బాల్కనీలో క్రోటన్, గులాబీపూల కుండీలు కనిపెట్టుకుని ఉండేదాన్ని"

"తోటమాలి కూతురివా!" అనడిగాను ఆశ్చర్యంగా.

"ఔను సాబ్"

"నీపైన జరిగిన అత్యాచారం గురించి విన్నానమ్మా. అసలెలా జరిగింది? చెప్పటానికి ఇబ్బందిగా ఉంటే మానెయ్ మెహబూబా"

"ఆత్మకి ఇబ్బందేమిటిసాబ్! మొత్తం మీకు పూసగుచ్చినట్టు చెప్పేస్తా"

ఒక్క నిముషం మౌనంగా ఉండిపోయి తరవాత చెప్పటం ప్రారంభించింది.

"నిన్న మధ్యాహ్నం రజియా మేమ్‌సాబ్ పడగ్గది వెనక లాన్ లో కలుపు మొక్కలు ఏరిపారేస్తున్నా. గొడ్డలితో నరికినచెట్టు పడినట్టుగా నాముందు నీడ పడింది. ఎవరా అని తలతిప్పి చూశాను. బాబర్ నా ఎడం బుజం పక్కన నిలబడ్డాడు. నామీదికి వొంగుతున్నాడు. అతని మొహంలో విచిత్రమైన నవ్వు కనిపించింది. 'భోజనానికి వెళ్లే వేళకాలేదా' అనడిగాడు. 'ఇంకా అరగంట ఉందిసాబ్' అన్నాన్నేను. 'ఇక్కడున్నవాళ్లందర్లో నువ్వు వేరుగా కనిపిస్తావు నాకు' అన్నాడు. 'షుక్రియాసాబ్' అన్నాన్నేను. 'షుక్రియాలు కాదు, మెహబూబా! నీకు జీతం మస్తుగా పెరగాలి' అన్నాడు బాబర్. కృతజ్ఞతగానేను కళ్లెత్తిచూశాను. కలుపు తీస్తూనే కళ్లెత్తి అతనికేసి చూశాను. అతను చిరునవ్వు నవ్వుతూ, నావేపు జరిగి నా బుజం నిమిరాడు. నా జుట్టులోకి వేళ్లు పోనిచ్చాడు. 'నీ అందానికి మాత్రం ప్రత్యేక బోనస్ ఉండొద్దా?' అని నా చెవిలో గుసగుసలాడాడు. 'సాబ్! నాతో అటువంటి మాటలనవద్దు' అన్నాను కరుగ్గా. 'నేను కేవలం తోటమాలి కూతుర్ని. మీ ఉద్దేశమేమిటో నాకర్థమైంది. నాకు జీతమూ పెంచనక్కర్లేదు, బోనస్ అంతకన్నా అవసరంలేదు. మీరింకా మాటలు పెంచారంటే బాబాకి చెప్పేస్తాను' అని కసురుకున్నాను.

బాగా తాగొచ్చాడని కంపునిబట్టి అర్థమైంది. అతని కళ్లకి కప్పిన కామం పొరలు గమనించాను. శాపని పూర్తి కానివ్వండి అన్నాను నిలబడుతూ. 'ఈ వెధవపనా? కలుపు పీకేపనికన్నా వేరే కమ్మటి పనుందే పావురమా! ఇద్దరం కలిసి అనుభవిద్దాం పద'. ఛీ...పీణ్ణి వొదిలించుకుని వెళ్లాలనుకున్నాను. నేను కాలు కదపబోయేలోపే కుడిచెయ్యిచాపి నా నోరుమూశాడు. ఎడమచేత్తో నన్ను మ్రరిచెట్టు వెనక్కి బరబరా గుంజుకుపోయాడు. రుమాలుతో నా నోరు కట్టేశాడు. రెండుచేతుల్తో బలంగా నా బట్టలు లాగేశాడు. అరుద్దామని, విడిపించుకునిపారిపోదామని పోరుకాడాను. పశుబలంతో నన్ను కదలకుండా చేశాడు. పిచ్చికుక్కలాగా నా మొహంనిండా కొరికాడు. నన్ను నీళ్ల అడుక్కి లాగేస్తున్నాడా అనిపించింది. పైకి తేలటానికి నా కాళ్లు, చేతులు టపటప కొట్టుకున్నాయి. ఆ అర్ధచేతనావస్థలో కూడా కాపలాదారు బాబర్‌ని ఈడ్చుకుపోవడం కనిపించింది. 'ఈసారి నిన్నొదలం ఛోటే నవాబ్‌సాబ్! మీ అబ్బాని కూడా ఇరికిస్తాం' అంటున్నాడు కాపలాదారు. ఆ తరవాత నేను కోమాలోకి జారిపోయాను''

మెహబూబాతో మాటల్లోపడిపోయి సమస్తం మర్చిపోయానని అప్పుడు గుర్తొచ్చింది. అవతల ఏం జరుగుతుందోనని ఎగిరి వెళ్లాను. హఠాత్తుగా నవాబు గది తలుపుమీద పోటు పడింది. తలుపు విరిగిపడింది. గుంపు గదిలోపలికి గోలగా దొరబడ్డంతో చెవులు దిబ్బెళ్లుపడే శబ్దమైంది.

నవాబు లేచి నిలబడి బ్రమాన్పడిపోయాడు. బాబర్ గడగడలాడిపోతూ ముందు గుమ్మంలోంచి పారిపోవాలని ప్రయత్నంచేశాడు. రజియా ఒక్కతే నిర్భయంగా ఉంది.

"తాళం పెట్టాంరా పందికొక్కునాయాలా" అనరిచాడు గునపంపట్టుకున్న వస్తాదు.

బాబర్ వొణికిపోతూ రజియా వెనక దాక్కున్నాడు. రజియా చెయ్యి వెనక్కి జరిపి అనునయించింది. ఇది చూసి గుంపు ఆమెమీదికి చెలరేగుతారేమోనని నాకు భయం వేసింది.

నోట మాటరాక నిశ్చేష్టుడైపోయిన నవాబ్ సులేమాన్ ఆలీ గుంపు తన భరతం పట్టాలని వచ్చారని గ్రహించలేదు. అతని మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేదు. ఒళ్లంతా ఒణికిపోతోంది. గునపం, గొడ్డలి పట్టుకున్న వస్తాదులిద్దరికేసి బేలగా చూశాడు.

"నవాబ్‌సాబ్...వినోదం కోసం మేం తయారుచేసుకొచ్చిన తతంగం మొదలవబోతున్నది'' అన్నాడు గునపం పట్టుకున్న వస్తాదు. అతను గునపం నవాబు ఛాతీకి గురిపెట్టాడు. నవాబు భయభ్రాంతుడైపోయి వెనకడుగువేశాడు. "సాబ్! మీకోడిపందెంలాంటిది ప్రదర్శించమంటారా?" అన్నాడు. గునపం పట్టినవాడు వ్యంగ్యంగా.

కాంతివంతమైన చాండిలీర్ల వెలుతుర్లో మొహం పాలిపోయి, కళ్లు గుంటలు పడి వంగిపోయాడు, కృంగిపోయాడు. కళ్ల కింద నల్లటి చారల్తో, ముడతలుపడ్డ బుగ్గల్తో ఎండిపోయిన నదీగర్భంలా ఉంది ఆయన మొహం.

"మీకేం కావాలి?" అన్నాడు తడబడుతూ.

"నీ క్షమాపణలు కావాలి నవాబ్ సులేమాన్ అలీబహద్దర్!" అన్నాడు ఓ ముసలయ్య ముందుకొచ్చి. అతని బట్టలు మురికి ఓడుతున్నాయి.

"అప్పటిగ్గాని నా పగ చల్లారదు" అన్నాడు ఆవేశంగా.

నవాబు తలెత్తి తోటమాలివంక చూశాడు. మాలి కళ్ళలో ఎరుపు జీరలు మిటమిటలాడాయి. తోటమాలి దార్ష్టికం చూసి నవాబుకు ఒళ్ళు మండిపోయింది. కాని ఏంచేస్తాడు! నిస్సహాయుడుగా నిలబడిపోయాడు.

"చచ్చినా తలవంచను" అన్నాడు నవాబు గంభీరంగా.

నవాబు పెదాలుదాటి ఆ మాట బైటికి వచ్చిందోలేదో, గొడ్డలి పట్టుకున్నవాడు ముందుకు దూకి నవాబుని విసురుగా ఇవతలికీడ్చి గొడ్డలితో నెత్తిమీద బాదాడు. నవాబు కంఠంలోంచి ఆఖరి ఆర్తనాదం గాలిలో కలిసిపోయింది. పుర్రెలోంచి ఎర్రటి నెత్తురు ఎగజిమ్మింది. రజియా కళ్ళకి చేతులు అడ్డం పెట్టుకుంది. గునపం పట్టుకున్న రెండోవాడు కూడా ముందుకొచ్చి నవాబు ఛాతీమీద పాదం పెట్టి గుండెల్లో గునపం దింపాడు. బైటికి ఎగజిమ్మిన నెత్తురు చూసి బాబర్ స్పృహ తప్పి రజియా పక్కన కుప్ప కూలిపోయాడు.

"ఈ దుర్మార్గుడూ గుండె పగిలి చస్తాడు" లాంజి గుమ్మటపు కప్పు కింద తోటమాలి గొంతు ప్రతిధ్వనించింది.

ఇద్దరు హంతకులూ ముందు నడుస్తోంటే గుంపు వెనకాలే కదలిపోయింది. రజియా నెత్తురు మడుగులో తేలే తండ్రి శవంకేసి చూసింది. కొద్ది క్షణాల కిందట తండ్రి కోడిపందెం చూస్తూ కూర్చున్న వేదికవేపు వంగి, బట్టలాగి శవంమీద కప్పింది. మోకాళ్ళ మీద వంగి నిశ్శబ్ద ప్రార్థనలో లీనమైంది. బాబర్‌కి తెలివివచ్చి కాలు కూడదీసుకుని లేచి కూర్చున్నాడు. తండ్రి ఆత్మశాంతి కోసం ప్రార్థన చేస్తున్న అక్కకేసి చూశాడు.

నేనూ నిశ్చక్రమించే వేళయింది. వెళ్ళిపోబోతూ నవాబు మృతదేహం చుట్టూ పరుచుకున్న నెత్తుటిమడుగుకేసి చూశాను. సరీసృపం ఆకారంలో అట్టకట్టినట్టుగా కనిపించింది. అదొక వింత ఆకారం... కప్పమొహం, గద్దగోళ్లు, మొసలితోక. ఆశ్చర్యంతో చూస్తూండగానే ఆ ఆకారం మారిపోయింది. చనిపోకముందు నేను నా గది కప్పుపైన చూసిన మచ్చల పొట్ట మీద పాకే రాకాసి కోరం బల్లి ఆకారంలోని తడి మాసికని తలపించింది. ఆ వికృతమైన ఆకృతికేసి చూడలేక అక్కణ్ణుంచి జారుకున్నాను.



## 9

రజియాకి ఏ ప్రమాదమూ రాదని మెహబూబా ఆత్మ నాకు హామీ ఇచ్చినా నా మనస్సులో ఎందుకో ఇంకా ఆందోళనగానే ఉంది. ప్రతీకారదాహం తీరక హంతకులు బాబర్‌ని ఖతం చెయ్యటానికి మళ్ళీ తిరిగి వస్తేనో? రజియా తన తోడ బుట్టిన వాడికోసం అడ్డుపడితేనో?

అప్పుడు ఇబ్బందిలో పడదనే గ్యారంటీ ఏముంది? ఉండబట్టలేక నేను గుల్షన్ మంజిల్ కి తిరిగి దారితీశాను.

బాబర్ అక్క రజియా పక్కన మొహం వేలాడేసుకుని నిలబడున్నాడు. ఆ మొహంలో భయం తొంగిచూస్తూనే వుంది. రజియా తండ్రి శవం పక్కన మోకరిల్లి ఇంకా ప్రార్థనలో లీనమయ్యే వుంది.

"ఇంకా ఎంతసేపు ఈ ప్రార్థన? నాకేమో గుండెల్లో దడ పెరుగుతోంది. ఈవిడ త్వరగా లేవకపోతే నేను మాత్రం పారిపోయేది ఖాయం. వాళ్లు రజియాని ముట్టుకోరు. ఆ వెధవలు పగబట్టింది నామీద. నేను క్షమాపణలు చెప్పుకున్నాను కాబట్టి నన్ను క్షమించి విడిచిపెట్టారు. అయినా వాళ్ల మాటమీద నమ్మకం ఏమిటి? వాళ్లు మళ్ళీ తిరిగిరాకూడదని గ్యారంటీ ఏముంది?" బాబర్ ఆలోచనలన్నీ నాకు స్పష్టంగా వినబడుతూనే ఉన్నాయి.

"లే రజియా! త్వరగా వచ్చెయ్. ప్లీజ్..." అతను నిస్పృహతో చేతులు పిసుక్కున్నాడు.

రజియా ప్రార్థన ముగించి లేచినిలబడగానే బాబర్ ఎగిరిగంతేసి ఆమె రెండు చేతులూ పట్టుకుని "పద, పోదాం" అన్నాడు ఆత్రుతగా.

"ఎక్కడికి పోదామంటావ్?" అనడిగింది రజియా తాపీగా.

"ఎక్కడికయినాసరే"

"నీకింకా దడతగ్గలేదు. ఔనా?"

"ఊఁ"

"వాళ్ళిక నీ జోలికి రారు"

"ఏమో! రారని గ్యారంటీ ఏముంది?"





ఇద్దరూ కాస్సేపు మరేం మాట్లాడలేదు. బాబర్ నుదుటి ముడతలు పడింది. కుడిచేతి చూపుడువేలు పెదాలమీద, బొటనవేలు గొంతుమీద ఆనించి ఆలోచనలో పడిపోయాడు.

"ఈ రాత్రికి స్నేహితులింట్లో గడుపుదాం. నా కాలేజీమేట్ ఒకామె ఉంది. కాదనదు. లే..పోదాం" అన్నాడు బాబర్.

"ఇంత పొద్దుటేయి ఇప్పుడు ఇబ్బంది పెట్టడం ఏం బావుంటుంది ?" అంది రజియా.

"దార్లో వాళ్ళింటికి ఫోన్ చేస్తాను"

రజియా తమ్ముడి మొహంలోకి పరిశీలనగా చూసింది. మొహం తెల్లగా పాలిపోయి వుంది. పెదాలు వొణుకుతున్నాయి. 'ఇక్కడున్నంత వేగంగా బయటపడకపోతే వీడికి నిజంగానే గుండె ఆగిపోయేట్టుంది. అచ్చం అబ్బాలాగే కనిపించడం లేదూ? అదే విశాలమయిన నుదురు... అవే సిలికళ్లు.. కోరికతో కంపించే ఎర్రటి నోరు... ఏంటో, వీణ్ని చూస్తుంటే అప్పుడప్పుడూ నాకు చెడ్డరోత పుడుతుంది' అనుకుంది రజియా మనస్సులో.

"సరే. బయలుదేరు...." అంది రజియా నిర్వికారంగా.

"నీకు భయంగా లేదా?"

"లేదు" అంది పొడిగా.

హత్యలో ఆమెకి హస్తం ఉందన్నట్టుగా బాబర్ అక్కకేసి అపనమ్మకంగా చూశాడు. తన వెనకాలే రమ్మని సైగ చేస్తూ బాబర్ దొడ్డిగుమ్మంవేపు నడిచాడు. వెనక వసారా దగ్గర్లో అతని కారు రెడీగా వుంది. అక్కని ముందుసీట్లోకి నెట్టినంత పనిచేసి తను ఎగిరికూర్చుని ఇంజను స్టార్ట్ చేశాడు. ఏక్సిలేటర్ మీద పాదం నొక్కిపట్టగానే ఇంజను పెద్ద మోత పెట్టింది.

"ఛీ. వెధవమోత! ఈ తెల్ల ఏనుగుల్ని మోతరాకుండా తయారుచేసిచావరెందుకో" అని విసుక్కున్నాడు బాబర్.

"అప్పుడు దొంగలకి పండగే" అంది రజియా.

"నీ మనసులో ఏదో ఉంది" అన్నాడు బాబర్.

"ఏమీలేదు"

"నీ నిగ్రహం చూస్తుంటే నాకు ఆశ్చర్యం వేస్తుంది. నీ ప్రార్థన నటన కాదుగదా అనిపిస్తుంది"

రజియా జవాబు చెప్పలేదు. కారు మెయిన్‌గేటు దాటింది. అదృష్టవశాత్తు వాచ్‌మన్ లేడు. బాబర్ కారును యమ స్పీడుగా లాగించాడు. "ఆ వెధవలంతా ఎక్కడో సమావేశమై ఏదో గూడుపుఠాణి చేస్తుంటారు. అల్లా దయవల్ల వాళ్ళకి అందకుండా ఎలానో బైటపడిపోయాం" అన్నాడు బాబర్ తేలిగ్గా ఊపిరిపీలుస్తూ.

కారు నాంపల్లి రోడ్డుదాటి దూసుకు పోతోంది. ట్రాఫిక్ లైట్లదగ్గర మలుపు తిరుగుతూ స్కిడ్డయింది.

"ఎవరూ మనల్ని వెంటాడ్డంలేదు. ఎందుకంతకంగారు? ఒళ్ళు దగ్గరుంచుకుని తోలు" అంది రజియా వాడిగా.

బాబర్ దీటీకేసి గుర్రుగా పక్కచూపు చూశాడు. కారు స్లోచేసి టెలిఫోన్ బూత్ పక్కన ఆపాడు. నేనుమాత్రం రజియాని పనిపెట్టుకుని అవతలికి కదల్లేదు.

'ఈ రాత్రికి ఏదో ఒక హోటల్లో గది తీసుకుందామని చెప్పివుంటే బాగుం డేదేమో! అలాచేస్తే పదిమంది నోళ్ళ లోనూ పడే ప్రమాదమూ ఉంది. రామీ బతికుంటే క్లబ్‌లో రూము తీసుకోమని చెప్పివుండేదాన్ని. ప్చ్... అతను లేని లోటు ఈరోజు తెలుస్తోంది' అని ఆలో చిస్తూ మౌనంగా కూర్చుండిపోయింది రజియా.

అంతలోనే బాబర్ టెలిఫోన్ బూత్ లోంచి బైటికొచ్చాడు. మొహం కళకళ లాడింది. డోరు తెరిచి డ్రైవింగ్ సీట్లో కూర్చుంటూ—

"ఏర్పాటుచేసేశాను. జరిగింది యావత్తూ చెప్పకపోయినా ఎంతోకొంత చెప్పేశాను. ఆమె సంతోషంగా ఒప్పు కుంది. ఇక ఆతిథ్యానికి లోటులేదు" అన్నాడు బాబర్.

"'ఆమె' అంటున్నావ్! లేడీ ఫ్రెండా?" అనడిగింది రజియా ఆశ్చ ర్యంగా.

"ఔను. కాలేజీలో నాతోపాటు కలిసి చదివింది. ఆమె గురించి నీతో చెప్పా నేమో అనుకున్నాను. వాళ్ళిల్లు ఇక్కడికి దగ్గరే. బర్కత్‌పురాలో చక్కటి బంగ్లా" అన్నాడు బాబర్.

"నీ క్లాసుమేటు అమ్మాయన్నమాట!"

"ఏం... తప్పా?"

"తప్పేంలేదు"

"నువ్వు ఊహించే తరహా పిల్లకాదు. మేధావి టైప్. ఆర్టిస్టు కూడా. చాలా అంప మైంది. ఆమె ముందు నేను సూర్యుడి ముందు దివిటీ"

కారు బంగ్లాముందు ఆగింది. గేటుకు సైన్‌బోర్డు వేలాడుతోంది.

"నీ ఫ్రెండు నాన్నగారు డాక్టరా?" అనడిగింది రజియా.

"ఔను"

"అయితే వెంటనే నీ కంగారు తగ్గ టానికి టాబ్లెట్లు అడిగితీసుకో" అంది రజియా వ్యంగ్యంగా.

బాబర్ దీటీకేసి గుర్రుగా చూశాడు. 'దీటీకెందుకింత పెడసరం?' అనుకున్నాడు

మనసుల్లో.

ఎర్రటి ఇటుకల్తో కట్టిన పెద్ద బంగ్లా. ముఖ ద్వారానికి అటూ ఇటూ రెండు కొబ్బరిచెట్లు. ఒకపక్కన నల్ల ఫియట్ కారు. బాబర్ డోర్‌బెల్ నొక్కబోయే లోపే ఆ అమ్మాయి లోపల్నుంచి తలుపు తీయడానికి చకచకా వచ్చింది. లైటువేసి గడియ తీసింది. ఆమెని చూస్తూనే నేను విస్తుపోయాను. ఎదురుగా ప్రతిమ. ఈమెని చూడ్డం అప్పుడే రెండోసారి.

"లోపలికిరండి" అంది సాదరంగా. కారు ఎక్కడ పార్క్ చేయాలో చెప్పింది. బాబర్ అక్కను పరిచయంచేశాడు.

"జరిగిన ఘోరం విని చాలా బాధ పడ్డాను. మీ ఇద్దరికీ ఇదొక పిడుగుపాటు లాంటిది" అంది ప్రతిమ అక్కా తమ్ముళ్ళని లోపలికి ఆహ్వానిస్తూ.

"ఈ సమయంలో మీరు చేస్తున్న సహాయానికి చాలా థాంక్స్" అంది రజియా.

"మీకు ఆతిథ్యం ఇచ్చే అవకాశం కలగడమే పరమానందం" అంది ప్రతిమ.

"ఇటువంటి సమయంలో మమ్మల్ని ఆదుకునేవాళ్ళెవరా అని ఆలోచిస్తే నువ్వే జ్ఞాపకం వచ్చావ్ ప్రతిమా" అన్నాడు బాబర్ కృతజ్ఞతాపూర్వకంగా.

"మీరు రావటం చాలా సంతోషం" ప్రతిమ అతిథులిద్దర్నీ వెంటబెట్టుకుని

లోపలికి తీసుకువెళ్ళింది. డైనింగ్‌హాల్లో టేబులుముందు ఆమె అమ్మ, నాన్న అతిథులకోసం ఎదురుచూస్తూ కూర్చు న్నారు. మర్యాదలు పూర్తయ్యాక ఇద్దరూ చెరొక కుర్చీలో కూర్చున్నారు.

"తక్షణం పోలీసులకు తెలియపరిస్తే బాగుంటుందేమో! అది చట్టరీతి. మనింట్లో ఫోనుంది. కంట్రోల్‌రూంకి ఫోన్ చెయ్యండి" అన్నాడు ప్రతిమ తండ్రి డాక్టర్ రావు.

"కంగార్లో ఆ మాటే తట్టలేదు. రేపు ఉదయం చేస్తాం. ఇప్పుడు మా మనసులో మనసులేదు. చాలా షేక్ అయిపోయి వున్నాం" అంది రజియా.

"ఉదయం ఎప్పుడు తిన్నారోఏమో! ముందు వాళ్ళని భోజనం చెయ్యనీండి" అంది ప్రతిమ తల్లిగారు అభిమానంగా.

ప్లేట్‌లో కోడికాలు చూడగానే రజియాకి మొహం తిప్పేసింది. బాబా గదిలో ఆ మధ్యాహ్నం చూసిన క్రూర మైన కోడి పందెం గుర్తొచ్చింది. ఆ దారుణ దృశ్యం జ్ఞాపకం రాగానే ఆకలి నశించింది. ముక్క కొరికితే వాంతి అవు తుందేమోనని భయంవేసింది.

"ఇప్పుడేమీ వద్దండీ! ఏమీ తినబుద్ధి కావటంలేదు. ఒక కప్పు కాఫీ చాలు" అంది రజియా.

"అలాగే..అలాగే"అన్నాడు డాక్టర్.

బాబర్‌కి కడుపు మండిపోయింది. నా తరఫున వకాల్తా పుచ్చుకోడానికి ఈవి డెవరు అనుకున్నాడు కసిగా. ఆగ్రేవీ, కోడికాలూ ఎంచక్కా పట్టించేవాణ్ణి అని మనసులో అమిత విచారపడిపోయాడు. మర్యాద అడ్డొచ్చి మాటాడకుండా మనసు లోనే కసి, దుఃఖం దిగమింగుకున్నాడు.

కాఫీ పూర్తయ్యాక ప్రతిమ అతిథు లిద్దరికీ వేరువేరు బెడ్‌రూములు చూపిం చింది. మొదట బాబర్‌ని కార్నర్ బెడ్ రూంవేపు తీసుకుపోయింది. "ఇది మా అన్నయ్య బెడ్‌రూం. వాడిప్పుడు ఊళ్లో లేడు. వాడి నైట్‌డ్రెస్ నిరభ్యంతరంగా వాడుకోవచ్చు" అంది ప్రతిమ బాబర్‌తో.

తరవాత రజియాని వెంటపెట్టుకుని వేరే బెడ్‌రూంవేపు దారితీసింది.

బాబర్ స్వగతం నాకు వినిపిస్తూనే ఉంది. "మీ బ్రదర్ నైట్‌డ్రెస్ నాకెందుకు హనీ? నీ నైట్‌డ్రెస్ వేసుకుంటే నీ ఒంట్లో ఒంపుసొంపులన్నీ ఎంచక్కా అనుభవ మవుతాయి! ఈ రాత్రికి నువ్వు నాతో గడుపుతానంటే మనిద్దరికీ ఒంటిమీద బట్ట లెందుకు? నీ శరీరపు సువాసనల మత్తు చాలదూ! హాయ్, అల్లా! నా భయం, బాధా క్షణంలో విరగడ చేసేసింది!"

"ఇది మీ బెడ్‌రూము. నిశ్చింతగా విశ్రాంతి తీసుకోండి" అంది ప్రతిమ రజియాకి బెడ్‌రూం చూపిస్తూ.

"ఈ రాత్రి మీ బెడ్‌రూంనుంచి మిమ్మల్నే తరిమేస్తున్నాను ప్రతిమా!" అంది రజియా.

"అలాంటివేం పెట్టుకోకండి. మా నాన్నగారి స్టడీరూము బెడ్‌రూంకన్నా సుఖంగా ఉంటుంది. హంసతూలికా తల్పం లాంటి సోఫావుంది. పడుకోబోయేముందు చదువుకోడానికి పుస్తకాలున్నాయ్" అంది ప్రతిమ.

నేను రజియా చుట్టూనే తిరుగు తున్నాను.ప్రతిమ బెడ్‌రూము స్టూడియోలా ఉంది. గోడలకి అద్భుతమైన చిత్ర పటాలు వేలాడుతున్నాయి. ఓమూల కాన్వాసులు పోగుబడ్డాయి. మంచం వెనక కిటికీకిపైన అందమైన రాతిగంటలు. పడగ్గది అలంకారాలు చూసి పరవశమై




పోతూ మంచం తలకి ఎదురుగా ఉన్న గోడమీది చిత్రం చూస్తూనే స్తంభించి పోయాను. అదొక పెద్ద వాటర్ కలర్ చిత్రం. అందులో నేను, నా చుట్టూ చేరిన యువతీయువకులు. వాళ్ళ కళ్ళన్నీ నా మీదే ఉన్నాయి. నేను చెప్పే ప్రతి మాటా ఆలకిస్తున్నట్టుగా వాళ్ళంతా నా మొహం లోకి శ్రద్ధగా భక్తిగా చూస్తున్నారు. ఆ జట్టులో ప్రతిమా ఉంది. ఆమె అర విచ్చిన పెదాలు నన్ను ముద్దుపెట్టుకో వాలనే తమకం సూచిస్తున్నాయి.

రజియా కళ్ళు ఆ చిత్రం మీద పడు తూనే "అతను రామకృష్ణే!" అనరిచింది.

"ఔను"

ఒక్కక్షణం నిశ్శబ్దం. ఇద్దరూ పర స్పరం కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూసు కున్నారు.

"ఆయన గొప్ప ఆర్టిస్టు...ఔనా!" అనడిగింది ప్రతిమ.

"చాలా ఆకర్షణీయమైన వ్యక్తి కూడా" అంది రజియా.

"ఆయన మీకు బాగా తెలుసను కుంటాను?"

"ఒక రకంగా! ఆయన పబ్లిక్ ఫిగర్ కదా?"

"ఔననుకోండి. కాని మీరు వ్యక్తి గతంగా ఆయనని బాగా ఎరిగున్నట్టుగా అనిపిస్తుంది..." అంది ప్రతిమ అతిథి మొహంలోకి చూస్తూ.

పరిచయమేకాదు, అంతకన్నా ఎక్కువైన బంధమేదో ఉన్నట్టుగా ఉంది. లేకపోతే ఆకర్షణీయమైన వ్యక్తి అని ఎందుకంటుంది! ఆకర్షణ...! దాని లోతెంతో....! ప్రతిమ మనస్సులో ఆలో చనలు ముసురుకున్నాయి.

రజియా మనస్సూ అదే మాదిరి ఆలోచనా స్రవంతిలో కొట్టుకుపోతోంది.

రామీ మీద ఈమె అనురాగంచూస్తోంటే చిన్నపిల్ల ఆరాధనలాగా లేదు. అంత కంటే గాఢమైన వ్యవహారమే సాగి నట్టుగా ఉంది. కాకపోతే నావంక అలా చూస్తుందా? మా ఇద్దరి వ్యవహారంగురించి ఒక్కమాట చెప్పానంటే ఈ పిల్ల గుండె పగిలిపోయేటట్టుంది! ఛ...చస్తే మా గురించి బైట పెట్టను. బాబరూ, నేనూ ఇంత కష్టంలో వుండి ఇంటికొస్తే ఎంత ఆత్మీయంగా ఆదరించింది!

"ప్రతిమా! రామకృష్ణను నేను చాలా సార్లు కలుసుకున్నాను. సోషల్ పార్టీల్లో ఆర్ట్ ఎగ్జిబిషన్లలో... ఇంతకీ ఆయన మీకెలా తెలుసు?" అంది రజియా.

"చాలా స్వల్ప పరిచయం. యువ కళాకారుల. వార్షికోత్సవ సందర్భంలో ఒకేఒకసారి ఆయనని కలుసుకోవడం తటస్థించింది. అంతే! మళ్ళీ ఎన్నడూ కలుసుకోలేకపోయాను" బాధగా నిట్టూ ర్చింది ప్రతిమ.

"అంటే, ఆ వాటర్ కలర్ చిత్రంలో దృశ్యం అదేనా?"

"ఔను"

"అది నువ్వు వేసిందేనా?"

"ఔను"

"చాలా అందంగా ఉంది. ఆ వ్యక్తి తాలూకు సారమంతా పిండి బొమ్మ అద్ది నట్టుగా ఉంది"

"థాంక్యూ" అంది ప్రతిమ సిగ్గు పడిపోతూ.

"ఈ రాత్రి ఆయన్ని మనతో కూర్చోబెట్టుకుంటే అమోఘంగాఉండదూ? మీ ఆర్ట్‌ని ఆయన తెగ మెచ్చుకుని వుండేవాడు"

"అది జరగాలంటే కల నిజం కావాలి"

ఇద్దరి మధ్యా చాలాసేపు నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఇద్దరూ తమ మనో నేత్రాల్లో నా రూపు చిత్రించుకుంటు న్నారు.

"ఇంకా చెప్పు ప్రతిమా!" రజియా గుసగుసలాడినట్లుగా అడిగింది.

"ఏమిటి?"

"రామకృష్ణను ప్రేమించావా?"

"ఇప్పుడూ ప్రేమిస్తూనే ఉన్నా" అంది ప్రతిమ తపీమని.

నా మనస్సులో ఏముందో ఈమె బైటకి లాగేసింది. అయినా నేనెందుకు అబద్ధమాడాలి ? ఈమెకి ఆయనమీద ప్రేమ ఉంటే నేనెందుకు బాధపడాలి? ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి తన గుత్త సొత్తుగా ఎందుకు పెట్టుకోవాలి? ఆరోజు పార్టీలో ఆయన సమక్షంలో నేను ఇదేమాట అనుకోలేదూ? రాని దజను మంది చక్కని చుక్కలు చుట్టేసుకున్నా నాకేం అసూయ లేదు. అది అతని సమస్య. దాంతో నాకు సంబంధం లేదు. ప్రతిమ మనస్సంతా నా గురించిన ఆలోచనలు అల్లుకుపోయాయి.

రజియా జవాబు చెప్పకుండా ప్రతిమ మొహంలోకి చూస్తూ ఉండిపోయింది. ఆమె మనస్సులోనూ అనేక ఆలోచనలు. ప్రతిమ నిజం కక్కేసింది. అయినా ఈ చిన్నపిల్లపట్ల నాకు అసూయ లేదు. నేను కేవలం జాలిపడతాను. నేనూ నిజం చెప్పేస్తే, ఆమె కాళ్ళకింది రంగుల మ్యాజిక్ తివాచీ అమాంతం పైకి లేచి మనిషిని తలకిందులుగా నేలమీదికి విసిరే స్తుంది.

"ప్చ్... అతనిప్పుడు లేడు..." అంది రజియా విషాదంగా.

"అయితే మాత్రం? ఆయనెప్పుడూ ఇక్కడ ఉన్నట్టే నాకు అనిపిస్తుంది. అదొక శాశ్వతానుభూతి. ఆయన ఇప్పుడు ఈ నిమిషంలో ఇక్కడ ఈ గదిలో మనమధ్యే ఉన్నాడు" అంది ప్రతిమ ఆవేశంగా.

"ప్చ్..."

"పిచ్చిదాన్లా పలవరిస్తున్నానా?"

"లేదు. నేను అర్థంచేసుకోగల్ను" అంది రజియా. ఓ క్షణం పోయాక "నువ్వతని అంత్యక్రియలకి వెళ్లావా?" అనడిగింది రజియా. ఇప్పుడిద్దరి మధ్యా దూరం కరిగిపోయింది.

"ఔను. వాళ్లింటికి వెళ్లొచ్చాను. నిజానికి ఇంకొకరి అంత్యక్రియలకూ్కడా హాజరు కావాల్సివుంది. కాని వెళ్లలేక పోయాను. ఈ రోజేమిటో అంత్య క్రియల దినంలా ఉంది" అంది ప్రతిమ నీరసంగా.

"మతకలహాలు గురించా? పాపం ఒక వరుడు పెళ్లి ఊరేగింపులో వెడుతూ బలైపోయాట్ట! ఉదయం పత్రికలో చదివాను" అంది రజియా.

"లలిత్ ద్వ్యూబేయేనా?" అడిగింది ప్రతిమ.

"అతను నీకు తెలుసా?" రజియా ప్రశ్న.

"అదొక కథ. లలిత్ నన్ను ప్రేమించాడు. కవితావేశంతో నాకు చాలా ప్రేమలేఖలు రాశాడు. నా కళ్లల్లో నక్షత్రాలు చూశానన్నాడు. నా మొహంలో జాబిల్లి పూచిందన్నాడు. నావి చేతులు కాదు-రెక్కలు విప్పిన పావురాళ్లన్నాడు. నా అడుగుల చప్పుళ్లలో తీయని సంగీతం విన్నాడు. ఒకరోజు సాయంత్రం ఎవరో అమ్మాయితో కలిసి గిటార్ తగిలించు కుని సంగీత కచేరీలో కలిశాడు. ఆ




తరవాతనన్ను కలుసుకోవడం మానేశాడు. వాళ్ళిద్దరికీ ప్రధానం జరిగిందని తెలిసింది. చూడూ... అతనికెంత ఆత్రమో! లేడికి లేచిందే పరుగు. అతనికింకా కౌమారపు చాంచల్యం పోలేదు"

"నీకున్న పరిణతికి అతను తగడు" అంది రజియా.

"అదికాదు నా ఉద్దేశం... మీ నిద్ర చెరగొట్టేస్తున్నాను..." అంది ప్రతిమ ఏదో చెప్పబోయి మాటమార్చేసి.

"రాం అంత్యక్రియలకి మీరు వెళ్లారా?" అనడిగింది ప్రతిమ.

"లేదు"

ప్రతిమ ఆశ్చర్యపోయింది. ఈమెకి సన్నిహితంగా తెలిసిన మిత్రుడుపోతే, కనీసం అంత్యక్రియలకి హాజరుకాలేదు!

రజియా ఆలోచనలు వేరుగా ఉన్నాయి. ప్రతిమని అర్ధసత్యాలతో జోకొట్టానా లేదా? నిజానికి అర్ధసత్యాలు ఎంత ఉపశమనం కలుగజేస్తాయి! ఈ పిల్ల నాకు ఆతిథ్యమిచ్చినందుకేకాదు, నేను మనస్సులోపడే యమ బాధని మర్చిపోయేట్టుగా, చేసినందుకైనా నేనీమెకి ఈమాత్రం ఓదార్పు ప్రసాదించటం ధర్మం.

"చూడు ప్రతిమా! మనిషి చనిపోయాక ఇంకా ఎన్ని అనుకుని ఏం ప్రయోజనం? మళ్ళీ మనుషుల్లోపడక తప్పేదుంది?" అంది రజియా.

"మీ నాన్నగారుపోతేనూ ఇదే అనుకుంటున్నారా?" అంది ప్రతిమ కొంచెం వాడిగా.

"వేరుగా ఎందుకనుకోవాలి?" అని ఎదురుప్రశ్న వేసింది రజియా.

"నాకర్థమైంది. ఇంకా మీ నిద్ర చెడగొట్టగూడదు" అంటూ ప్రతిమ స్టడీరూం వేపు విసవిసా నడిచి వెళ్లింది.

ప్రతిమ నడిచివెళ్తోంటే ఆమె మనసులో సాగే ఆలోచన నాకు స్పష్టంగా విని పిస్తోంది. అగోచరమైనదాన్నో, అజ్ఞాత పదార్థంలో విశ్వాసమనేది లేకపోతే ఇక భగవంతుడెక్కడ? నవాబ్ సులేమాన్ అలీ కుటుంబం నిజంగా మరీ ఇంత అన్యాయంగా ఉందేమిటి? మనిషి ఎదురుగా లేకపోయినంతమాత్రాన మమతానుబంధం తెగ్గొట్టుకోవాలా?

నాకు చాలా ఆనందంకలిగింది. ఇప్పటికీ నేనంటే ప్రేమే. నేను లేనిలోటు ఇప్పటికీ హృదయశల్యమే. చాలు–నాకింత కంటే ఏం కావాలి? సంతృప్తితో ఇంటికి ఎగిరి వెళ్లిపోడానికి ఉద్యుక్తుణ్ణయ్యాను. బాబర్ తలుపు తెరుచుకుని ప్రతిమ పడుకున్న గదివేపు అడుగులు వేయటం చూసి ఆగిపోయాను. స్టడీరూం ముందు కాస్సేపు తటపటాయిస్తూ నిలబడిపోయి తలుపు గుబ్బతిప్పి బాబర్ పిల్లిలా లోపలికి ప్రవేశించాడు. వీడేదో పథకం వేశాడనుకుని నేనూ వెంటే వెళ్లాను. ప్రతిమ సోఫామీద పడుకుని, చేతుల్లో పుస్తకం పెట్టుకుని కునికిపాట్లుపడుతోంది. మందమైన కాండిల్ కాంతిలో అందమైన నిద్రాసుందరిలా ఉంది. మబ్బుల పాన్పు మీద శయనించిన గంధర్వకాంతలా ఉంది. బాబర్ ఆమె మొహంలోకి చూసి కాళ్లవేపు సోఫామీద నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

"ప్రతిమా!" మెల్లగా పిలిచాడు.

ఆమె సన్నగా శ్వాసతీస్తూ మగత నిద్రలో జోగుతోంది.

"ప్రతిమా!" – ఆమె ఎడమపాదాన్ని సవరిస్తూ మళ్లీ పిలిచాడు.

ఆమె ఉలిక్కిపడి లేచి కూర్చుంది.

''ఎవరది?''

"నేనే"

అతని గొంతు గుర్తుపట్టింది. కళ్లు నులుముకుని, సోఫా పక్కన లైటు స్విచ్ నొక్కి అతనికి దూరంగా జరిగింది.

"ఇక్కడేంచేస్తున్నావ్?" - తీక్షణంగా అడిగింది. ఆమె కళ్లలో నిప్పులు ... మొహంలో భీషణ కోపం...

బాబర్ తత్తరపడిపోయాడు.

"ఇలా లోపలికి వచ్చినందుకు క్షమించు. మీ ఇద్దరూ మాట్లాడుకోవటం వినిపించింది" బాబర్ నత్తులు కొట్టాడు.

"అంటే, పొంచి వింటున్నావా?'' - తీవ్ర స్వరంతో అడిగింది.

"అబ్బే ... అదికాదు. నిజంగా చెపుతున్నాను. వరండాలో నువ్వు నడిచిన చప్పుడు వినపడింది. నువ్వింకా మేలుకునే ఉన్నావనుకున్నాను"

"ఏంటి నువ్వు మాట్లాడేది? ముందు బైటికి నడువ్. లేదా..." అది కంఠం కాదు- వాడి బల్లెం.

"ఒక్క నిముషం టైమివ్వు. విషయం చెప్పనివ్వు" అన్నాడు బాబర్ జంకు జంకుగా.

"చప్పున చెప్పి బైటికి దయచెయ్యి"

''గదిలో ఒంటరితనం భరించలేక పోయాను. మనస్సంతా ఏంటోగా వుంది. అందుకని కాస్సేపు నీతో పొద్దుబుచ్చి వెళ్లిపోదామని అనుకున్నా"

"నీకేమైనా మతిపోయిందా? అంత తోచకపోతే మీ అక్కదగ్గర కూర్చుని నీ గోడు వెళ్లబుచ్చుకో. ఆవిడా ఒంటరితనం భరించలేకపోతూ వుండొచ్చు"

"దీదీ నిద్రపోయిందేమో అనుకున్నాను"

"మరి నేనూ నిద్రపోతూనే ఉన్నాగా. బాబర్! నేనొక్కమాట చెప్తాను. నువ్వీరోజు సాయంత్రం ఫోన్ చేసినప్పుడే, వీల్లేదని నేను వెంటనే చెప్పేసి వుండాల్సింది. నీ సంగతి నాకు తెలుసు. నువ్వెలాంటివాడివో కాలేజీలో అందరికీ తెలుసు. కాని నువ్వు, మీ దీదీ చాలా విషాద పరిస్థితిలో వున్నారని చెబితే వీలుకాదనటానికి నాకు నోరు రాలేదు. మా నాన్నగారికి నచ్చచెప్పి ఒప్పించాను. నువ్వు చెప్పేదేదో చెప్పేశావ్. నేను చెప్పవల్సింది నేనూ చెప్పాను. ఇక బైటికి దయచెయ్'' అంది ప్రతిమ గట్టిగా.

"ప్రతిమా...నేను చెప్పాలనుకున్నది ఇంకా చెప్పనేలేదు. ఎన్నో నెలలనుంచి చెప్పాలనుకుంటూనే చెప్పలేకపోయాను" అన్నాడు బాబర్.

"ఏంటది?"

''నేను...నేను నిన్ను ప్రేమిస్తున్నాను ప్రతిమా! ఎప్పుడూ నిన్నే ఆరాధించాను"

ప్రతిమ ఫక్కున నవ్వింది. "నేను పసి వెధవల్తో ప్రేమలోపడను. ఇప్పటి వరకూ జరిగిన మాటలుచాలు. నువ్వింకా కదలకుండా ఇక్కడే వున్నావో నిన్ను బైటికి గెంటించాల్సివస్తుంది. అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు...వెళ్లు"

బాబర్ లేచి నిలబడ్డాడు. ఆమె మొహం మీంచి కళ్లు తిప్పుకోలేకపోయాడు. లోపల కసి పేలిపోతోంది. ఇది దాని ఇల్లుగాబట్టి సరిపోయింది! లేకపోతే అది రక్కినా, పీకినా దానిపక్కమీదికి దూకి నా తడాఖా చూపించి వుండేవాణ్ని. ఆడవాళ్ళు అరవటం రక్కటంమించి చేయగలిగిందేముంది? అప్పుడు ఇంకా మజా ఎక్కుతుంది. నన్ను బైటికి గెంటటానికి అది పక్కమీంచి బట్టల్లేకుండా నగ్నంగా గెంతితే ఎంత మజాగా ఉంటుంది!

"వెళ్తున్నా. నిన్ను ప్రేమిస్తున్నా అని మళ్ళీ చెప్తున్నాను" అన్నాడు బాబర్ మెల్లగా.

"అదేదో నీ దీదీకి చెప్పు. ప్రేమ వ్యవహారం ఆవిడకి బాగా తెలుసుండొచ్చు''

అతను గుమ్మం దాకా నడచి ఒక్క క్షణం వెనక్కి తిరిగి చూసి, "అందం పంచిపెట్టటానికేగాని నిలవేసుకోటానికి కాదు. నువ్వెవర్ని ప్రేమిస్తావోగాని, అతనిమీద నేను అసూయపడతా. అతణ్ణి కలుసుకోవాలని ఉంది....'' అన్నాడు.

"అతణ్ని నువ్వీజన్మలో చూడలేక పోవచ్చు...బైటికి కదుల్తావా లేదా..."

బాబర్ గదిలోంచి బైటికి నడిచాడు. తన పిరికితనంమీద అతనికి అసహ్యం వేసింది. బంగారంలాంటి అవకాశం జార విడుచుకున్నానని వాపోయాడు. బల వంతంచేస్తే బ్రహ్మాండంగా అనుభవించేది! మెహబూబా మజా అనుభవించ లేదూ? దానికోసం అబ్బా చనిపోతే మాత్రం యేం? ఆ సుఖానికి సాటి ఏదుంది?

చేసిన నిర్వాకం చాలనుకుని గదికి పోయి పండుకుంటాడుగదా అనుకున్నాను. సరాసరి రజియా బెడ్రూం వేపు సాగాడు. గుమ్మం ముందు ఒక్క క్షణం తటపటాయించాడు. తరువాత తలుపు తోసుకుని లోపలకి ప్రవేశించాడు.

రజియా గాఢ నిద్రలో ఉంది. నేనూ తోడితోవుంటే ఎంత ఆనందంగా ఉండేది! ప్రతిమతో మాట్లాడుతున్నప్పుడు రజియా భావాలు చదివాను. ఇప్పుడూ కలగంటూ ఉంటే కలలోని తలపులూ చదవగల్ను. కాని కలలు రాని గాఢనిద్రలో ఉంది. పాపం! సాయంత్రందాకా ఎంత నరకం అనుభవించింది!

నేను నా ఆలోచనల్లో పడిపోయి గదిలో బాబర్ ఉనికినే మర్చిపోయాను. వాడు చీకట్లో తడువుల్లాడి రజియా బెడ్ పక్కన కుర్చీలో కూలబడ్డాడు.

"రజియా!" నిశ్శబ్దాన్ని చీలుస్తూ బాబర్ సన్నగా పిల్చాడు. మళ్ళీ ఈ గదిలోవీడు దేనికి తెగించాడాఅనిఆశ్చర్య పోయాను. రజియా కదిలినట్లుగా మంచం చప్పుడయింది. ఆమె చెయ్యి టేబుల్ లైట్ స్విచ్ నొక్కింది. హఠాత్తుగా గదంతా నిండిన కాంతిలో కుర్చీలో ఆకారాన్ని చూసి కొయ్యబారిపోయింది.

"బాబర్... నువ్వా?"

"సారీ, రజియా"

"నువ్వసలు లోపలికెలావచ్చావ్?"

"తలుపులు గడియ వేసిలేవు.లోపలికొచ్చి కూర్చోవాలనిపించింది.... నాకు నిద్రపట్టటంలేదు.. '' నీళ్ళు నమిలాడు.

ఎదురుగా గోడమీద వాటర్ కలర్ చిత్రం మీద దృష్టి పడ్డంతోటే ఆమె ఆలోచనలు నామీదికి మళ్లాయి. "రామీ! నువ్వీ గదిలో నాతో ఉన్నావనే ధైర్యంతో నిశ్చింతంగా ఇంత సేపూ నిద్రపోగలిగాను. ఎదురుగా నువ్వు గోడమీదా, ఇక్కడ నేను ఈ మంచం మీదా ఉన్నా మనిద్దరి మధ్యా ఎన్నిమైళ్లదూరం! అయినా ఈ గదిలో మనం కలిసే ఉన్నాం...కాదా?''

బాబర్ ఆమె మొహంలోకి చూస్తూ కూర్చున్నాడు.

''అబ్బా గుర్తొచ్చాడా?'' అనడిగింది తమ్ముణ్ని.

"ఔను... కొంతవరకు"

''ఇప్పుడదంతా గతం. ఇక ఎలాగో రోజులు వెళ్లబుచ్చాలి. వ్యవహారాలు

సర్దుకురావాలి. అబ్బా పోయాక ఇంటి పెద్దవి ఇకనుంచీ నువ్వే. ధైర్యం చిక్కబట్టు... అర్థమైందా?''

''ఆదంతా గతమేనంటావా?"

"తోటమాలి, అతని మనుషులు అంటే నీకింకా గాభరా తగ్గలే?''

''అదికాదు నేను గాభరాపడేది వేరే విషయం గురించి" అన్నాడు బాబర్ కిటికీపైన రాతి గంటలకేసి చూస్తూ. కళ్లు తిప్పి రజియా వేపు తిరిగి "ఇంతకు ముందు ఒక చిన్న తప్పిదంచేశాను" అన్నాడు.

"ఏం చేశావ్?''

''ప్రతిమ పవగ్గదిలోకి వెళ్ళాను. దేనికంటే.... ఏంలేదు...ఏంలేదు. ఊరక కాస్సేపు కబుర్లాడుతూ కూర్చోవచ్చని వెళ్లాను''





"అర్ధరాత్రివేళ ఓ పెళ్ళికాని పిల్ల గదిలోకి ఊసుపోట్టానికని దూరటం ఎంత అప్రతిష్ట! ఈరోజు జరిగిన ఘోర సంఘటనల్ని బట్టి ప్రతిమ నీ మానసికస్థితిని అర్థంచేసుకుని ఉండొచ్చు. నిజంగా ఎంత భయానకమైనరోజు! ఎవరైనా అలా ప్రవర్తించి వుండొచ్చు" అంది రజియా.

ఓ నిమిషం గడిచాకగాని ఆమె ఆలోచనాలోచనాలు విప్పారలేదు: ఆమెకి అసలు విషయం తట్టలేదు. ఈ వెధవ పైకి కనిపించినంత అమాయకుడు

కాదేమో! పచ్చి అబద్ధం ఆడ్డంలేదుగదా! వీడిలోని కీచకుడు మళ్ళీ విజృంభించాడా? ప్రతిమ మెహబూబా మాదిరిగా నిస్సహాయ యువతి కాదని వీడికి తెలీదా? స్వతంత్ర వ్యక్తిత్వం ఉన్న యువతి ప్రతిమ! వీడికింకా బాల్య చాపల్యం పోలేదు. తిన్న ఇంటివాసాలు లెక్కపెట్టటం ఎంత నీచం! పైగా అబ్బాని గొడ్డళ్ళతో ఘోరంగా నరికిన సంఘటన జరిగి రోజైనా గడవలేదు. వీడికి మతి చలించలేదుగదా!

"బాబర్..అసలేంచేశావో నిజంచెప్పు" అనరిచింది రజియా వాడిగా.

"అందే నువ్వు నన్ను నమ్మవన్న మాట!"

"నిన్నా? నీకూ, నీ కాలేజిమేట్ కూ మధ్య ఏం జరిగిందో నాకనవసరం. ఇప్పుడు నువ్వు నా గదిలోకి దూరాల్సిన అవసరం ఏమొచ్చింది? నాతోనూ ఊసు లాడ్డానికా? ఇదేవేళో తెలుసా? అర్ధరాత్రి. ఉదయం లేవగానే చక్కబెట్టుకోవాల్సిన పన్లు బోలెడున్నాయి. అబ్బాకి అంత్యక్రియలైనా వాళ్ళు చెయ్యనిస్తారోలేదో తెలీదు. పోయి పడుకో... పొద్దున్నే లేవాలి"

బాబర్ తలూపాడేగాని కుర్చీలోంచి లేవలేదు. దిమ్మరపోయినట్లు నటిస్తే ఇక్కడ వుండనిస్తుందేమో! ఈ ఆడవాళ్ళంతా ఒకే మాదిరి. రోషం, అపనమ్మకం, లొంగం అని పైకి బింకం. రజియా ఎల్లావుంది? సున్నగా గుండ్రంగా మెరిసే ఆ భుజాలు, అర్ధచంద్రుడిలాంటి ముఖం...రామకృష్ణ ఈమె అంగాంగాలూ తాగేసి వుండాలి. చిత్రకారుడి స్వప్నసుందరి! అక్క అందాన్ని తమ్ముడు ఆరాధిస్తే తప్పట!





మనిషి మనసులో ఈ విధి నిషేధాలన్నీ ఎవరు నాటారో!

"బాబర్ వెళ్ళిపొమ్మని చెప్పేనాలేదా? నావంక ఎందుకలా రెప్ప ఆర్పకుండా చూస్తున్నావ్? ఎవరైనా అలా చూస్తే నాకసహ్యం" అంది రజియా కోపంగా.

"చూస్తే తప్పేముంది?"

"ఛీ...అబ్బా అంశ నీలోనూ ఉంది"

"ఆ అబ్బాకిపుట్టినవాణ్ణికాదాయేం?"

"మొహంలో పోలికలవరకైతే గొడవ లేదు"

"కమాన్ దీదీ''

''తక్షణం బైటికి కదుల్తావా? కేకలు వెయ్యనా?''

''వెయ్యరాదూ!''

మరుక్షణం బాబర్ లేచి బైటికి వెళ్ళి పోయాడు.



## 10

గుల్షన్ మంజిల్ లోను, ప్రతిమ ఇంట్లోను జరిగింది చూసి కొయ్యబారిపోయాను. లైట్ల కాంతి మిరుమిట్లుగొలిపే గదిలో స్తంభపుకొనకి - దూలానికి, పైకప్పుకి-కిటికీ అద్దకొయ్యకి మధ్య రెక్కలు అల్లాడిస్తూ గబ్బిలంలా కొట్టుకున్నాను. వాలి కూర్చోటానికి ఆధారం దొరక్క కళవళపడిపోయాను. దిక్కుతోచక బైటికి ఎగిరొచ్చాను. కిందికిచూస్తే నేను పుట్టి పెరిగిన హైదరాబాదు సుందరనగరం నియోన్ దీపాలతో, ఆరి వెలిగే రంగుల

ట్రాఫిక్ లైట్లతో ఒంటినిండా వజ్రాభరణాలు దిగేసుకున్న ఒయ్యారిభామలా మెరిసిపడుతోంది. ఇంకా ఇంకా గాలిలోకి పైకెగసి చార్మినార్ వెనక సయ్యదలీ చబుత్రానుంచి ధగధగలాడే బేగంపేట విమానాశ్రయం రన్‌వేదాకా నగరం మొత్తాన్ని తిలకించాను.

హుస్సేన్‌సాగర్ ఇవతలి కొసనుంచి అవతలి కొసదాకా పరుచుకుని జంట నగరాల్ని కలిపే, విడదీసే టాంక్‌బండ్ పట్టు రిబ్బన్‌లా మిడిసిపడుతోంది. రాత్రి ఇంతపొద్దుబోయినా వంతెనకి రెండుపక్కలా కాలిబాటమీద ఆబా-మగా, పిన్నా-పెద్దా యావన్మందీ చల్లగాలి మేస్తూ షికార్లుచేస్తున్నారు. పేవ్‌మెంటుమీద రకరకాల దుకాణాల చుట్టూ జనం గుంపులుగా మూగి మాంసపు చీకులు,చన్నా బతూరా, ఇడ్లీ, దోశ తింటున్నారు. ఐసుముక్కలు వేసిన చెరుకు రసం ఛప్పరిస్తున్నారు.

రోడ్డు పక్కన బ్రహ్మాండమైన సైన్ బోర్డులమీద అతికించిన సినిమా పోస్టర్లు చూస్తూ ముందుకు కదిలాను. దాదాపు హుస్సేన్‌సాగర్ కొసదాకా వచ్చాను. ప్రవహించే నీరంటే నాకు మొదట్నుంచీ మహాపరవశం. నదులు, సెలయేళ్లు చూస్తే చాలు నా మనస్సు పొంగిపోతుంది. బురదగుంటలు, దొరువులు చూస్తే కుంగిపోతుంది. అవేమిటో నాకు పంజరంలో చిక్కుకున్న పక్షుల్లా భయం భయంగా, నీరసంగా కనిపిస్తాయి. వానలు పడటంతో హుస్సేన్‌సాగర్‌కి ప్రాణం లేచి వచ్చినట్టుగా ఉంది. అలలులేస్తూ సుడులు తిరుగుతూ ప్రచండమైన నదిని తలపిస్తోంది. నీళ్ల అడుగున కాగడాల ఊరేగింపు సాగుతున్నట్టుగా అంచున దీపస్తంభాల కాంతి ప్రతిఫలిస్తోంది. ఆ మనోజ్ఞ దృశ్యం చూస్తూ హృదయవేదన మర్చిపోయాను.

తలెత్తి చుట్టూ పరకాయించి చూశాను. కార్నర్ బెంచీమీద ఓ ముసలాయన మోకాళ్లమధ్య చేతికర్ర బిగించి ఒంటరిగా కూర్చున్నాడు. గాఢ విచారభారంలో ఉన్నట్టు మొహం చెబుతోంది. ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయి వున్నాడు. తననితాను ఎద్దేవ చేసుకుంటున్నట్టు నిగూఢమైన చిరునవ్వు ఆయనమొహంలో ఒక్కక్షణం తోచింది. చేతికర్ర దంతపు పిడిని తిప్పాడు. మానసిక ప్రకంపనని సూచిస్తూ చేతికర్ర కొనని నేలలో గుచ్చాడు. నేను సజీవుడిగానే ఉండి వుంటే, గూఢార్థగర్భితమైన ఆ చిరునవ్వును కాన్వాసుమీద బంధించటానికి ఆ వృద్ధుని శుష్కవదనం చిత్రించేవాణ్ణి. ప్చ్...

ఆయనకింకా దగ్గరికి చేరాను. మనస్సులో ఏదో గొణుక్కుంటున్నాడు. కొడుకుకి, కోడలికి భారమయ్యానని ఆవేదనపడుతున్నాడు. "పనికిరాని వస్తువులా, విరిగిపోయిన వృత్తలేఖినిలా ఇంట్లో మసలే ముసలివాణ్ణి ఎవరు పట్టించుకుంటారు! అతనొక అవాంఛనీయ వ్యక్తి. మూసినా, తెరిచినా మార్పులేని గుడ్డికన్ను! ఈ లోకం నుంచి ఎంత త్వరగా నిష్క్రమిస్తే అంత మంచిది! కొడుకు నవనీత్ తనంటేనే చిరాకు పడిపోతున్నాడు. కోడలు ప్రభా అంతే. అదంతా నా ఖర్మ! నా పాపానికి ప్రతిఫలం! వృద్ధాప్యంలో తండ్రిని శ్రద్ధగా చూసివుంటే ఎంత బాగుండేది! బొత్తిగా నిర్లక్ష్యం చేయకపోయినా, ఆయన వాడి వత్తలైపోతోంటే ముసలివగ్గేగదా అని

ఒగ్గేశాను.

"అదేం చిత్రమో - కొంతమందికి ఇతర్ల చావులో సంతోషం కనిపిస్తుంది. శవాలమీదుగా విజయానికి బాటలు పరుచుకుంటారు. ఎవరిదాకానో ఎందుకు? నా కొడుకే ఒక ఉదాహరణ. ఉదయం రామకృష్ణ చనిపోతే పీడి ఆనందానికి పట్టపగ్గాల్లేవు. అతను పనిచేసే కళా సంస్థకు కాబోయే ఛైర్మన్‌గా తను వెలిగించబోయే దర్పం భార్యముందు ఘనంగా ప్రదర్శించుకున్నాడు. తన హయాంలో ఆఫీసు ఛాంబర్‌ని ఎలా రీమోడల్ చేయించబోయేదీ, ఎలా అధికారం చలాయించబోయేదీ పెళ్లాం ముందు కూర్చుని పెద్దగా కోతలుకోశాడు. రేపు నేనుపోయాకా నా గదిని తిరగా బోర్లా వేసి మారుస్తాడో ఏమో! త్వరగా శలవు తీసుకోడమే ఉత్తమం.

"కోరుకోగానే చావు రావటానికి అది చెట్టు నుంచి కోసుకునే పండా? సినిమాకు రిజర్వు చేసుకునే సీటా? బలవంతంగా చావు తెచ్చుకోవాలన్నా చట్టం అడ్డొస్తుంది. ఆత్మహత్య చట్ట విరుద్ధం; శిక్షార్హమైన నేరం. అలాంటి పిచ్చిపని చెయ్యమాకని సంఘం హెచ్చరిస్తుంది. సుయ్యో, గొయ్యో, రైలుపట్టాలో లేకపోతే ఈ హుస్సేన్‌సాగరో చూసుకుంటేగాని విముక్తిలేదు. ఓపికున్నవాళ్ళు క్లాక్‌టవర్ ఎక్కి ప్రాణం తీసుకోవచ్చు. దండిగా డబ్బులుంటే నిద్రమాత్రలు కొనుక్కొని సుఖంగా చచ్చిపోవచ్చు"

ఆ ముసలాయన మనస్సుని తొలిచే ఆలోచనేమిటో అర్థమైపోయింది. సాగర్‌లో దూకి చావాలని నిర్ణయించుకున్నాడు. చావు నన్ను బలవంతంగా లాక్కుపోతే, ఈ ముసలాయనేమో చావు తనకి అందకుండా తప్పించుకుపోతోందని పరితపిస్తున్నాడు. ఆ మాటంటే యముడు ఒప్పుకోడని నాకు తెలుసు. తన ప్రేరణతోనే ముసలాయన ఆత్మహత్యకు తెగిస్తున్నాడని ప్రతివాదం చేస్తాడు.

ఆయని మెల్లగా లేచి నిలబడి, నీళ్ళలోకి తొంగిచూశాడు.

"అమాంతం దూకేశానంటే సాగర గర్భంలోవుంటాను. అడుగున దట్టంగా పెరిగిన కలుపు మధ్య చిక్కుకుపోతాను. ఆ తీగలే ఉరితాళ్లై నా మెడకి, ఒంటికి బిగుసుకుపోతాయి. అప్పుడు ఈ నీళ్ళే నా ఊపిరిని పీల్చేస్తాయి. ఈ బతుకు ఆఖరు..." అనుకున్నాడు ముసలాయన.

నేను కంగారుపడిపోయాను. ఎవరినయినా కేకేస్తే బావుణ్ను! కాని నా కేక ఎవరికి వినిపిస్తుంది? బతికున్న వాళ్లకి నా రూపం కనపడదు; నా గొంతు వినపడదు. ఆ ముసలాయన హఠాత్తుగా మనస్సు మార్చుకుని చకచకా రోడ్డెక్కి అటుగా పోయే సైకిల్ రిక్షాని కేకేశాడు.

"ఉహూఁ! ఈరోజు రాత్రి కాదు. వెధవది చలిగా కూడా వుంది. రేపు చూస్తా. మన చేతుల్లో పనేగా. ఎప్పుడైనా చెయ్యొచ్చు" అని మనస్సులో సమాధానపడ్డాడు ముసలాయన.

క్షణికావేశంలో చనిపోవాలని నిర్ణయం మాత్రం తీసుకున్నాడేగాని యదార్థంగా ప్రాణంమీద తీపిచస్తుందా? చావంటే ఎంత భయం! ఆత్మహత్య నైతికమైన పిరికితనమని సమాజం అంటుంది! కాదు... మృత్యువుని కావిలించుకోటానికి ఎటువంటి ఉక్కు మనస్సు కావాలి! ఎంతటి అసమాన ధైర్యం




వుండాలి! నా బదులు చితిమీదికెక్కాల్సింది నన్న మా నాన్న ఎక్కడ? చావంటే భయం పుట్టి పారిపోయే ఈ భీరు వెక్కడ? అనుకున్నాను.

గాల్లో చక్కర్లు మానేసి మళ్ళీ మా ఇంటికి తిరిగి వెళ్ళాను. స్మశానానికి మోసుకుపోబోయేముందు గదిలో నా శవాన్ని పడుకోబెట్టినచోట దీపపు ప్రమిద వెలుగుతోంది. మేరీ పడగ్గదిలోంచి వినిపించే సన్నటి గురక, సీలింగు పంఖా సవ్వడి తప్ప ఇల్లంతా నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉంది. మా అమ్మ, నాన్న గెస్ట్‌రూంలో నిద్రపోతుంటారని తెలుసు నాకు.

అంతలోనే హఠాత్తుగా ఏదో సవ్వడి వినిపించింది. దొంగేమో అనుకున్నాను. తీరాచూస్తే నా పెంపుడు కుక్క పీటర్ పిల్లిలా చప్పుడు కాకుండా ముందు గదిలోకి దూరింది.

"ఇక్కడయితే నాకు సురక్షితంగా ఉంటుంది"

నా పెంపుడు కుక్క మనస్సులో ఏమనుకుంటున్నదీ నాకు స్పష్టంగా వినిపిస్తోంది.

"నా యజమానురాలు, ఆ రాము గాడు కలిసి పొద్దస్తమానం నన్ను చంపుకు తిన్నారు. నా యజమాని పోయాడు గదా అని నన్ను గెంటెయ్యాలని శత ప్రయత్నం చేశారు. నా యజమానిని ద్వేషిస్తున్నారు. నా యజమాని పెంపుడు కుక్కని నన్నూ ద్వేషిస్తున్నారు. చల్లగా ఈ గదిలోకి దూరాలని రెండుసార్లు మొండిగా ప్రయత్నించాను. కాని ఆ మహాతల్లి తన్ని తరిమేసింది. అబ్బా... ఇంకా వీపు నొప్పెస్తోంది. పుండు పడిందో ఏమో! అవస్థపడి నాలికతో నాకి ఉపశమనం పొందుదామనుకుంటే అది నాలిక్కి అందితేనా. అమ్మో, ఇంకా నొప్పి లేస్తోంది.

"నాకటం అంటే చాలా బాధాకరమైన జ్ఞాపకాలు నెమరుకొస్తున్నై. మొన్న నా యజమాని బైటికి వెళ్ళిపోగానే వాడెవడో అమ్మగారి గదిలో దూరాడు. ఒక చెయ్యి ఆమెగారి నడుంమీద వేసి, మరో చెయ్యి బుజంమీదుగా మెడమీద వేసి, ముందు వరండాలోనే ఆమె మొహం, మెడ, కంఠం నాకేడు. తరవాత గదిలోకి లాక్కుపోయాడు. లోపల ఏం జరిగిందో నాకు తెలవదు. తలుపులు గడి పెట్టుకున్నారు. ఎదయిన గొడ్డులా ఆమె రొప్పటం, అరవటం మాత్రం విన పడ్డాయి. ఒకరికొకరు ఒళ్ళు రాచుకుని ముద్దులు పెట్టుకున్నాక ఈ మనుషులు గదుల్లో దూరి తలుపులు మూసుకుంటా రేమిటో!

"ఆ వెధవ నా దొరసాని మొహం నాకటం, గదిలోకి లాక్కుపోవటం చూస్తే నాకు ఒళ్ళుమండుతోంది. ఛీఛీ... ఎంత సిగ్గు విడిచినోళ్ళు! నిజంగా నా యజమానికి ఇవేమీ తెలవ్వు. నేను చూసిందంతా ఆయనకి చెప్పగలిగి వుంటేనో. కళ్ళతోనో, తోకాడిస్తూనో తప్ప తెలియజెయ్యలేనాయె!" నా కుక్క కున్న విశ్వాసం వీళ్ళకి లేదు. ఈ ఇంట్లో మనుషులకి దూరంగా వెళ్ళిపోతే తప్ప నాకు ఆత్మశాంతి లేదు.

* * *

ఇన్నాళ్ళూ నా అధ్యక్షతన నడిచిన కళాసంస్థ ప్రస్తుతం నవనీత్ దేశపాండే చైర్మన్‌గిరీలో ఎలా వెల్లివిరిసేదీ చూడాలనిపించి సంస్థ కార్యాలయంలో వాలాను.





# 11

కార్యనిర్వాహక కమిటీ సమావేశం జరుగుతోంది. దేశపాండే అధ్యక్షత వహించాడు. చైర్మన్ చాంబరుకి కొత్తగా రంగులు వేశారు. కిటికీ తెరలు మార్చారు. కొత్త తివాచీ పరచారు. బయట ఫౌంటెన్‌కి అభిముఖంగా ఉండే నా కుర్చీకి స్థానచలనం కలిగింది. ఎదురుగా టేబులుమీద వెండి ఫ్రేముకట్టిన దేశపాండే సకుటుంబ సమేతమైన ఫొటో ప్రముఖంగా కనపడుతోంది. బొద్దుగా ఉండే ఆయన భార్యామణి, ముగ్గురు కూతుళ్ళు... ముసలాయన కనపడదేం? కొంపతీసి చెల్లుచీటి పుచ్చుకోలేదుగదా!

"నేననుకున్నది స్పష్టంగా చెప్పాననుకుంటాను. ఇక అలా నడుచుకోవటం మీ వంతు. నిర్ణీత సమయానికంతా ఎవరి సీట్లలో వాళ్ళుండాలి. పనిలో జాప్యం సహించను. క్రమశిక్షణ కఠినంగా అమలు జరగాలి...." నవనీత్ దేశపాండే కంఠం దార్ఢ్యంగా మోగింది. చేప షేపు ఎనామిల్ యాష్‌ట్రేలో చుట్ట ఆర్పి పడేశాడు.

"తమరు ఈ సంస్థని కళాకేంద్రంగా నడుపుదామనుకుంటున్నారా? లేక పోలీసు డిపార్టుమెంటులాగానా?" అని అడ్డు తగిలాడు సుధాకర్.

సంస్థ సమావేశాల్లో లోగడకూడా ఈ ఇద్దరూ ఎలా ఘర్షణపడేవాళ్ళో నాకు గుర్తొచ్చింది. దేశపాండే డిప్యూటీ చైర్మన్‌గా ఉన్నప్పుడు సుధాకర్ పైన నిరాధారమైన ఆరోపణలు తేవడం నాకింకా గుర్తుంది.

సుధాకర్ ధిక్కార ధోరణికి కార్యవర్గ సభ్యుల మొహాలు నూయకాండిల్స్ బల్బుల్లా వెలిగాయి. 'బ్రేవో' అని అరవాలని నాకే అనిపించింది. కార్యదర్శిగా సుధాకర్ అడుగులో హంసపాదులా అలా అడ్డు తగిలేసరికి దేశపాండే అహం దెబ్బతింది.

"మీ పొగరుమోతుతనానికి క్షమాపణ చెప్పాల్సి ఉంటుంది సుధాకర్‌గారూ!" అనరిచాడు దేశపాండే. కోపంతో ఆయన ఒళ్ళు వణికిపోయింది.

"మీరు పొరపడ్డారు సారూ!" అన్నాడు సుధాకర్ వ్యంగ్యంగా. "ఈ సంస్థకు కేంద్ర ప్రభుత్వం నిధులిస్తోంది. ఎందుకో తమకు తెలుసా? లలితకళల అభివృద్ధికోసం. ఇక్కడ పనిచేసేవాళ్ళు కళాకారులండీ... క్రిమినల్సు కాదు. మీరు శాసించే పద్ధతిలో సాంస్కృతిక సంస్థ నడవదు. ఇప్పటికయినా తెలుసుకోండి. నేను క్షమాపణ చెప్పాలా? ఈ జన్మలో జరగదు. కొలీగ్స్‌తో సభ్యతగా మాట్లాడ్డం నేర్చుకోండి. నేననుకున్నది స్పష్టంగా చెప్పాననుకుంటాను"

తన మాటే తనకి ఎద్దేవ మిళాయించి అప్పజెప్పడంతో దేశ్‌పాండేకి ఒళ్ళు మండింది.

"మిష్టర్ సుధాకర్! గుర్రం కట్టేస్తారా లేకపోతే..."

"లేకపోతే?" అన్నాడు సుధాకర్ చర్రున. దేశపాండే తలమీదికి విసిరేయబోతున్నట్టు పేపర్‌వెయిట్ చేత్తో పట్టుకున్నాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. అందరూ ఊపిరి బిగబట్టి ఉద్రేకంతో ఊగిపోయే ప్రత్యర్థులిద్దరివేపు చూస్తూ ఉండి

పోయారు.

"ఇప్పుడు రామకృష్ణలేడని మీరు గుర్తుపెట్టుకోవాలి. ఇకనుంచీ అధికారం నాది..."

"లేదు, దేశపాండేజీ! రామకృష్ణగారు మరణించలేదు. ఆయనింకా మామధ్య ఉన్నట్టేఅనుభూతి కలుగుతుంది.ఎప్పుడూ మేమంతా ఆయనని స్మరిస్తూనే ఉంటాం. మా దృష్టిలో ఆయన సజీవుడు. ఆయనకి మరణంలేదు" అన్నాడు సుధాకర్. పేపర్ వెయిట్ చెయ్యిమారి యథాస్థానం చేరింది.

నాకు మృత్యు విమోచనం కలిగిందా అనిపించింది. ఆ మాటలు నన్నెంత కదిలించివేశాయో సుధాకర్‌కి చెప్పాలని పించింది. ఆ ఒక్కక్షణం మృత్యువుకి కోర విరిగిపోయింది. నాకెంతో హాయి, ఆత్మశాంతి కలిగింది.

"మిమ్మల్ని తక్షణం వేరేచోటికి పంపించమని రికమెండ్ చేయాల్సి వస్తుంది" అన్నాడు దేశపాండే. ఆయన గొంతులో మొదటున్న దూకుడు తగ్గిపోయింది. జేబులోంచి చుట్ట బైటికి తీశాడు. వెలిగించకుండానే వేళ్ళమధ్య పట్టుకున్నాడు.

"ఆ పనేదో వెంటనే కానివ్వండి. నా నియామకాన్ని నేషనల్ ఎకాడమీ ఆమోదించింది. అది ప్రభుత్వ సంస్థ. మీ ప్రైవేటు స్టూడియోకాదు. మీరు సంస్థ నియమావళి చదివినట్లులేరు" అంటూనే సుధాకర్ బెల్ మోగించాడు. "స్టాట్యూట్ బుక్ కాపీ తెప్పిస్తాను చూద్దురుగాని"

"ఎందుకింత హడావుడి చేస్తారు? నియమావళి నాకుమాత్రం తెలీదనుకున్నారా?" అన్నాడు దేశపాండే. ఆయన గొంతులో వెనకటి కరకుదనం కరిగిపోయింది. ఆయన మొహం గాలి తీసేసిన బెలూన్‌లా ముడుచుకుపోయింది.

"ఓహో... మీకు తెలుసన్నమాట!" సుధాకర్ ఎత్తి పొడిచాడు.

"మిష్టర్ సుధాకర్ మీరలా మాట్లాడ్డం బాగోలేదు. మీ పరిమితుల్ని అతిక్రమిస్తున్నారు"

"అదే మీకూ వర్తిస్తుంది"

"ఈ పరిస్థితిలో సమావేశాన్ని వాయిదా వేస్తున్నాను"

""శుభం" అన్నాడు సుధాకర్ కుర్చీలోంచిలేచి గబగబా బైటికి నడిచాడు. మిగతా సభ్యులంతా అతనితోపాటే బైటికి వెళ్ళిపోయారు. నేనూ వాళ్ళని అనుసరించాను. అందరూ ఆవరణలో గూమిగూడారు.

"ఆయనొక కాగితంపులి" అన్నాడు సుధాకర్.

"తండ్రిడిపోయి రోజయినా నిండలేదు. మరీ ఇంత అహంభావంగా మాట్లాడ్డమే నాకు బాధనిపించింది" అన్నాడు పౌర సంబంధాల అధికారి శ్రీనివాసస్వామి.

"ఆఁ... నిజంగా?" సుధాకర్ దిగ్భ్రాంతి చెందాడు.

"హుస్సేన్‌సాగర్‌లో దూకి చనిపోయారు" అన్నాడు స్వామి.

"ఆత్మహత్యా?" మరెవరో అడిగారు.

"తప్పకుండా"

"ఈరోజు పత్రికల్లో వచ్చిందా?"

"ఓ ఆంగ్ల దినపత్రికలో క్లుప్తంగా వచ్చింది. ప్రమాదవశాత్తు జరిగినట్టుగా చదివాను"

"మసిపూసి మారేడుకాయచేయడంలో పాండేసాబ్ అఖండుడు"

ముసలాయన చివరికి తెగించాడన్న మాట అనుకున్నాను. కన్నకొడుకే అంత నిరాదరణ చూపితే ప్రాణం మీది తీపి







చంపుకుని ఆత్మహత్యకు సిద్ధమైవుంటాడు. అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలొచ్చాక కాదంటారే! ఇదే కాబోలు.

ఆఫీసు మూసేసే వేళయింది. క్లర్కులు, ఆఫీసర్లు, అటెండెంట్లు అందరూ దుకాణాలు కట్టేసి ఇళ్ళకి బయలుదేరారు. మరి నవనీత దేశపాండే చాంబర్ వదిలి బైటికి రాడేం చెప్మా!

అవమానభారంతో తల పట్టుకుని కూర్చుండిపోయాడాయేం! ఆదుర్దా అణచి పెట్టుకోలేక లోపలికి వెళ్లాను. బల్లపైన తల వాల్చేసి బతుకే భారమయ్యెగదా అంటూ స్వగతంలో శోకాలు తీస్తుంటా డనుకున్న నవనీత్ దేశపాండే తలెత్తుకుని సేఠ్ కిశోరీలాల్‌తో గంభీరంగా మాట్లా డుతూ సవిలాసంగా కూర్చున్నాడు.

తస్సాదియ్య, వీడెప్పుడు ఊడిపడ్డాడు? మీటింగు జరుగుతున్నప్పుడు విజిటర్స్ రూంలో వెయిట్ చేస్తూ ఉండాలి.

"చనిపోయిన మనిషిని గురించి

వెడుగా మాట్లాడకూడదని అంత్యక్రియల సమయంలో తమతో మనవి చెయ్యలేదు గాని.." సేఠ్ కిశోరీలాల్ నరంలేని నాలుక వంకర్లు తిరుగుతోంది.

"నాకర్థమైంది"

"దేశపాండేసాబ్! నా చిత్తరువుని తమరు పూర్తిచేస్తారని కొండంత ఆశతో వచ్చాను"

"సారీ సేఠ్‌జీ! వేరే వ్యక్తి మొదలు పెట్టి అర్థాంతరంగా ఆపేసిన పనిలో వేలు పెట్టే అలవాటు నాకు లేదు. పైగా మా ఇద్దరి కళారీతులూ భిన్నధృవాలు. అతన్తో ప్రమేయమంటే నాకు గిట్టనే గిట్టదు" అన్నాడు దేశపాండే ఖరాకండీగా.

"ఆయన జోళ్ళలో మీరు కాళ్ళు దూర్చారు. ఆయన కుర్చీలోనే ఇప్పుడు మీరు కూర్చునున్నారు" అన్నాడు సేఠ్ కిశోరీలాల్ చిరునవ్వు నవ్వుతూ.

"అది నా దురదృష్టం. ఏం చెప్పమంటారు! పూలపాన్పుకదా అని లొట్టలేస్తే ముళ్ళపాన్పుగా మారింది"

"కిరీటం ధరించిన తలకి శిరోవేదన తప్పదంటారు"

"అంత ఇదేం కాదుగాని ఈ రామకృష్ణని ఆనవాల్లేకుండా చెరిపెయ్యాలి"

ఒక్క క్షణం ఇద్దరిమధ్యా నిశ్శబ్దం.

"మీ సంస్థ వ్యవహారాల గురించి నాకు బొత్తిగా తెలవదంటే నమ్మండి. కాని మిమ్మల్ని మాత్రం ఒక మహా గొప్ప చిత్రకారులుగా గౌరవిస్తాను" అన్నాడు సేఠ్‌కిశోరీలాల్.

కాస్త పొగిడితే పోయేదేముంది అని సేఠ్‌జీ మనస్సులో అనుకోడం నాకు వినపడింది.

"థాంక్యూ" అన్నాడు దేశపాండే. పొగడ్తలకి పొంగిపోని నరుడు ఈ పృథ్విలో వుంటాడా! ఈ మాత్రం లోకజ్ఞానం సేఠ్‌జీకి పుష్కలంగా ఉంది.

"మొసలినోట చిక్కిన ఈ ఏనుగుని గట్టెక్కించగల శ్రీమహావిష్ణువు మీరే. సొమ్ముకు సొమ్మూ పోయింది. సమయమూ వృధా అయిపోయింది. ఈ రామకృష్ణ ఓవారం ఆగిచచ్చిపోతే నాకీ శని తప్పేదికదా" అన్నాడు సేఠ్‌జీ విచారం అభినయిస్తూ.

"ఓరి, నీ తెలివి తెల్లారా! వాడు ఇంకా రెండు నెలలముందే చావలేదేమా అని నేను ఏడుస్తుంటేను" అనుకున్నాడు దేశపాండే మనస్సులో.

సేఠ్‌జీ ఆలోచనలు వేరే తీరుగా నడుస్తున్నాయి— 'ఊరకుక్కల్లా కొట్లాడుకొంటున్నారు! కళాకారులంటే మామూలు మనుషులకంటే వేరుగా ఉంటారనుకున్నాను. తను ఆ రామకృష్ణ కాలి గోటికి దీటుకానని వీడికి జ్ఞానమైనా లేదేం?'

"దేశపాండేజీ! నాచిత్రపటం సాంతం మీరే తాజాగా గీసిపెట్టండి. మీరు చెప్పిన కళారీతులు, గోతులు నాబోటి అజ్ఞానికి అంతుబట్టి చావవు. ఏదో ఒక రీతిలో నా బొమ్మ పూర్తిచేసి ఇస్తే అదే పదివేలు" అన్నాడు సేఠ్‌జీ.

"అంతకంటేనా!'' అన్నాడు దేశపాండే తక్కున.

"ఎంతివ్వమంటారు?''

'అతగాడికి ఒప్పుకున్న మొత్తం కన్నా నాకొక్క పైసా అదనంగా వద్దు''

సేఠ్‌కిశోరీలాల్ మనస్సులో వెయ్యి తిట్లు తిట్టాడు.

''పదివేలు— అందులో సగం ఎడ్వాన్సుగా ఇచ్చుకుంటాను''

''చాలు''



## 12

మళ్ళీ నా ఇంట్లో ప్రవేశించాను. ముందు వసారాలో పెట్టే బేడా సర్దుకుని కూర్చున్న అమ్మని, నాన్నని చూడగానే ఆశ్చర్యం వేసింది. సూట్ కేస్ పక్కన నా చితాభస్మం ఉంచిన పాత్ర ఉంది. దానికి గులాబిదండ చుట్టారు.

"బాబు చితాభస్మం మీద పాలు చిలకరించేప్పుడు నాకు కాళ్లూ, చేతులూ ఆడక రెండుసార్లు పడిపోయాను" అంటున్నాడు నాన్న అమ్మతో.

అమ్మ సమాధానంగా కళ్లలో నీళ్లు కుక్కుకుని బాధగా చూసింది. వెంటనే కళ్లు తిప్పుకుని నా చితాభస్మ పాత్రకేసి చూస్తూ నిట్టూర్చింది.

"నే ఒకణ్ణే వెళ్లి గంగలో కలిపి వస్తాను. నువ్విక్కడే ఉండిపోరాదూ?" అన్నాడు నాన్న.

"కాదు" అంది అమ్మ గద్గద స్వరంతో.

"నువ్వు తట్టుకోగలవా?"

"ఆ...నన్ను కూడా రానీండి" అంది అమ్మ దీనంగా.

నాన్న తెల్లారగట్ల లేచి స్మశానానికి వెళ్లి నా చితాభస్మం సేకరించి తెచ్చి వుంటాడు. మా పెదనాన్న అస్థి నిమజ్జనానికి నాన్నతో కలిసి నేను బెనారస్ వెళ్లిరావటం నాకింకా గుర్తుంది. ఈసారి వీరితో వెళ్లి ఈ దిక్కుమాలిన నగరానికి తిరిగి రాకుండా అక్కడే వుండిపోవాలని నిశ్చయించుకున్నాను. ఈ మురికి వీధులు గల్లీల్లో, ఈ ఈగలు, దోమల్తో, అల్లర్లతో, వెధవ మోతతో రోతెత్తిపోయే ఈ దరిద్ర నగర వాతావరణంలోకి మళ్లీ రాకూడదనుకున్నాను.

రైలు బనారస్ ప్లాట్‌ఫారం మీద ఆగిందో లేదో నాన్నని పండాలు చుట్టేశారు. అప్పటికింకా సూర్యోదయమైనా కాలేదు. "నన్ను చెయ్యనీండి, నన్ను చెయ్యనీండి" అంటూ ప్రతి పండా నాన్న చేతుల్లోంచి చితాభస్మ పాత్ర ఎగబడి గుంజుకోవాలని ప్రయత్నించేవాడే. వాళ్లు పురోహితులు కాదు, పచ్చి మాంసం ముద్ద మీదికి మూగే ఈగలు. నాన్న వాళ్లందర్నీ తోసేసి ముందుకు నడిచాడు. కొద్ది దూరంలో ఆత్మగౌరవం, నిగ్రహం రూపుకట్టినట్లుగా నిలబడున్న ఓ పండితునివేపు నడిచాడు నాన్న.

"నా బాబు అస్థి నిమజ్జనానికి పౌరోహిత్యం చేస్తారా?" అనడిగాడు నాన్న.

"మీరు నన్ను అడగటమే ప్రత్యేక గౌరవంగా భావిస్తున్నాను"

"ఎంతివ్వమంటారు?"

"మీకు తోచినంత"

"ఇక్కడి మామూలుకిది భిన్నంగా ఉంది"

"నా పద్ధతి అంతే"

"అయితే పదిగంటలకి అహల్యాబాయి ఘాట్‌లో కలుద్దాం. రెండు మూడు గంటలు మేం హోటల్లో విశ్రాంతి తీసుకుని బైల్దేరి వస్తాం" అన్నాడు నాన్న.

"అలాగే. పదింటికంతా నేనక్క-

డుంటాను" అన్నాడు పురోహితుడు.

నాన్న సూట్‌కేసు పట్టుకున్నాడు. అమ్మ చితాభస్మ పాత్ర చేత్తో పట్టుకుంది. ఇద్దరూ ప్లాట్‌ఫారం దాటి బైటికొచ్చారు. వెనక మా పెదనాన్నగారి అస్థి నిమజ్జనం అహల్యాబాయి ఘాట్‌లోనే జరిగింది గనక నాకా చోటు తెలుసు.

మా అమ్మా నాన్నల మానసిక వ్యథ వింటూ కూర్చునే బదులు కాస్సేపు నగర సంచారం చేసి వద్దామనిపించింది.

చుట్టూ ఎటుచూసినా విశాలంగా పరుచుకుంది వారణాసి. ఎత్తయిన ఆలయ శిఖరాలు, బంగారు విమానాలు... పేవ్‌మెంట్లమీద పండాల, యాత్రికుల సందడి... ఎటు కదిలినా ఎన్నో ఆత్మల మూగ ఝుంకారాలు. బహుశా తమ అస్థి నిమజ్జనం చూసిపోదానికి పోగయి వుంటాయి నాలానే.

పవిత్ర గంగానది ప్రతిరోజూ గుట్టల కొద్దీ చితాభస్మం తనలో కలుపుకుంటూ, ఆ అజ్ఞాత భారం మోస్తూ నింపాదిగా ప్రవహిస్తోంది. ఆ బూడిదరంగు నీళ్లపైన చిన్నా, పెద్ద పడవల్లో అస్థి నిమజ్జనార్థం వచ్చినవాళ్లు పురోహితుల మంత్ర ఘోష మధ్య నదిలో దూరంగా అస్థికలు కలుపుతున్నారు. దొంగ సరుకుని అధోజగత్తుకి రవాణా చేసే వాణిజ్య జలమార్గంలా కనిపించింది గంగ.

పవిత్ర ఘట్టాల దగ్గర ఒడ్డు పొడుగునా వందలాది యాత్రికులు మోకాలి లోతు నీళ్లలో నిలబడి, గంగాతోయం దోసిళ్లలో పట్టి మంత్రాలు చదువుతున్నారు. ఒడ్డుకి కొద్ది గజాల ఎగువన సాధువులు కొయ్య పీటల మీద కూర్చుని చుట్టూ నేలమీద చతికిలపడ్డ భక్తగణాలకు బోధ చేస్తున్నారు. నుదుటిమీద విబూది రేఖలు దిద్దారు. వాళ్లు కట్టుకున్న కాషాయ కటి వస్త్రాలు వేసవి ఎండలో మెరుస్తున్నాయి.

దిట్టంగా బలిసిన ఓ సాధువు చెంత చేరి ఆయన తంతు గమనించాలని బుద్ధి పుట్టింది. పీటమీద కూర్చుని యువ దంపతులతో ముచ్చటిస్తున్నాడు. పక్కన మాసిన ధోవతి కట్టుకున్న ఓ మనిషి బాదం పప్పు, ఎండు ద్రాక్ష, దాల్చిన చెక్క, తేనె, పాలు కలిపి ఏదో నూరుతున్నాడు. బహుశా సాధుమహరాజ్ సేవించే దేవతా పానీయమో ఏమో!

"ఔషధ సేవ, శస్త్ర చికిత్సలద్వారా సంతాన భాగ్యం కలగదు" సాధువు శలవిచ్చాడు.

"చిత్తం మహరాజ్" చేతులు జోడించాడు ఆ యువకుడు.

"సంతాన హీనత పూర్వకర్మ పరిపాకం. అంతే"

"చిత్తం మహరాజ్! భగవంతుడు మాకు అన్నీ ప్రసాదించాడు. వ్యాపారం కూడా చక్కగా నడుస్తోంది"

"ఏం వ్యాపారం?" అనడిగాడు సాధువు.

"నేను సుగంధద్రవ్యాలు, తేయాకు మధ్య ప్రాచ్యానికి ఎగుమతి చేస్తుంటాను. ఎంత సంపాదిస్తేనేం అనుభవించే పుత్రుడు లేకపోయాక?" అని నిట్టూర్చాడు యువకుడు.

"పండిట్జీ! పూర్వజన్మ పాపాన్ని పరిహరించటం సాధ్యంకాదంటారా?" అనడిగింది యువతి.

సాధువు కనుబొమ ముడిచి ధ్యాన నిమగ్నుడైపోయినట్టు నటించాడు. అతని చూపులు ఆ యువతి మొహంమీద నిలిచిపోయినట్టు నేను గమనించాను. అతను మనస్సులో ఏమనుకునేదీ నాకు వినపడు




తూనేవుంది. 'లేత కొబ్బరిలా ఎంత తాజాగాఉంది! చెరుకురసంలో ముంచిన బాదంపప్పులాంటి ఆ పెదాలు, రవిక ముడికింద బొడ్డుదగ్గర ఆ సన్నటి పొట్ట, పాలు తేనె నింపిన కప్పుల్లాంటి ఆ నిండు రొమ్ములు ... ఓహ్...! ఆ ఊట నా నోటికి అందాలేగాని..."

ధ్యానం ముగించి సాధుమహరాజ్ పెదాలమీద నాలుక తిప్పుతూ "సాధ్యమే! అటువంటి అద్భుతాలు సాధించే వ్రత పూజా మహిమలు మన ధర్మశాస్త్రాల్లో చెప్పారు. నీ చేత ఆ వ్రతం చేయిస్తా. నీకు కొడుకు కలుగుతాడు" అన్నాడు.

"మీ మేలు మర్చిపోలేంస్వామీ! జీవితమంతా మీకు రుణపడివుంటాం" అంది ఆదపడుచు ఇల్లాలు.

సాధుమహరాజ్ మందహాసం చేశాడు. 'ఓ ప్రజాపతీ... ఓ సృష్టికర్తా' అంటూ మంత్రోచ్చాటన చేశాడు.

"రేపు సూర్యాస్తమయానికి రెండు గంటల తరవాత ఆమె ఒంటరిగా నా కుటీరానికి రావాలి. వ్రతం ఆమె ఒక్కతే ఆచరించాలి. నేను పూజాదికాలు నిర్వహించి మంత్రపఠనం చేస్తాను. ఆమె వ్రతం రెండు గంటల్లో ముగుస్తుంది" అన్నాడు సాధుమహరాజ్ ఆమె భర్తతో.

"అలాగే మహరాజ్! వ్రతానికి తమకు ఎంత ఇచ్చుకోమంటారు?" అనడిగాడు ఆ అమాయకుడు భక్తిపూర్వకంగా.

సాధుమహరాజ్ చిరాకు అభినయిస్తూ "డబ్బు మాట ఎత్తవద్దు. నేను ఇతర సాధువుల వంటివాణ్ణి కాను. తరవాత మీకు తోచినంత ఇవ్వవచ్చు. కాని ఆమెకు గర్భధారణ అయ్యాకనే" అన్నాడు ఆ చివరిమాటని ఒత్తిపలుకుతూ.

సాధుమహరాజ్ మాటలకి వాళ్ళు సంబరపడిపోయి మొహమొహాలు చూసుకున్నారు. నాకు వ్యవధివుంటే ఈ సాధు మహరాజ్ ఆమెచేత వ్రతం చేయించే తంతు యావత్తు తిలకించి వుండేవాణ్నే. సరిగ్గా ఆదేక్షణంలో అహల్యా బాయిఘాట్ పక్కన దేవాలయంలో పది గంటలు మోగాయి. మా నాన్న పురోహితుడితో మాట్లాడుతూ నిలబడ్డం చూశాను. నా అస్థి నిమజ్జనానికి ఏర్పాట్లు పూర్తయ్యాయి. పక్కన అమ్మ కనిపించలేదు. ఇందులో కూడా స్త్రీలు పాల్గొనటానికి శాస్త్రాలు సమ్మతించవేమో!

పురోహితుడు, నాన్నలతోపాటు వారు వెళ్లేదిక్కుగా నేనూ అనుసరించిపోయాను. నాన్న ప్రత్యేకంగా ఇద్దరు మనుషులు కూర్చునే బోటు ఏర్పాటు చేశాడు. పది గంటలకే సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. నదిలో ఆయువు పట్టుల్ని పొడిచే కరవాలాల్లా సూర్యకిరణాలు నీళ్ళమీద తళతళలాడుతున్నాయ్. జిగేలుమనే ఆ ఎండలో ఇంకా నదీగర్భంలోకి మునగని చితాభస్మపాత్రలు నీటిపైన తేలుతూ మెరుస్తున్నాయి. బోటు నదిమధ్యకి వెళ్లాక పురోహితుడు మంత్రపఠనం ప్రారంభించాడు. ఆయనకంఠం ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉంది. ఆయన నయనాల్లో ధ్యాన కాంతి ప్రవేశించింది.

చీకటి సూర్యుణ్ని, సూర్యుడు చీకటిని

ఎరగనట్లుగా

చావు పుట్టుకని, పుట్టుక చావుని

గుర్తింపలేవు.

అందువలననే సుఖదుఃఖాలు

సమాన భాగాలు కాలేకపోయాయి.

చావులో బతుకు

బతుకులో చావు
చూడగలవాడే సర్వజ్ఞుడు.
మూఢమతులు మాత్రమే జనన మరణాలలో
సుఖదుఃఖాలకు లోనవుతారు.
పుట్టుట గిట్టుటకు
గిట్టుట పుట్టుటకు
కారణభూతాలవుతాయి.
ఇది బండి చక్రంలాగా
పరిభ్రమించేగతి.

ఆయన శ్లోకపఠనం పూర్తికాగానే నాన్న మనసులో అనుకున్నాడు...

'గొప్ప మాటలు. ఊరట కలిగించే మాటలు. అయినా మాటలు మాటలే'

నాన్న పర్సుతెరిచి పురోహితుని చేతిలో వందరూపాయల నోటు పెట్టాడు.

"ఇది చాలా ఎక్కువ" అన్నాడు పురోహితుడు.

"దయచేసి తీసుకోండి" అన్నాడు నాన్న.

"కృతజ్ఞుణ్ణి"

"మీరు చదివిన శ్లోకం మనసుని కదిలించి వేసింది పండిట్ జీ" అన్నాడు నాన్న.

"పోయిన వసంతంలో నేనూ నా బిడ్డ అస్థికలు ఈ గంగలో కలిపాను" అన్నాడాయన భారంగా. నాన్న పురోహితుని ముఖంలోకి చూశాడు.

"ఆ బాధని తట్టుకోడానికి ఈ జ్ఞానం ఉపయోగపడిందా?"

"లేదు" అని గొణిగాడు పురోహితుడు.

* * *

అమ్మా నాన్న ఇంకో రెండు రోజులు కాశీలో గడిపివచ్చే ఆలోచనలో ఉన్నారు. నేను మాత్రం వాళ్లకన్నా ముందుగా హైదరాబాదు తిరిగి వెళ్లాలని నిశ్చయించుకున్నాను. మృత్యువాసనకొట్టే ఈ కాశీ నగరం నన్ను తీవ్రంగా కృంగదీసింది. పైగా నాకేమిటో పీటర్‌ని చూడాలనిపించింది. కన్నుమూసి తెరిచేలోపున హైదరాబాదులో వాలాను.




"పీటర్ ఎలా ఉంది ?" అనడుగుతున్నాడు గోపాలమీనన్ రామూని. ఇద్దరూ వసారాలో నిలబడున్నారు.

"బాగాలేదు సాబ్! ఆకలనేది పోయినట్టుగా ఉంది" అన్నాడు రామూ.

"ఏం చేద్దామనుకుంటున్నారు?" అనడిగాడు గోపాలమీనన్.

"నాకు తెలవదు" అన్నాడు రామూ తనకేమీ పట్టనట్టుగా.

ముందు వరండాలో మట్టిముద్దలా పడుంది నా పీటర్. బాగా నీరసించి పోయింది.

"అమ్మగారెక్కడ ?" అనడిగాడు మీనన్.

"వాళ్ల ఊరు వెళ్లారు"

"ఒక్కరేనా?"

"నాకు తెలవదు"

ఆ మాటవింటంతోటే నేను ఆలోచనలో పడ్డాను. ఆమె అమ్మ, నాన్న ఏనాడో పోయారు. వాళ్ల ఊళ్లో ఇప్పుడు బతికున్న వాళ్లెవరికీ మేరీ తెలీదు. ఆమెని వెతికి పట్టుకోవాలి. జార్జితో వెళ్లిందా? ఎక్కడికి

వెళ్లి ఉంటుంది??

ఆకాశంలోకి ఎగిరాను. మేరీ గ్రామం పైన చక్కర్లుకొట్టాను. ఇటీవల నగరంలో చెలరేగిన అల్లర్లకు చుట్టు పక్కల అన్ని గ్రామాలలో గండిపేట చెరువు, గోల్కొండ ఖిల్లాదాకా అశుభసూచకమైన నిస్తబ్దత అలముకుంది. గోల్కొండఖిల్లా పైన ఎగుర్తూ కిందికి చూశాను. అంతా నిర్జనంగా ఉంది. ఖిల్లా ప్రవేశద్వారం ముందు ఓ గైడు ఒక్కడే కూర్చుని దమ్ములాగుతున్నాడు. హఠాత్తుగా నా ఆకుపచ్చ ఎంబాసిడర్‌కారు కోట ప్రహరీ గోడ తూర్పు వంపుదగ్గర కనబడింది. మెలికలు తిరిగిన మెట్లవరసమీదుగా పైకెగుర్తూ పోయాను. ఓ స్తంభం నీడలో నల్లరాతి పలకమీద జార్జిని ఆనుకుని కూర్చుని వుంది మేరీ. వాళ్ల ముందు ఎండలో ఓ ముసలాడు చతికిలపడి తన పెంపుడు కోతుల్తో ప్రదర్శన ఇప్పిస్తున్నాడు.

"రావయ్యా సర్దార్! ఉట్టినే మూతి బిగించుకుని ఏం కూర్చుంటావ్ ?" అనరిచాడు ముసలయ్య- కోతిని కర్రతో మృదువుగా అదిలిస్తూ.

కోతి వెనక కాళ్ల మీద లేచి నిలబడింది. దాని వెనకభాగం రేగిన పచ్చి పుండులా ఎండలో మెరుస్తోంది. పసుపుపచ్చ తలపాగా, నడుం దిగని నీలంగు పొట్టి చేతుల జుబ్బాతో పెళ్లి ఊరేగింపు ముందు సవిలాసంగానడిచే పెళ్లికొడుకులా ఉందా మగకోతి. అద్దాలు తాపిన నారింజరంగు గౌను వేసుకుని, తలకి మేలిముసుగు కప్పుకుని సిగ్గుల పెళ్లికుమార్తెలా ఒదిగి నిలబడింది.

"నీ ముద్దుగుమ్మని ముద్దు పెట్టుకోవయ్యా" అన్నాడు ముసలయ్య.

కోతి భార్యకేసి తిరిగి, కుడిచేత్తో ఆవిడ నడుం పట్టుకుని ముద్దుపెట్టుకో డానికి ఎర్రటి నాలుక వెళ్లబెట్టాడు.

"అద్గదీ! ఆలుమగల మధ్య మరింక కలహం లేదు. మళ్లీ చిలకా గోరింకలై పోయారు"

మేరీ, జార్జి గలగల నవ్వారు.

"చూశారా...మావాడికి తలతిక్క జాస్తి. లేకపోతే పెళ్లామంటే పడిచస్తాడు. అసలు విషయం మర్చేపోయాను. వీడికి హస్తసాముద్రికం తెలుసు. పండితుడనుకోండి. రావణబ్రహ్మ వంశీకుడు-ఏమనుకున్నారో!" ముసలయ్య గప్పాలు కొట్టాడు.

ఇద్దరూ మళ్లీ పగలబడి నవ్వారు.

"అమ్మగారూ! మావాడిచేత చెయ్యి చూపించుకుంటారా?" అ న డి గా డు ముసలయ్య మేరీని.

"నేనా? వొద్దు. అది నన్ను ముట్టుకుంటే నాకు ప్రాణంపోతుంది" అంది మేరీ.

"అమ్మగారూ! వాడు మిమ్మల్ని పిసరంత నొప్పించడు. ముఖ్యంగా ఆడవాళ్లతో మహా మెత్తగా ఉంటాడు. ఒక్క పెళ్లాంతోటే అప్పుడప్పుడూ కోతి చేష్టలు చేస్తాడు. మీరింతకుముందు చూశారుగా వీళ్ల ప్రణయకలహం..."

"అమ్మో... నేను చూపించుకోను. నాకు భయం" అంది మేరీ తల అడ్డంగా ఊపుతూ.

"నేనున్నాగా అమ్మా! ఏదీ...చెయ్యి చాపండి" – ముసలాడు మెల్లిగా అనునయంగా అడిగాడు.

"అయితే మొదట ఇతణ్ణి చూపించుకోమను" అంది మేరీ జార్జిని చూపిస్తూ.

ముసలయ్య కోతి మెడకి కట్టిన తాడు లాగాడు. వెంటనే సర్దారు యజమాని

భుజాలు పట్టుకుని నిలబడి గుసగులాడుతున్నట్టుగా ఎడంచెవి వేపు వంగి పెదాలు ఆనించింది.

"సర్లేవోయ్! అమ్మగారికి నేను చెప్తాలే" అంటూ ముసలయ్య మేరీ వేపు తిరిగి, "అమ్మా... వీడు మొదట మీ చెయ్యే చూస్తాడట. మీలాగా గౌన్లు వేసుకున్న ఆడవాళ్లని చూస్తే వీడికి చురుకు పుడుతుంది" అన్నాడు.

నేను చచ్చిపడుంటే ఆ నవనీత్ దేశ్‌పాండే బుర్రలో లేచిన ఆలోచన్లు ఇవేగా. ఇప్పుడీ కోతికి గౌన్లు తొడిగిన వాళ్లంటే బుర్రలో వెర్రి తొలుస్తుందాయేం?–అందామనుకున్నాను.

మేరీ సిగ్గుపడింది. బెరుకు బెరుగ్గా గుప్పిలి తెరిచి చెయ్యి చాపింది. సర్దారు వంగి ఆ చేతివంక శ్రద్ధగా చూసి చటుక్కున యజమాని చెవిలో నోరు పెట్టాడు.



"ఏమ్మా... ఈమధ్య మీ ఇంట్లో వాళ్లెవరైనా జబ్బు పడ్డారా? చనిపోయారా? లేకపోతే ఎవరైనా పురుడు పోసుకున్నారా?" అనడిగాడు ముసలయ్య.

"ఔను...చనిపోయారు" అంది మేరీ.

"ఏమవుతారు మీకు? దగ్గరవాళ్లా? చాలా ప్రియమైన వాళ్లా?"

"దగ్గర మనిషి"

భగవాన్! ఎంత క్రూరం? అసలు

మాట తుంచేసి దగ్గర మనిషినని చెబు తుందా! భర్తనని చెప్పుకోడానిక్కూడా మనసొప్పని దుర్మార్గురాలు!

"పిల్లలా సార్ ?" అనడిగాడు ముసలయ్య జార్జిని.

"లేరు"

"అయితే అమ్మగారి చేతిని మళ్లీ ఇంకోసారి చూడనీయండి సార్" అని ముసలయ్య ప్రాధేయపడ్డాడు.

"సరే" అంది మేరీ ఈసారి ధైర్యంగా. కోతి ముందుకు గెంతాడు. మేరీ అరచేతి మీదికి వంగి ఒక్క క్షణం చూశాడు. గబగబా యజమాని మీదికెగ బడి కిచకిచలాడాడు. ముసలయ్య పగల బడి నవ్వాడు.

"ఏంలేదు సార్ ! అప్పుడప్పుడూ వీడికి తిక్క రేగుతుంది. పొగరుమోతు వెధవ! శోకతో పుట్టాడు కాబట్టి సరిపో యింది. లేకపోతే..."

"వాడేం చెప్పాడో మేం వినాలి'' అంది మేరీ ముసలాడి మాటని మధ్యలో తుంచేస్తూ.

ముసలయ్య కంగారుపడిపోతున్నట్టు అభినయిస్తూ, కళ్లు దించి, "ఏం చెప్పా దంటే..." అంటూ నత్తులు కొట్టాడు.

"ఏమీ అనుకోంగానీ త్వరగా చెప్పు" అని జార్జి తొందరించాడు.

"మీరిద్దరూ ఈ రాత్రి తొమ్మిది-పది గంటల మధ్య 'కార్యం' చేసుకుంటే అమ్మ గారి కడుపున కాయకాస్తుంది. అది చాలా మంగళ ప్రదమైన ముహూర్తం అంటాడు మావాడు" అని చెప్పాడు ముసలయ్య.

జార్జి చిరునవ్వు నవ్వుతూ మేరీ వేపు క్రీగంట చూశాడు. మేరీ సిగ్గు అభినయిం చింది.

అదే నిజమయితే, యముడి ముందు నేను ఓడిపోయినట్టే. లోపం నాది కాదు-మేరీదే అని సవాలు చేశాను. మేరీ గొడ్రా లని నాకు కచ్చితంగా తెలుసు. కోతు లాడించే ఈ వెధవ వాళ్లని వెర్రోళ్లని చేస్తున్నాడు. కనీసం నా పదమూడో రోజుదాకా అయినా ఆగితే బావుణ్ణు. ఏ పదమూడో రోజు దాటాక ఆమె కడుపు ప్రవేశిస్తానేమో! ఆమెకి కొడుకుగా పుడతా నేమో? అంటే జార్జి నా రేపటి జన్మలో తండ్రి అవుతాడు!

కోతులాడించిన ముసలాడికి డబ్బులివ్వ టానికి జార్జి పర్సు తెరిచాడు. పర్సు పగిలిపోయేటన్ని నోట్లు ... మేరీ నా డబ్బంతా తగలెయ్యటం మొదలెట్టిందన్న మాట.

ఆట పూర్తయింది. ముసలాడు లేచి మూట చంకకి తగిలించాడు. చేతులో తాడు లాగాడు. కోతులు వెంట సాగాయి.

సూర్యుడు పడమటివేపు పల్లంలోకి జారుతున్నాడు. ఖిల్లా అంతటా అంద మైన గోధుమకాంతి అలముకొంది. దూరంగా గండిపేట వెండినీళ్లు బూడిద రంగు తాలుస్తున్నాయ్. ఏవో ఆలోచ నలు నా మనస్సుని తొలుస్తున్నాయ్. ఈలోగా ప్రేమ పక్షులు రెండూ ఎగిరి పోయాయి. నా ఎంబాసిడర్ కారు సరస్సు వేపు దూసుకుపోతోంది. మేరీ రెండో శోభనానికి ఉరకలేస్తోంది, ఆ తరవాత ఏం జరగబోయేదీ నాకు తెలుసు.

సరస్సులో తన నీడ చూసుకునే ఖరీ దైన స్టార్‌లైట్ హోటల్‌లో తేలారిద్దరూ.

"నిన్న సాయంత్రం రిజర్వేషన్ కోసం ఫోన్ చేశాను. రిజిష్టరు చూడండి" అంటున్నాడు జార్జి రిసెప్షన్ కౌంటర్ లోని అమ్మాయితో.

"మీ పేరు... ప్లీజ్"





"మిస్టర్ అండ్ మిసెస్ కెన్నత్ జర్జ్"

రిసెప్షనిస్టు రిజిష్టరు తెరిచిచూసింది.

"కార్నర్ రూం కావాలని అడిగారు కదా?"

"అవును" అన్నాడు జార్జి. మేరీ మౌనంగా అతని వెనక నిలబడింది.

"రేపు ఉదయం వరకు బుక్ చేశారు"

"ఔను"

ఒక్క నిముషం నిశ్శబ్దం.

'ఈ దిక్కుమాలిన ప్రేమపక్షుల్ని చూడండి! భార్యాభర్తల్లాగా నాటకం ఆడుతున్నారు. ఏ పబ్లిక్ గార్డెన్‌కో పోయి పొదలచాటున లవ్వాడుకోక ఇక్కడికి దాపురించారెందుకో' అనుకుంటోంది ఆ రిసెప్షనిస్టు భామ.

"ఇదుగో సర్! మీ కీ" జార్జికి కీ అందించింది.

నేను మొదట్లో హనీమూన్‌కి బుక్ చేసిన అదే రూం ఇప్పుడు వీళ్లు బుక్ చేసుకున్నారు. ఔరా...!

మూసిన తలుపుల వెనక జార్జి ఆమె రొమ్ములమీద వేళ్ళు ఆడించాడు. మెడ మీద చక్కలిగింతలు పెట్టాడు. బ్లౌజ్ గుండీలు ఊడదీశాడు. బ్రాసరీ ముడి మీదికి చెయ్యిపోయింది.

"ఆ కోతి చెప్పింది జ్ఞాపకం తెచ్చుకో. ముహూర్తం దగ్గర పడుతోంది. అప్పుడే పావు తక్కువ తొమ్మిదయింది" జార్జి ఆమె చెవులో గుసగుసలాడాడు.

"ఆ కోతులాడించిన ముసలాడు మనిద్దరికీ పెళ్ళయిందనుకొని పొరపాటు పడ్డాడు. పెళ్ళి కాకుండా కదుపా..!నువ్వే ఆలోచించు" అంది మేరీ.

"ఈ సంతాపదినాలు ఇంకా ఒక్క నెలేగా. ఆ తరవాత మన ఇష్టారాజ్యం... తెలిసిందా?"

"అవును డార్లింగ్" అంది. ఒంటి మీద బట్టలు ఒక్కొక్కటీ నేలమీద కుప్పపడుతుంటే నీళ్ల అడుగునుంచి పైకి లేచే మత్స్యకన్యలా ఉంది.

నగ్న విగ్రహంలా నిలబడింది మేరీ. అతని పెదాలు మేరీ కంఠం, చిబుకం, ఎడం బుజం మీదుగా నడుం దాకా జారాయి.

"నీ శరీరంలో ప్రతి అవయవం వేరు వేరు సువాసన వేస్తోంది సుమా! అన్నిటి కన్నా నీ కంఠంలో స్ట్రాబెరీ వాసనంటే నాకెంత ఇష్టమో తెలుసా?" అన్నాడు జార్జి పారవశ్యంలో.

మేరీ సుతారంగా నవ్వి, అడవి మృగాన్ని చూసినట్టుగా జార్జి వంక చూసింది. "నీ ముద్దుల్లోనే నన్ను స్నానం చేయించేటట్టున్నావే"

"కాదనకు డార్లింగ్!"

"ముందు నేను షవర్ బాత్ చెయ్యాలి. ఇన్నాళ్ళూ నేనేదో విష జంతువు కోరల్లో చిక్కుబడిపోయినట్టుగా అనిపిస్తోంది. శవంతో కలిసి తిండి తిని నిద్రపోయినట్టుగా అనిపిస్తోంది" అంది మేరీ.

"ఇదుగో...మళ్ళీ వాడి ధ్యాసలో పడుతున్నావ్"

జార్జికి చిరాకెత్తింది. 'డామిట్! అప్పుడప్పుడూ దీని తిక్కతో చస్తున్నాను. ఏదో లోకాల్లోకి దీన్ని ఎత్తుకు పోదామని నేను ఆయాసపడుతుంటే శవాలు, విషజంతువులు అంటుంది' అని మనసులో విసుక్కున్నాడు.

"సరే...స్నానం చేసిరా. నేనూ షవర్ కింద తలపెట్టి కూర్చోటం తప్పనట్టే వుంది"

"నీ స్నానం తరవాత"

"సరేసరే!"

మేరీ స్నానాల గదిలో దూరగానే జార్జి కూడా బట్టలు విప్పేసి ఆమె వెన్నంటే నడిచాడు.

"అబ్బ! పోదూ..." మేరీ గోముగా అరిచింది.

వాళ్ళ జలకాలాట తిలకిద్దామని నేనూ స్నానాల గదిలోకి చొరబడ్డాను. ఇద్దరూ చిన్న పిల్లల్లా ఒకరిమీదికొకరు నీళ్ల చల్లుకుంటున్నారు.

జార్జి ఆమె పెదాల్ని, ఊగే ఆమె రొమ్ముల్ని ముద్దు పెట్టుకుంటూ— "షాంపేన్‌లో స్నానంచేస్తే ఎంత మజాగా ఉంటుందో ఊహించు. ఇద్దరం ఒకరి ఒళ్లు ఒకరు జుర్రుకోవచ్చు. మెత్తటి ఒళ్లు మత్తుపానీయం... జంట వాసనలు రెండూ ఒంటిగా పెనవేసుకుపోవూ! ఓ కొత్త వాసన, కొత్త రుచి, కొత్త అనుభవం" అన్నాడు.

మేరీ ఉద్రేకంతో ఊగిపోతూ— "ఊపేసే థ్రైపంటే అదే. ఇద్దరం కలిసి షవరు కింద ఇలా హుషారు చేసుకుందామనే ఆలోచనే రామికి రానేరాలేదంటే నమ్ము. మళ్ళీ నగ్నచిత్రాలు గీసే గొప్ప ఆర్టిస్టునంటాడు!" అంది.

"స్వర్గానికంటూ వెడితే అక్కడ అప్సరసల బొమ్మలు గీస్తూ కూర్చుని వుంటాడేమో!" అన్నాడు జార్జి.

వాళ్ళ ముద్దులు, శృంగారం చూస్తూనే అక్కడికక్కడ ఆ ఇద్దరి గొంతులూ నొక్కి పారేసే కండబలం ఇప్పుడు నాకుంటేనో అని పరితపించాను. ఆ వెక్కిరింతలు, వెకిలితనం, పచ్చి వ్యభిచారం.... ఆటకట్టించే శక్తివుంటే ఎంత బావుణ్ను! ప్చ...



# 14

కాలంగతినే బొత్తిగా మర్చిపోయానేమో అనిపించింది. నాకు అంత్యక్రియలు జరిగి ఎన్నిరోజులు గడిచిందీ జ్ఞాపకంలేదు.

ఒకరోజు ఉదయం గతించిపోయిన రుతుపవనం తిరిగి విరుచుకుపడ్డట్టు కనిపించింది. ఇంటి కప్పుమీంచి ధారాపాతంగా కురిసే వాననీళ్ళతో నా లాన్ నిండిపోయి పొంగిపొర్లే చెరువులా అగుపించింది.

మేరీ రామూని ముందు వరండాలోకి కేకేసింది.

"పురోహితుడు ఎప్పుడొస్తున్నాడు?"

"తొమ్మిదిన్నరకంతా వచ్చేస్తాడమ్మగారూ"

"వాతావరణం ఇట్లా ఉంటే రాగలుగుతాడంటావా?"

"అవసరమైతే టాక్సీ వేసుకుని రమ్మన్నా అమ్మగారూ"

"మంచి పనిచేశావ్. తతిమ్మా ఏర్పాట్లన్నీ పూర్తిచేశావా?"

"చేశానమ్మగారూ"

మేరీ ఒక్కక్షణం మౌనంగా ఉండిపోయింది.

"రామూ... కర్మ చేయాలంటారే! అంటే ఏమిటి?" అనడిగింది మేరీ.

"జీవుడు కొత్త శరీరంలో ప్రవేశించబోయేముందు ఇచ్చే వీడ్కోలు లాంటిది అమ్మగారూ" అన్నాడు రామూ.

"పునర్జన్మా?"

"ఔనమ్మగారూ"

"అంటే 'కర్మ' పదమూడోనాడు చేస్తారు"

"ఔను"

"పన్నెండోరోజో, పధ్నాలుగోరోజో ఎందుకు చెయ్యకూడదు?"

"అది నాకు తెలవదమ్మగారూ"

రామూ లోపలికి వెళ్ళిపోయాడు. పురోహితుడు టాక్సీలో దిగాడు. తన ప్రాధాన్యాన్ని తలుచుకుని ఉబ్బిపోతున్నాడని ఆయన మొహం చూస్తేనే తెలిసిపోయింది.

ఎట్టకేలకి చిట్టచివరికి నా ప్రాయశ్చిత్తదినం రానేవచ్చింది. నిజంగా నా మనస్సు తేలికపడింది. ఈ పదమూడు రోజుల్లో నేననుభవించిన భయంకర బాధ మరి ఉండదు.

పురోహితుడు వచ్చిన కాస్సేపటికి నా 'కర్మ'కి ప్రముఖులొక్కరొక్కరే కార్లలో, టాక్సీలలో వచ్చేస్తున్నారు.

ముందు గదిలో నేలమీద మధ్యన ఇనప కుంపట్లో కట్టెముక్కలు కూరారు. దానికి కొద్ది అడుగుల దూరంలో వెనక నా శవం ఉంచిన జాగాలో కొవ్వొత్తి వెలిగించి పెట్టారు. పురోహితుడు నేలమీద పరచిన పులి చర్మంమీద కుంపటి కెదురుగా బాచి పీటవేసుకుని కూర్చున్నాడు. చుట్టూ నెయ్యి, కర్పూరం, చక్కెర, దాల్చినచెక్క వగైరా ఉంచిన పాత్రలు పేర్చి పెట్టారు. అమ్మని, నాన్నని పక్కన కూర్చోమని పురోహితుడు సైగచేశాడు.

నాన్న కుంపటి ముట్టించాడు. అమ్మ నెయ్యి కుమ్మరించింది. మంట బస్సున పైకిలేచింది. పురోహితుడు మంత్రాలు చదవటం మొదలెట్టాడు. అతిథులంతా నిశ్శబ్దంగా కూర్చుని ఈ తంతు చూస్తున్నారు.

పురోహితుడు భగవద్గీతలోని శ్లోకాలు వల్లెవేస్తున్నాడు. మరణాన్ని గురించి మానవులు విలపించకూడదు; ఆత్మ శాశ్వతమైంది అంటూ ఆ శ్లోకాలలో ఉద్బోధిస్తుండగా గోడ గడియారం ఠంగు ఠంగున పది గంటలు కొట్టింది. ఆరోజు నేను మూసినది అడుగునుంచి పైకి తేలిన క్షణంలో క్లాక్‌టవర్ ఇలానే సరిగ్గా ఇదే క్షణంలో పదిగంటలు కొట్టటం జ్ఞాపకం వచ్చింది. యమునితో సంవాదం పూర్తయి ఒడ్డున పడ్డ క్షణం అది.

ఏదో అజ్ఞాత శక్తి నన్ను ఇంట్లోంచి పైకి ఈడ్చుకు పోతున్నట్టనిపించింది. ఈకలా మబ్బుల్లో తేలిపోతున్నాను.

"మళ్ళీ మనం ఇక్కడ కలుసుకుంటున్నాం"

ఆ శబ్దం వినిపించిన దిశగా తిరిగాను. నల్లటి మబ్బు తునక. కాదు...నిస్సందేహంగా అది యముని ఆకారం.నా కట్టెదుట రాకాసి రెక్కలు చాచిన రాబందులాంటి మేఘం నిలిచింది.

"నన్ను సరిగ్గానే పోల్చుకున్నావే" అదే స్వరం.

"ఔను స్వామీ! నా న్యాయవిచారణా సమయంవచ్చేసిందనుకుంటాను" అన్నాను నేను.

"నిజమే"

"స్వామీ! మనం లోగడకలుసుకున్న తరవాత నేననుభవించిన బాధలన్నీ తమకు తెలుసు"

"తప్పకుండా"

"అయితే ఇప్పటికైనా తమరు



నన్నర్థం చేసుకుని జాలి తలుస్తారా స్వామీ!" అన్నాను ప్రాధేయపూర్వకంగా.

"ఇది నా సంబంధిత శాఖ కాదని నువ్వు మర్చిపోయావు. మరణ ప్రాప్తి కలగజేయడం, విధాత సమక్షంలో ఆత్మల్ని హాజరుపర్చటం నా కర్తవ్యం"

"స్వామీ! తమరు నా కేసును నివేదించే పద్ధతి మీద అంతా ఆధారపడి వుంటుంది" అని నసిగాను.

"ఇదేమైనా మీ మానవలోకంలోని కోర్టనుకున్నావా? అక్కడ నిందితుని తరపున వాదించే న్యాయవాది వాక్చాతుర్య పటిమ మీద తుది తీర్పు ఆధారపడి వుంటుంది. ఇక్కడ అలా కాదు. ప్రతి మానవుడూ భగవంతుని ముందు ఏ సాక్షులూ, న్యాయవాదులూ లేకుండా దిగంబరంగా నిలబడాలి. సృష్టికర్త సర్వజ్ఞుడని నీకు తప్పక తెలిసే వుండాలి"

"పరిపూర్ణ కరుణాంతరంగుడని కూడా తెలుసు స్వామీ''

"ఇంతకీ ఏమిటి నీ మొర?"

"స్వామీ...నేను క్షమాభిక్ష అర్థించలేనా? భగవంతుని కృపకు ఈ మానవులు అర్హులుకారా??''

"నాలుక మీద పెద్దపెద్ద పదాలు దొర్లించడం తెలుసు. అంతే! ఎవరైతే తప్పులు దిద్దుకోడానికి ప్రయత్నం చేస్తారో, గుణపాఠాలు నేర్చుకోడానికి ఆసక్తి చూపుతారో వారికి భగవత్ కృప లభిస్తుంది. సరిదిద్దటానికి కూడా వీలుపడని నీలాంటి మొండి మనుషులకి కాదు. గడచిన ఈ పదమూడు రోజుల్లో నువ్వేం చేశావో చెప్పు" అన్నాడు యముడు కటువుగా.

"క్షమించండి స్వామీ''

"ఈ పప్పులేమీ నా దగ్గర ఉడకవు"

"మరి నేను క్షమాభిక్ష ఎలా వేడమంటారు? నేను నిజంగా పశ్చాత్తాపపడుతున్నానని తమకి తెలుసుగదా!"

ఒక్క క్షణం మా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం.

"ప్రతిరోజూ కొద్దిసేపు ప్రార్థన చేస్తే ప్రయాస లేకుండా శాంతి లభించే టప్పుడు ఈ మానవులు కోరి బాధలు కొనితెచ్చుకుంటారెందుకు?" యముని కంఠంలో పూర్వపు కాఠిన్యం లేదు. నా మాటలు ఆయన హృదయంలో ఎక్కడో మృదు తంతువుని మీటి వుండాలి.

"అదే మా మత బోధకులు చెప్పేది" అన్నాన్నేను.

"బోధ చేయడం వృత్తిగా పెట్టుకున్న ఆ పండితుల్ని వదిలెయ్. వాళ్ళకి సరైన శాస్తి చేసి పంపుతున్నాం. ఆ మతాచార్యులలో చాలామంది మళ్ళీ జన్మలో నక్కలుగా, చిలకలుగా, ఊసరవెల్లులుగా పుడుతున్నారు'' అన్నాడు యముడు కోపంగా.

"మీ మాట వింటుంటే నాకు చాలా సంతోషం వేస్తోంది'' అన్నాను.

"ప్రార్థన చేయడానికి నీకెందుకు వ్యవధి దొరకలేదు?"

"బహుశా మా నాన్న ఛాందసానికి నేను తిరగబడ్డం కారణం కావచ్చు. తమకు తెలుసో లేదో- భగవద్గీత ఉపనిషత్తులు ఇంకా ఇతర ధర్మ శాస్త్రాలలోని శ్లోకాల్ని మా నాన్న నా చెవుల్లో నూరిపొయ్యాలని తెగ ప్రయత్నించేవాడు. నా అంతట నేను భగవంతుణ్ని గురించి తెలుసుకోడానికి అవకాశం ఇచ్చేవాడు కాదు. నన్ను తొయ్యటమే ఆయనకి చేతనైంది" అన్నాను.

"కాబట్టి నువ్వు దానికి తీవ్రవ్యతిరేకి




పయ్యావు. దిగంబర శరీరాలు చిత్రించే ఎక్కువగా వెళ్ళిపోయానంటావ్."

నేను పప్పులో కాలేశాను. ఇక్కడ యమునికి చిక్కిపోయాను.

"భగవద్గీత కాదు–కామసూత్రాలు నీ పారాయణ గ్రంథం...ఔనా?" సూటిగా అడిగాడు యముడు.

"నా పారాయణ గ్రంథమా స్వామీ?"

"నీ ఒక్కడికే ఏమిటి! సంఘంలో గొప్పవాళ్ళనుకునే అందరికీ" అన్నాడు యముడు.

"నాకు తెలియక అడుగుతాను–కామ సూత్రాలు కళాఖండం కాదంటారా? కనీసం శైలీ విన్యాసపరంగానైనా. అదేమీ మామూలు కొక్కోకశాస్త్రం కాదే. అది చిత్రకారుని దిగంబరతా భావన అనుకుంటాను"

"దిగంబరత్వం కళ! ఆ భ్రాంతి నిన్నంతగా పీడిస్తే, దిసమొలతో వున్న పసిపాపలో సవ్వు భగవత్స్వరూపం దర్శించివుండాలి. అమాయకత్వం, విశ్వాసం, నైర్మల్యం–వీటికి మూర్తీభావం పసిపాప. మొండిమొల బాలకృష్ణుణ్ని అపురూపంగా చిత్రించిన కాంగ్రా చిత్ర కళ మాటేమిటి? కాని స్త్రీ నగ్నశరీరం మీదే నీ మమకారం. వ్యభిచార కళ అందాం–దిగంబర కళ అనొద్దు"

ఆయన మాటల్లో ఏదో నన్ను కదిలించేసింది.

"అద్భుతమైన సూచన!" అనరిచాను. "నాకు మరొక్క అవకాశం ప్రసాదించండి. ఈసారి నేను పసిపాపని చిత్రిస్తాను"

జవాబులేదు. నిశ్శబ్దం రాజ్యం చేసింది. యముడు అదృశ్యమైపోయాడా? అంతలోనే ఆయన గొంతు వినిపించింది.

"నాకిక నీతో మాట్లాడ్తూ కూర్చునే వ్యవధి లేదు. వేగం వెళ్ళిపోవాలి. విచిత్ర మేమంటే రెండోసారి మళ్ళీ నన్ను మాటల్లో పెట్టి నిలిపేశావ్. ఎంత పని మీద పడబోతోందో తెలుసా? ఒకే ఒక చోట నుంచి మూడువేలమంది ఆత్మల్ని కలుసుకోవాలి"

"భారతదేశంలో హత్యాకాండా?" అనడిగాను.

"భారతదేశం ఒక్కటే నా కార్య క్షేత్రం కాదని మర్చిపోతున్నావ్. ఈసారి ఇది హత్యాకాండకాదు. అణ్వాయుధాలు తయారుచేసే కర్మాగారానికి చిల్లిపడేట్టు చేశాను. దానికి దగ్గర్లో వున్న గ్రామం యావత్తూ ఈ సాయంత్రానికల్లా తుడిచి పెట్టుకుపోతుంది"

"విధాతని ఎక్కడ కలుసుకోవాలి స్వామీ?"

ఏదో విపరీత భయాందోళన నన్ను చుట్టుముడుతోన్నట్టుగా వుంది.

"ఇక్కడే...ఏ క్షణంలోనైనా"

ఆకాశంలో ఉరుము ఉరిమింది; ఆ శబ్దం వాయుమండలంలో మారుమోగింది. ఎవరికో దారి ఇవ్వటానికన్నట్టు మబ్బులు పక్కలకి చెదిరిపోయాయి. ఓ తెల్లని మేఘం లోంచి గింగురుమని మారుమోగే గంభీర వాణి వినిపించింది.

"అంతా విన్నాను... కన్నాను. నీపని పూర్తి కావటానికి నిన్ను తిరిగి భూలోకం వెళ్ళనిస్తున్నాను. పారాడే మొండి మొల పసి పాపలో నా మహత్తు నీకు దర్శన మవుతుంది. మనస్సులో కోపం పెట్టుకోకు. తప్పులు మన్నించేవాడు, మర్చిపోయేవాడే ధన్యుడు. నీకు శాంతికలుగుగాక!"

నా ఆత్మ ఆనందంలో ఓలలాడింది ఆ తన్మయత్వం నాది. ఆ పరమాత్మని



దివ్యకృపకు నేనెలా అర్హుణ్నయ్యాను?

గుడిగంటలు వినిపిస్తున్నాయి. నా మాతృభాషలో కలగాపులగంగా మాటల హోరు వినిపిస్తోంది. ఇంకా ఇంకా పెద్దగా వినిపిస్తూ నా చెవుల్లో గింగురుమని మార్మోగుతున్నాయి.

* * *

ఆది మా పొరుగింట్లోంచి వచ్చే రేడియో రొద. శసివారం ఉదయం ప్రసారం చేసే భక్తిగీతాలు, వెంకటేశ్వర సుప్రభాతం ... మొద్దు నిద్దర నుంచి ఉలిక్కిపడి లేచాను. సోఫాలో పడుకునే, కళ్లు నులుముకుని చుట్టూ చూశాను. నా కుడి చెయ్యి ఛాతీపైన ఉంది. గుండె వేగంగా కొట్టుకుంటోంది. నేను నిజంగా బతికున్నానా?

కిటికీకి కట్టిన తెరల సందు గుండా ఎండ పొడ లోపలికి చొచ్చుకొచ్చింది.



తివాచీ మీద నీలం, ఎరుపు, పసుపుపచ్చ వర్ణ విన్యాసం లేత కిరణాల వెలుగులో జేగీయమానంగా మెరుస్తోంది.

ఎవరూ కనపడరేం? అంతా ఎక్కడికెళ్లారు? మేరీ ఎక్కడ? ఇంకా పక్కమీంచి లేవలేదా? రాత్రి పొద్దుపోయాక బాబర్ బట్టల్లో నేనెలా ఇంటికొచ్చిందీ లీలగా జ్ఞాపకం వస్తోంది. నిన్నటి భయంకర దృశ్యాలన్నీ కలగాపులగంగా నా

మనస్సు తెరమీద ఆడాయి- బాబర్ అత్యాచారం, కోళ్ళ పందెం, సులేమాన్ ఆలీ హత్య, స్టార్ లైట్ హోటల్లో షవరు కింద మేరీ, జార్జి కెనెత్‌లు... వాస్తవిక ప్రపంచం నుంచి నా దృష్టి విభ్రమాన్ని వేరు చెయ్యటానికి కాస్సేపు పట్టింది. నా మనస్సింకా ఆ భయంకర స్వప్న లోకంలో చిక్కుకునే ఉంది. అప్పుడే మేరీ నెమ్మదిగా తలుపు తోసుకుని లోపలికి వచ్చింది.




"గుడ్‌మార్నింగ్ రామీ! రాత్రి పొద్దుపోయిందాకా మేలుకునే వున్నావా డార్లింగ్?" పీటర్‌ని వీపుమీద సున్నితంగా వేళ్ళాడిస్తూ అడిగింది. ఆమె ఆప్యాయంగా, అభిమానంగా, ఆర్ద్రంగా మోగింది.

ఏమిటి? నాకంటిముందు రెండు దృశ్యాలు ఆడుతున్నాయా? సోఫామీంచి లేచాను. కెన్నెత్ జార్జి ఫోన్‌కాల్ నాలో అనుమాన పిశాచాన్ని ఎలా రేపిందీ గుర్తు తెచ్చుకున్నాను.

"నామీద ఇంకా కోపం తగ్గలేదా?''

"తెలీదు" ఆమె మొహంలోకి కళ్ళు గుచ్చి మెల్లగా అన్నాను."ఇంతకీ ఎవడు వాడు?" అనడిగాను నెమ్మదిగా.

"కెన్నెత్ జార్జి గురించా?" ఆమె ముసిముసి నవ్వు నవ్వుతూ అడిగింది.

"అసలు సంగతేమిటో చెప్పవేం?" మళ్ళీ నిగ్గదీశాను.

"సరే...నువ్వెరగని ఓ అనామకుడు"

"కాదు. నువ్వు చెప్పి తీరాలి" అన్నాను.

"నిజంగా చెప్పాల్సిందేనా!" కవ్వించింది. మేం మాట్లాడుకుంటుండగా, రామూ గుమ్మంలో నిలబడ్డాడు— చేతుల్లో ఆ ఉదయం దినపత్రికతో.

"పత్రిక సాబ్! కాఫీ కూడా తెమ్మంటారా?'' అన్నాడు మా ఇద్దరికేసి నిశితంగా పరిశీలిస్తూ.

"కాస్సేపాగి తీసుకురా" అన్నాను పేపరు అందుకుంటూ. అతను లోపలికి వెళ్ళిపోయాడు. నేను పత్రిక తెరవకుండా కాఫీ టేబుల్ మీద పెట్టేశాను.

"అతనెవరో నేను తెలుసుకోవాలి" అన్నాను మేరీ వేపు తిరిగి.

"ఓ పాత క్లాస్‌మేట్"

"నిన్నెందుకు పిల్చాడు ఫోన్‌లో?"

నా దృష్టి ఆమె మనస్సు పొరల్లోకి చూసుకుపోతున్నట్టనిపించింది.

"అప్పు కావాలంటాడు. ఇప్పటికి చాలాసార్లు ఫోన్‌లో అడిగాడు. తీసుకోటమే తప్ప తిరిగి ఇచ్చే అలవాటు అతనికి లేదని నాకు తెలుసు. నిజంగా పరాన్నభుక్కు" అంది మేరీ అతి మామూలుగా.

నా నెత్తిమీద పిడుగు పడ్డట్టుగా కుంగిపోయాను.

"నేననుకున్నాను అతను నీ..." సిగ్గునమిలాను.

"నా ప్రియుడనుకున్నావా?" మేరీ గలగలా స్వచ్ఛంగా నవ్వింది. "నీకేమైనా పిచ్చిపట్టిందా? ఊహాకల్పన కళాకారుడి శాపం కూడా" అని మెత్తగా చీవాట్లు




పెట్టింది.

"నిజం"

"నువ్వింత దూరం ఆలోచిస్తావని నేననుకోలేదు. నీకు మామూలుగా రేగే తిక్కలే అని సరిపెట్టుకున్నాను. అందుకే నిన్ను ఒంటరిగా నిద్రపోనిచ్చాను. నాకూ కోరిక లేచిందిగాని...." వాక్యం పూర్తి చెయ్యకుండా అర్ధంతరంగా ఆపేసింది.

"హాయ్, భగవాన్!"

"ఓపికల్లో తేలిపోయావా?"

"పీడకల్లో ఒరిగిపోయాను"

"బాగా అయ్యింది" అంది మేరీ విరసంగా నవ్వుతూ.

నిజమే. నాకు తగినశాస్తి జరిగింది. అందుకు నేను అర్హుణ్నే. నేను నాలోంచి బయటికొచ్చి, నా శరీరంతో నాకు సంబంధం లేనట్టుగా వేరుగా నిలబడి నా చేష్టల్ని తిలకించగలిగితే ఎంతబావుణ్ణు అనుకున్నాను. నన్ను ఎండగడుతూ నాకు వ్యతిరేకంగాలేచిన నా చూపుడువేలు మనోనేత్రంలో తిరిగింది.

రజియాతో తిరుగుతూ నా భార్యకి నమ్మకద్రోహం చేసింది నేను కాదూ?

పిచ్చి మేరీకి నా జీవితంలో చోటుచేసు కున్న వేరే స్త్రీ గురించి తెలుసా?

"కాఫీ తీసుకుంటావా?" అనడిగింది మేరీ.

"నువ్వో?"

"స్నానం చేశాక తీసుకుంటా"

మేరీకేసి అలవోకగా చూశాను. ఎన్నడో ఏళ్లకిందట ఒక హిందువుణ్ణి చేసుకోడానికి ధిక్కరించిన మేరీ అప్పుడెలా ఉంటో ఇప్పుడూ అలానే ఉంది. ఏళ్లనాడు నేను ప్రేమాయణం సాగించి నప్పుడెలా ఉందో ఇప్పుడూ అదే చిన్న పిల్లలా ఉంది. హఠాత్తుగా నా నరాల్లో వేడినెత్తురు వడిగా ఉరవడిగా ఉరక లెత్తింది.

"నేనూ తరవాతే తాగుతా. ఇద్దరం కలిసి షవర్ కింద కూచుందాం" అన్నాను.

"వాట్?"

"అదంతే!"

"ఏవిటో నీ ఎత్తు? నాకు అర్థంకాలేదు"

"ప్రతిదీ నీకుచెప్పాలా?" రెట్టించాను.

"అ రామీ పూర్తిగా వేయ"

"కావచ్చు. సరేగాని...నీ జార్జికి ఎంత కావాలిట?"

"వెయ్యి"

"ఇస్తే ఏంపోయింది? ఇదేమీ పెద్ద మొత్తం కూడా కాదు"

"నీ ఔదార్యం మెచ్చుకున్నా. నీ డబ్బు ముదక్కాలవలో పారబొయ్యాల సుందా... చెప్పు!"

"కొంపలంటుకుపోవు"

"అయితే సరే. నువ్వే ఫోన్ చేసి పిలువు. అతని ఫోన్ నంబరు ఇస్తా. తరవాత అది నీ ప్రారబ్ధం" అంది మేరీ నిష్ఠూరంగా.

"అది ఈవరకే అనుభవించాను"

"ఏవిటి?"

"ఏం లేదు"

"నువ్వేదో తికమకగా మాట్లాడు తున్నావ్, డార్లింగ్!"

"అంతకన్నా గత్యంతరమేముంది?"

"అదుగో...మళ్ళీ అదే ధోరణి" అంది మేరీ. నేను ఉడికిస్తున్నానని తనకి తెలుసు.

"ఇంకోమాట. ఈసారి నిజంగా నా బొమ్మల్లో కొత్తదేదైనా ప్రయత్నించాలని ఉంది" అన్నాను.

"స్నానాల గదిలో నగ్న సుందరా?"

"కాదు. మొండి మొల పసికందులు. ఈ ప్రపంచంలో పసికందు కన్నా

మించిన పరమ నిర్మలమైన వస్తువే ముంది? దిసమొల పసిపాప భగవంతుని దివ్యరూపం కాదా!''

"బ్రేవో! నీ ఇతర దిగంబర సుందరీ మణులకి తిలోదకాలిచ్చేస్తున్నావా?'' అంది మేరీ ఆశ్చర్యం అభినయిస్తూ.

మరుక్షణం మేరీ మొహం గంభీరమై పోయింది — ఏదో విషణ్ణ భావం ఆమె మనస్సులో పొడసూపినట్టుగా. ''నీలో ఈ మార్పుకి కారణమేమిటో నాకు తెలుసనుకుంటాను'' అని నిట్టూర్చింది.

"తెలుసా నీకు?"

''ఒక లోటు పూడ్చాలని నీ ఊహ మహావేదన పడుతున్నది. నీకు నేను సంతానం ఇవ్వలేకపోయాను"

''అదికాదు... నా పిచ్చి మేరీ!''

ఆమె నడుంచుట్టూ చేతులువేసి దగ్గరకి లాక్కుందామని జరిగాను. మేరీ మృదువుగా నా చేతులు నెట్టేసి, గది లోంచి వెళ్లిపోయింది.

నిజంగా మేరీ వెనకాలే నేనూ బాత్‌రూంలోకి చొరబడాలని నిశ్చయించుకున్నాను. ప్రస్తుత మానసికస్థితి నుంచి ఆమె తేరుకునేటట్టుగా చేయాలని నాకా బుద్ధి పుట్టింది. నేను లేచి స్నానాల గది వేపు అడుగు కదపబోతోంటే పత్రిక మొదటి పేజీలో బాక్సు కట్టి వేసిన వార్త నన్నాపేసింది. ''నవాబ్ సులేమాన్ అలీ మరణించారు"గబగబా పత్రిక అందుకుని చదివాను.

''విఖ్యాత మొఘల్ వంశీకుడు నవాబ్ సులేమాన్ అలీ బహదూర్ నిన్న రాత్రి హఠాత్తుగా గుండెపోటుతో మరణించారు. కొద్దికాలం క్రితం భార్యా వియోగం సంభవించిన నవాబ్ సులేమాన్ అలీ బహాదుర్‌కి ఇద్దరు బిడ్డలు - రజియా జేష్ఠ పుత్రిక, కుమారుడు బాబర్ అలీ. ఆయన మరణంతో ఆంధ్రప్రదేశ్, ముఖ్యంగా హైదరాబాదు నగరం ఇక గొప్ప కళా పోషకుణ్ణి కోల్పోయింది. ఆయన అంతిమ యాత్ర ఈరోజు సాయంత్రం గుల్షన్ మంజిల్ నుంచి ప్రారంభమవుతుంది. ఖైరతాబాదులోని వారి కుటుంబ స్మశాన వాటికలో ఆయనని ఖననం చేసారు''

ఆ వార్త చదువుతూనే ఏదో అజ్ఞాత సంవేదన నా మనస్సుని పిండేసింది. నా స్వప్నం రాబోయే ఈ దుర్నిమిత్తాన్ని ఎలా పసిగట్టింది?

మేరీతో కలిసి సహపంక్తి స్నానం చేదామనే నా కోరిక ఈ వార్తతో వాడి వత్తలైపోయింది. లోగడ ఎప్పుడూ మా ఇంట్లోంచి రజియాకి ఫోన్‌చేసి ఎరగను. ఇప్పుడెలానూ మేరీ స్నానాల గదిలో ఉంది కాబట్టి సాహసించి ఫోనెత్తాను. నా కలని గురించి రజియాతో చెప్పగలిగితేనా! డయల్ చేశాను. రజియానే ఫోనందుకుంది.

"రజీయా...ఇప్పుడే పత్రికలో చదివాను. చాలా ఘోర వార్త. అయామ్ వెరీ సారీ!'' అన్నాను.

"బాబా అంటే నాకెటువంటి భావమున్నా నాకూ చాలా బాధగా ఉంది. పత్రికలో వచ్చిన ఆ వార్త కట్టుకథ. సమర్‌ఖాన్ వేయించాడలా"

"ఏమంటున్నావ్!"

"గుండెపోటు కాదు రామ్మీ...మా తోట మాలి బాబా గొంతు నులిమి చంపేశాడు''

"మెహబూబా నాన్నా?''

''అవును''

ఒక నిముషం నాకు నోట మాట రాలేదు. నా వెన్నుపూసలో ఏదో భయంకరమైన నొప్పి పారాడింది. చిత్త

విభ్రాంతికి వాస్తవికతకి మధ్య సరిహద్దు గీతమీద వేలాడబడిపోయినట్టుగా అని పించింది నాకు.

"రజియా... నువ్వు నా అంత్యక్రియ లకి రాకపోయినా నేను మీ నాన్న అంత్యక్రియలకి హాజరవుతా"

"ఏమన్నావ్?"

"ఎందుకన్నానో నాకు తెలీదు"

"ఏమయింది నీకు?"

"ఏమీ కాలేదు"

"కాగూడదనే నా కోరిక"

"రజియా?"

"చెప్పు"

"కలలమీద నీకు నమ్మకం ఉందా?"

"అటువంటివాటిని గురించినాకెప్పుడూ ఆలోచన రాలేదు. నువ్వేదో ఇతర లోకానికిసంబంధించి మాట్లాడుతున్నట్టుగా వున్నావ్"

"నేను బాగానే వున్నాను...కంగారు పడకు. నేను చెప్పొచ్చిందేమంటే—తల్లి గర్భంలో పిండానికి ఇంద్రజాలం మాదిరి అద్భుతంగా లింగభేదం సంభవించినట్టు ఒక మనిషి ఇంద్రియ జ్ఞానాన్ని ఏదో ఒకానొకటి పూర్తిగా మార్చివెయ్యగలదని నువ్వు నమ్ముతావా?"

"నీ సరికొత్త తలతిక్క సిద్ధాంతాల్లో ఇదీ ఒకటా?"

"కాదు...నేను సీరియస్‌గా చెబు తున్నాను. నా భావం..."

"అంత్యక్రియల తరవాత తీరిగ్గా మాట్లాడుకుందాంలే. కాస్సేపు నాతో గడపగల్దువా? మా బాబర్ బట్టలజత ఇంకోటిచ్చి పంపుతా...సరేనా?" మళ్ళీ ఓక్షణం మౌనం. ఏం చెప్పాలో నాకే తెలీడంలేదు. ఇరుక్కుపోయాను మళ్ళీ.

"రజియా... ఈ సాయంత్రం మేరీని బయట తిప్పుకొస్తానన్నాను. గోల్కొండ ఖిల్లా, గండిపేట చెరువు..." గొణిగాను.

"అలాగా! అయితే నువ్వు అంత్య క్రియలకి రానక్కర్లేదులే" అంది రజియా మండిపడుతూ.

ఒక్కక్షణంనేను మళ్ళీ ఆత్మ గా అవతారమెత్తి ఆవిడ మనస్సులోని ఆలోచనల్ని చదవాలనిపించింది.

నిజంగా నా మనస్సు అటు వెళ్ళాలనే కొట్టుకులాడింది. కాని నేను నిస్సహా యుణ్ణి. నన్ను వేరే దిక్కుగా తోసుకు పోయేశక్తిని ఇప్పుడు ఎదిరించలేను.

"రజియా!" గుసగుసలాడినట్టుగా పిలిచాను. జవాబు లేదు—ఆమె నిట్టూర్పు తప్ప.

"నన్ను వివరంగా చెప్పనివ్వు!"

"ఎప్పుడైనా సంజాయిషీల వల్ల విషయవివరణ జరుగుతుందా?" బొంగురు గొంతుకతో నిష్ఠూరమాడింది.

"ఒక్కక్షణంవ్యవధివ్వు..ప్లీ..జ్..."

రజియా ఫోన్ పెట్టేసింది. నేను నా చేతుల్తో కాల్చిచంపిన పక్షిలా రిసీవర్‌ని ఇంకా చేతుల్లో పట్టుకునే వున్నా.

మేరీ ఇంకా స్నానాల గదిలోనేవుంది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఆ ప్రశాంత ఏకాంత నిశ్శబ్దంలో మా పొరిగింటి రేడియోలోంచి భక్తిరంజని కార్యక్రమం బిగ్గరగా వినిపిస్తూనే వుంది. వెంకటేశ్వర సుప్రభాతం వినిపిస్తూనే వుంది. ఒక శ్లోకం ఆత్మప్రబోధంలా పదేపదే నా మనస్సుని కదిలిస్తోంది.

ఈ ప్రాణికోటి జననం అగోచరం
మరణమూ అగోచరమే
జనన మరణ లీల నడుమ
జరిగేదే గోచరమవుతుంది.



## వాల్ట్ డిస్నీ

చిత్రకారులెవరూ ఎప్పటికీ చేరుకోలేని



కీర్తి శిఖరాగ్రాలకు చేరుకున్న వాల్ట్ డిస్నీ తన నిరంతరకృషి, పట్టుదలలతోనే అంతటి యశస్సునార్జించాడు. అతను చేసిన ఆ అద్భుత సృష్టికి గుర్తింపుగా ఒకటి వెంట ఒకటిగా ఎన్నో ఆస్కార్ అవార్డులు లభించాయి.

వాల్ట్ డిస్నీ చిన్నప్పటి నుంచీ ఎలుకలు లాంటి ప్రాణులతో ఆడుతూనే వుండేవాడు. 8వ తరగతి వరకే చదివాడు. తండ్రి వడ్రంగి. కుటుంబమంతా రెండు ఇరుకు గదుల్లో వుండేది. తండ్రికొచ్చే కొద్దిపాటి ఆదాయం వారి పెద్ద కుటుంబానికి చాలేది కాదు. దాంతో వాల్ట్ డిస్నీ చదువు మానేసి ఉద్యోగప్రయత్నాల్లో పడ్డాడు. ఏ ఉద్యోగం దొరక్క కొంత కాలం 'న్యూస్‌పేపర్లు' అమ్ముతూ బతికాడు.

తర్వాత అతను వాహనాలను కడిగే పని మొదలుపెట్టాడు. అలా ఆర్జించిన దానిలో కొంత మిగుల్చుకుని బొమ్మలు గీయడం నేర్చుకున్నాడతను. అతను బొమ్మలు గీయడంపై ప్రత్యేకాసక్తితో ఏ మాత్రం ఖాళీ దొరికినా బొమ్మలు ప్రాక్టీస్ చేస్తూ గడిపేవాడు.

బొమ్మలు గీయడంలో నైపుణ్యం పెరిగాక వాల్ట్ డిస్నీకి ఓ ఆర్ట్‌వర్క్ కంపెనీలో ఉద్యోగం లభించింది. కార్టూన్స్ గీయడంలో అతనికి మంచి ప్రావీణ్యం వుండేది. కారుగేరేజీల్లో పని చేస్తున్నపుడే ఓ మూలకూర్చుని బొమ్మలు గీసుకునేవాడు. అక్కడికి మరామ్మతు కోసం వచ్చే అనేక కార్లు చేసే ధ్వనులు, పెట్రోల్ వాసన, పొగ అతని ఏకాగ్రతను భంగపరిచేవి కాదు.

ఒకరోజు చిన్న ఎలుక ఒకటి గేరేజ్‌లో తిరుగుతుండటం చూశాడు వాల్ట్ డిస్నీ. వెంటనే దానిపై ఓ కార్టూన్ సృష్టించాడు. అది కాలక్రమంలో అద్భుతమైన పేరుతెచ్చుకుంది. అదే 'మికీమౌస్'. తర్వాత్తర్వాత అతను 'మికీమౌస్'పై ఓ చిత్రం కూడా నిర్మించి ఆస్కార్ అవార్డు పొందాడు.

ఆవిధంగా కార్టూన్ సినిమాలు తీస్తూ వాల్ట్ డిస్నీ క్రమక్రమంగా అత్యంత ధనవంతుడైపోయాడు. అతనికి పిల్లల్ని వినోదింపజేసే ఓ కల్పనామయ లోకాన్ని ఏర్పాటుచేయాలనే కోరిక బలంగా వుండేది. అందుకనుగుణంగా బాగా ధనం సంపాదించాక ప్రపంచ ప్రఖ్యాతమైన 'డిస్నీలాండ్', 'డిస్నీ స్టూడియో'లను నిర్మించాడు. 'డిస్నీలాండ్'తో వాల్ట్‌డిస్నీ ప్రేక్షకుల మనసుల్లో చిరస్థాయిగా నిలిచిపోయాడు.

వాల్ట్ డిస్నీ అంతగా కీర్తి శిఖరాల్ని అధిరోహించడానికి కారణం- అతను చిన్నతనం నుండీ కూడా అద్భుత విజయాల్ని సాధించాలని నిశ్చయించుకోవడమే. పేదరికాన్ని, అపజయాల్ని తన ఆశయ సాధనకు ఆటంకాలు కానివ్వలేదతను.

వాల్ట్ డిస్నీ ఎలుకలు, బాతులు, కుందేళ్లు, కుక్కలు, పందుల్లాంటి ప్రాణులు కూడా మనుషులకివలెనే పాడుతూ, ఆడుతూ, మాట్లాడుతూ ఉండేలా కల్పించి ఓ కొత్త ఒరవడిని రూపొందించాడు. చలనచిత్ర చరిత్రలో మొదటిసారిగా అడవి జంతువులన్నీ తమ సహజసిద్ధమైన పరిసరాలలో సంచరిస్తుండగా సినిమాలుతీసి ఓరకమైన విప్లవాన్ని సృష్టించాడు.

వాల్ట్ డిస్నీ సినిమాలకి అత్యధిక



సంఖ్యలో అవార్డులు లభించాయి. అతని సినిమాలు పిల్లల్ని, పెద్దల్ని సమానంగా ఆనందపరుస్తాయి. ఆ సినిమాల్ని అన్ని వర్గాల వారూ చూసి ఆనందిస్తారు.

## నగ్న మోడలింగ్

గాయత్రి అనే యువతి మద్రాసు ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలో ఆర్టు నేర్చుకునే విద్యార్థుల కోసం కొంతకాలంపాటు మోడలింగ్ చేసింది. ఆమె నగ్నంగా చిత్రకళా విద్యార్థులకోసం నిలబడినందుకు రోజుకు 16 రూపాయలు లభించేవి. ఇప్పుడామె ఆ వృత్తినుంచి విరమించుకుంది.

"రోజుకు 16 రూపాయల మొత్తం తక్కువలా అనిపించకపోవచ్చు. కానీ ఆ ఆదాయం రోజువారీ వచ్చేదికాదు. సంవత్సరానికి 20 రోజులు వస్తే గొప్పే. అదీగాక ఆ డబ్బు త్వరగా చెల్లించరు. అది ప్రభుత్వ కళాశాల గనక వాళ్ళు బిల్లు తయారుచేసి ప్రభుత్వ ఆమోద ముద్రకై పంపిస్తారు. అది మంజూరయి వచ్చేదెప్పటికో! పైగా ఆ డబ్బులుకూడా పూర్తిగా చేతికందవు. ఈ కారణంవల్ల ప్రస్తుతం ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలో 'మోడల్ గర్ల్'గా చేయడానికి ఏ యువతీ సిద్ధపడటంలేదు" అంటున్న ఆమె ప్రస్తుతం మరో వృత్తిని చేపట్టింది.

"నగ్న మోడలింగ్ గౌరవనీయమైన, సభ్యతాయుతమైన ఉద్యోగంకాదా?" అని ప్రశ్నించినవారికి "అదిగౌరవప్రదంకాదని నేను అనుకోవడంలేదు. కాని 16రూపాయల కోసం రోజంతా నగ్నంగా పోజు లిచ్చే యువతంటే జనానికి అలుసుగా వుంటుంది. పైగా నేను చాలా పేద దాన్నిగనుక వారు నా గురించి హీనంగా వూహించవచ్చు" అని చెబుతోందామె.

"చిత్రకళా విద్యార్థులలో కళా దృష్టితోనేకాక నా నగ్నదేహాన్ని కామ దృక్కులతో చూసేవారూ వుండేవాళ్ళు... అది సహజం. కాని, నాకు తండ్రిలేదు. నా కుటుంబ ఆర్థికస్థితి దీనావస్థలోవుంది. దానివల్ల 'ఇదేమీ చెడ్డవృత్తికాదు'అని నాకు నేను సర్ది చెప్పుకుని, ఇందులో చేరక తప్పలేదు" అంటుందామె.

గాయత్రి కుటుంబానికి ఆమె సంపా



వనే ఆధారం. పక్షవాతంతో మంచాన పడ్డ ఆమె తల్లికి పనిచేసేందుకు ఆస్కారమే లేదు. 21 ఏళ్ళ ఆమె సోదరుడు ఏమీ చదువుకోకపోవడంతో ఉద్యోగమేదీ దొరకలేదు. అతను బ్లాకులో సినిమా టిక్కెట్లు అమ్ముతుంటాడు. అని సంపాదన మీద ఆధారపటం ం!

"పెళ్లి చేసుకోవచ్చునుగా?" అనే నకి ఆమె, "నాలాంటి అమ్మాయికి గా అవుతుంది? నా కుటుంబ బ కూడా నన్ను పెళ్లిచేసుకున్న వా జాలపైనే పడే స్థితిలో అందుకు సిద్ధ ఎవరు ముందుకొస్తారు? నా తల్లి నాకో సంబంధాలు వెదకలేదు. మేనరికం లాంటి బంధుత్వాలేవీ లేవు. అందువల్ల నాకు ఎప్పటికైనా పెళ్లవుతుందనే నమ్మకం కూడా లేదు" అని చెబుతోంది.

## వాక్ స్కీయింగ్

నీటిపై "వాటర్ స్కీయింగ్" క్రీడను క్రితంచివ కనుగొన్నారు. కానీ, ఆ క్రీడను ప్రపంచప్రసిద్ధం చేసిన ఘనత అమెరికాలోని మిన్నిసోటాకు చెందిన రాల్ఫ్ శామ్యూల్‌కి దక్కుతుంది.

1922లో ఓసారి శామ్యూల్ రెండు దేవదారు చెక్క బల్లల ఆధారంతో 'పెనిన్ పాండ్' సరస్సులో అనుకోకుండా స్కీయింగ్ చేశాడు. ఆ అనుభవం అతనికి ఎంతో అద్భుతంగా తోచింది. అటుపై చాలా మంది అతనిలా 'స్కీయింగ్' చేయడం ప్రారంభించారు. ప్రపంచంలో మొదటి వాటర్ స్కీయింగ్ సంస్థ 1946లో జూలై 27న స్విట్జర్లాండ్‌లోని జెనీవాలో ఏర్పడింది.

మరోసారి శామ్యూల్ మొదటిసారిగా



1928లో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఫ్లోరిడాలో స్కీయింగ్ చేస్తూ ఎగిరి దుమికే 'స్కై-జంపింగ్'ను ప్రవేశపెట్టాడు. అమెరికాకి చెందిన 'వైని క్రిమిచ్' స్కై జంప్‌లో బాగా ఎత్తుకుఎగిరి ప్రపంచ రికార్డు సృష్టించాడు. 1972లో అతను 169 అడుగుల ఎత్తుకి 'స్కై-జంప్' చేశాడు. మహిళల్లో ఎత్తయిన స్కై-జంప్ చేసింది అమెరికాకి చెందిన వనితే. 1973 ఆగస్ట్ 10న పిట్స్‌బర్గ్‌లో 'లిండా కిటాంచా' 119 అడుగుల ఎత్తుకి స్కై-జంప్ చేసి రికార్డు సృష్టించింది.

1958 ఆగస్ట్ 22, 23 తేదీలలో పోర్ట్‌లాండ్‌కి చెందిన ఆర్.డి. బర్ ఆగకుండా వెయ్యిమైళ్ల దూరం స్కీయింగ్ చేసి ప్రపంచ రికార్డు సృష్టించాడు. అతను ఆస్టోరియా, పోర్ట్‌లాండ్ మధ్య గల కొలంబియా నదిలో ఆ 'స్కీయింగ్' చేశాడు. ఆ ప్రయాణానికి అతనికి 33 గంటల 27 నిముషాలు పట్టింది.

అమెరికాకి చెందిన డెన్నీ సర్కిల్ అతివేగంగా స్కీయింగ్ చేసి రికార్డ్ సృష్టించాడు. అతను 1971లో కాలిఫోర్నియాలోని 'లేక్‌లేండ్ మెరైన్ స్టేడియమ్'లో గంటకి 125.69 మైళ్ల వేగంతో స్కీయింగ్ చేశాడు. 1970లో కాలిఫోర్నియా రాష్ట్రంలో గల బ్రెరిస్ నగరంలో 17 ఏళ్ల యువతి గంటకి 105.14 వేగంతో స్కీయింగ్ చేసిన వనితగా ప్రపంచ రికార్డు సృష్టించింది.

స్కీయింగ్‌లో ఒకటికంటే ఎక్కువ సార్లు ఛాంపియన్‌షిప్‌ను అందుకున్నవాళ్లు వున్నారు. 1953-55లో ఆల్ఫ్రెడ్ మెండోసాకి స్కీయింగ్‌లో రెండుసార్లు ఛాంపియన్‌షిప్ లభించింది. అదేవిధంగా మెక్ సైడర్‌హాట్ 1968-69లో రెండుసార్లు ప్రపంచ స్కీయింగ్ ఛాంపియన్‌షిప్ పొందాడు. వెల్‌మెయి అనే మహిళ 1949,50,55లో మూడుసార్లు స్కీయింగ్ ఛాంపియన్‌షిప్ పొంది, వాటిని అంకంగా గెలుచుకున్న స్త్రీగా ప్రపంచ రికార్డు సృష్టించింది.

స్కీయింగ్ చేస్తూ గాలిపటాలు ఎగరేసే క్రీడను 'స్కై కైట్ ఫ్లై' అంటారు. దానిలో కూడా ఛాంపియన్‌షిప్ పోటీలు నిర్వహించబడతాయి. 1972 మార్చిలో న్యూజిలాండ్‌లోని మీర్ సరస్సులో స్కీయింగ్ చేస్తూ బాగా ఎత్తుకి గాలిపటం ఎగరేసి 'బిల్‌మూస్' అనే వ్యక్తి ప్రపంచ రికార్డు సాధించాడు. స్కీయింగ్ పడవ 435 హార్స్‌పవర్‌తో నడుస్తుండగా అతను 4,750 అడుగుల ఎత్తుకి గాలిపటాన్ని ఎగరేశాడు.

న్యూజిలాండ్‌కి చెందిన్ ఫ్రైవెలిన్ స్కీయింగ్ చేస్తూ ఎక్కువసేపు గాలిపటం ఎగరేసి రికార్డు నెలకొల్పాడు. 1971లో దక్షిణ ఆస్ట్రేలియాలోని పొన్ని సరస్సులో స్కీయింగ్ చేస్తూ అతను 15 గంటల నిముషాలపాటు ఆగకుండా గాలిపటాన్ని ఎగరేశాడు.

బల్ల చెక్కల ఆధారం లేకుండా కూడా స్కీయింగ్ చేయచ్చు. హెయిటీ జోన్స్ అలా మొదటిగా ఏ ఆధారం లేకుండా 61 గంటలపాటు 'వాటర్ స్కీయింగ్' చేసి రికార్డు సృష్టించాడు.

## సొంత సమాధులు

చనిపోయినవారి వారి బంధువులు సమాధి నిర్మించడం సర్వసాధారణం! కాని, దానికి విరుద్ధంగా ఎవరి సమాధిని వారు స్వంతంగా నిర్మించుకోవడం వినడానికే వింతగానే వుంటుంది!




కేరళలోని ఎర్నాకుళం జిల్లాలో అంబలూర్ అనే పట్టణంలో నివసిస్తున్న తంగప్పన్, రత్నవల్లి అనే దంపతులు తమ మృతదేహాలను సమాధి చేసేందుకు అవసరమైన రెండు సమాధులను తామే నిర్మించుకున్నారు.

వేర్వేరు జాతులకు చెందిన ఆ ఇద్దరూ ప్రేమించి పెళ్లిచేసుకున్నారు. దాంతో వాళ్లు ఆ జాతుల నుంచి వెలివేయబడ్డారు. వాళ్ల తల్లిదండ్రులకి ఆ వివాహం ఇష్టం లేదు. బంధువులు కూడా వారిని హీనంగా చూశారు. వారి నిందలు భరించలేక తంగప్పన్, రత్నపల్లి స్వస్థలాన్ని వీడి, వూళ్లు తిరుగుతూ ఆలయాలలో వుంటూ అక్కడ దొరికేది తింటూ కొంతకాలం సంచార జీవనం సాగించారు.

అలా 20 ఏళ్ల క్రితం వాళ్లు అంబలూర్ వచ్చారు. అక్కడో హరిజన కుటుంబం వారికి ఆశ్రయమిచ్చింది. వాళ్లు తాము పొదుపుచేసిన డబ్బుతో అక్కడ 3 సెంట్ల భూమి కొనుక్కొని చిన్న ఇల్లు కట్టుకున్నారు.

తంగప్పన్, రత్నవల్లి ఇద్దరూ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి భక్తులే. వాళ్లు తమ ఇంట్లో ఆ స్వామికి చిన్న మందిరాన్ని కూడా నిర్మించుకున్నారు.

సంతానంలేని వాళ్లు ఇంటిబైట మిగిలిన స్థలంలో 1980లో 750 రూపాయల ఖర్చుతో తామే రెండు సమాధులను నిర్మించుకున్నారు. ఆ సమాధులు 7 అడుగుల పొడవు, 2 అడుగుల వెడల్పు, 7 అడుగుల లోతుతో వున్నాయి.

ఆ దంపతులు అలా సంతోషంగా జీవిస్తుండగా, వాళ్లు స్మగ్లింగ్ కార్యకలాపాలలో పాల్గొంటున్నట్టు, స్మగుల్డ్ వస్తువులను ఆ సమాధులలో దాస్తున్నట్టు ఎవరో వదంతి పుట్టించారు. దాంతో



వారికి దుర్దినాలు ప్రారంభమయ్యాయి. పోలీసులు ఒక సమయమంటూ లేకుండా వచ్చి, వారిని ప్రశ్నలతో వేధిస్తూ, మనశ్శాంతిని హరించడం మొదలు పెట్టారు. కాని, వారి దగ్గిర స్మగ్లింగ్ తాలూకు వస్తువులేమీ దొరకకపోవడంతో పోలీసులకి వాళ్లు నిర్దోషులని తెలిసింది.

ప్రస్తుతం తంగప్పన్, రత్నవల్లిలు పోలీసుల వేధింపు లేకుండా ప్రశాంతంగా జీవిస్తున్నారు. అయితే ఇద్దరూ ఒకేసారి కలిసి చనిపోవాలనే ఆకాంక్షతో వాళ్లు ఆహారం స్వీకరించడం మానేసి మృత్యువు కోసం ఎదురుచూస్తున్నారు.

# ఏడాదిలో ఓ రోజు

బెంగుళూరులోని ఓ స్వచ్ఛంద సాంఘిక సంస్థవాళ్లు తమ నగరంలోని విద్యార్థుల చదువు సంధ్యలు ఏవిధంగా వున్నాయో తెల్సుకోగోరారు. ముఖ్యంగా వాళ్ల విద్యార్థులు సంవత్సరంలో కళాశాలకు ఎన్నిరోజులు హాజరయ్యేదీ తెలుసుకోవాలనుకున్నారు. ఆవిధంగా 500 మంది విద్యార్థుల్ని ఇంటర్వ్యూ చేశారు. ఒక విద్యార్థి తాను హాజరుకాని దినాలు ఈ కింది విధంగా వున్నట్టు తెలిపాడు.

సంవత్సరంలో ఆదివారాలు 52 రోజులు, ప్రభుత్వ సెలవులు 24రోజులూ కాగా, వేసవి కాలపు సెలవులు 61రోజులు, దసరా సెలవులు 30 రోజులు, క్రిస్టమస్ సెలవులు 10 రోజులు, ఇతర సెలవులు 29 రోజులు చొప్పున మొత్తం 206 శెలవులు వున్నాయి. వివాహం, వగైరా ఫంక్షన్లకి హాజరవడానికై 19 రోజులు కాలేజీకి సెలవు పెట్టాడట. కాలేజీఫంక్షన్ల వల్ల మరో 4 రోజులు సెలవులు వచ్చాయట. 28 రోజులు సిక్‌లీవట. పిక్నిక్కు, పార్టీల్లాంటి వాటికోసం 5 రోజులు సెలవు. బెంగుళూరు బంద్ వల్ల ఒకరోజు సెలవు లభించిందట. అనుకోని అనారోగ్యం వల్ల మరో 28 రోజులు మానేశాడట. కాలేజీలో స్ట్రైకు జరిగి 40 రోజులు కాలేజీ లేదట. బస్ తప్పిపోవటం వల్ల 6 రోజులు కాలేజీ మానేశాడట. 19రోజులు క్లాసులెగ్గొటి తిరిగాడట. బస్ డ్రైవర్ల స్ట్రైకు వల్ల 5 రోజులు కాలేజీకి వెళ్లడం కుదరలేదట. 3 రోజులు క్లాసులు జరగలేదట. ఇవన్నీ లెక్కవేస్తే అతను ఆ సంవత్సరం కాలేజీకి వెళ్లని రోజులు మొత్తం మీద 364 రోజులు!

అంటే 365 రోజులు గల సంవత్సరంలో ఆ విద్యార్థి కాలేజీకి హాజరైంది ఒకేఒక్కరోజన్నమాట!

# మహిళా సంస్కరణ

బొంబాయికి చెందిన యమ్. యల్. సి. వినోద్‌గుప్తా 'సౌతన్' అనే స్వచ్ఛంద సేవాసంస్థను ఏర్పరచి, బొంబాయిలో వ్యభిచారవృత్తికి నిలయమైన రెడ్‌లైట్ ప్రాంతాలలోని యువతులను రక్షించి, వారికి కొత్త జీవితం కల్పిస్తున్నాడు. వేశ్యా జీవితంలోంచి బైటపడిన 10 మంది యువతులకి వివాహాలు జరిపి, వారికి పునర్జన్మ ప్రసాదించింది సంస్థ. గుప్తా భార్య కళావతి భర్తకు పూర్తి సహకారాన్ని అందిస్తూ, ఆ అభాగ్య యువతులను తల్లిలా ఆదరిస్తుంది.

జయశ్రీ అనే యువతి హైదరాబాదులో ఓ గౌరవనీయమైన కుటుంబంలో పుట్టి పెరిగింది. 20 ఏళ్ల ఆమె ఓ యువకుడితో ప్రేమలోపడింది. అతన్ని గుడ్డిగా నమ్మి ఇల్లు వదలి వచ్చేసింది. ఆ మోసగాడి వల్ల చివరికామె బతుకు బొంబాయిలోని రెడ్‌లైట్ ప్రాంతంలో వ్యభిచారవృత్తిలోకి దిగజారింది.

ఒకసారి ఆమె బొంబాయిలోని జెన్సన్స్ హోటల్‌కి విటుడితోపాటు వచ్చింది. ఆ హోటల్ మేనేజర్ బన్వర్ లాల్‌కి ఆమె దీనగాథ తెల్పింది. సౌతన్ సంస్థ ద్వారా జయశ్రీ వేశ్యావృత్తి నుంచి బైటపడింది. బన్వర్‌లాల్ ఆమెను పెళ్లిచేసుకుని కొత్త జీవితాన్ని ఇచ్చాడు.

అదేవిధంగా రామ్ దయాల్‌రాయ్ 3 వేల రూపాయలు చెల్లించి గుజరాత్‌కు








చెందిన గీత అనే వేశ్యను పెళ్లాడాడు. ఆ పెళ్లికి అన్ని ఏర్పాట్లూ చేసింది 'సౌతన్' సంస్థయే! అతను బొంబాయిలోని ఓ ప్రముఖ వ్యక్తి కొడుకు. గీతను రెడ్‌లైట్ ప్రాంతం నుంచి బైటకు తీసుకురావడానికి శాయశక్తులా ప్రయత్నించాడు. చాలాసార్లు పోలీసుల సహాయం కోసం వెళ్లాడు. కాని, వారి నుంచి సరైన సాయం లభించలేదు. దాన్ని బట్టి బొంబాయి పోలీసులకి వ్యభిచార వృత్తితో లావాదేవీలు వున్నట్టు గ్రహించాడు. చివరికతను 3 వేల రూపాయలు చెల్లించి 'సౌతన్' సంస్థ సహాయంతో గీతను రక్షించాడు.

"చాలామంది పెద్దవారికి, రాజకీయ నాయకులకి రెడ్‌లైట్ ప్రాంతాలతో సంబంధం వుండటంతో, పోలీసులు ఈ వృత్తిని అణచిపెట్టేందుకు జంకుతున్నారు. పైగా ఈ వృత్తి నిర్వహించేవారి నుంచి పోలీసులకి పెద్దమొత్తాలు లంచంగా అందడంతో, వాళ్లు ఏమీ పట్టనట్టు చూస్తూ వూరుకుంటున్నారు. అందుకే మేము మరొకరి సహాయం కోసం ఎదురుచూడకుండా, ఈ వృత్తిలోని యువతులను రక్షించాలని నిర్ణయించుకున్నాం" అని చెబుతుంటాడు గుప్తా.

## సంపాదకుని ఘనత

లండన్‌లో ప్రచురింపబడే 'ది టైమ్స్' ప్రపంచంలోని ప్రధానమైన దినపత్రికలలో ఒకటి. ఆ దినపత్రిక మాజీ సంపాదకుడైన హెరాల్డ్ ఇవాన్స్‌కి పత్రికారంగంలో బ్రహ్మాండమైన స్థానం వుంది. అతను పత్రిక తన సంపాదకత్వంలో వున్నప్పుడు, లండన్‌లో ప్రసిద్ధులైనవారి గుట్టుమట్టులన్నీ బైటపెట్టే వార్తలనెన్నిటినో ప్రచురించేవాడు.

ఇవాన్స్‌కి పత్రిక యజమాని అయిన లార్డ్ థాంసన్ సంపూర్ణ స్వేచ్ఛ ఇచ్చేవాడు. అతను పత్రిక ఎడిటోరియల్ పాలసీలో జోక్యం చేసుకునేవాడు కాదు. తమ పత్రికలోని వార్తలవల్ల పాలకపక్షంలోని వాళ్ళు ఆగ్రహిస్తారేమోనని గానీ, ప్రకటనలపై వచ్చే ఆదాయం తగ్గిపోతుందేమోననిగానీ థాంసన్ ఆందోళన పడేవాడు కాదు.

ఇవాన్స్ ఒకసారి రష్యా రహస్య ఏజెంట్ అయిన కిమ్‌ఫిల్బీ తమ దేశంలో నిర్వహిస్తున్న గూఢచారి కార్యకలాపాల గురించిన ఓ కథను విపరంగా ప్రచురించడంతో బ్రిటిష్ సీక్రెట్ సర్వీస్‌వాళ్ళ అసమర్థత ప్రపంచమంతటికీ తెలిసింది.

ఆ వివరాల సేకరణలో 15 మంది




విలేకరులు రేయింబవళ్లు విశ్రాంతి లేకుండా పనిచేశారు. వాళ్ళకి జీతం కాకుండా, ఓవర్ టైమ్ వగైరాల రూపంలో దాదాపు లక్ష రూపాయలు ఖర్చయింది.

'థాలిడోమైడ్' అనే ట్రాంక్విలైజర్ గురించి కూడా ప్రముఖంగా ప్రచురించి సంచలన కారకుడయ్యాడు ఇవాన్స్. ఈ హానికరమైన 'థాలిడోమైడ్' మందును ఇంగ్లండులోని అతి పెద్దదైన 'డ్రగ్ కంపెనీ డిస్టిల్లర్స్' వారు తయారు చేస్తున్నారు. ఆ కంపెనీ న్యాయవాదులు కోర్టులో కేసువేసి ఇవాన్స్‌ని భయపెట్టబోయారు. నిర్భయుడైన ఇవాన్స్ దానికి జంకకుండా ఆ వ్యవహారాన్ని కోర్టులోనే తేల్చుకోదలుచుకున్నాడు. ఆ కోర్టు గొడవకి 'ది టైమ్స్' యాజమాన్యం ఇవాన్స్ కోసం 1 లక్ష 50 వేల పౌండ్లు ఖర్చుపెట్టవలసి వచ్చింది. అయినా అందుకు లార్డ్ థాంసన్ ఏమాత్రం బాధపడలేదు.

ఆతర్వాత ఇవాన్స్ లార్డ్ థాంసన్‌కి దగ్గరి బంధువైన లార్డ్ వెస్టర్ అనేక మాయోపాయాలతో పన్నులు కట్టకుండా ఎలా తప్పించుకుంటున్నదీ 'ది టైమ్స్'లో బయల్పరచాడు. ప్రిన్స్ ఛార్లెస్‌తో 'పోలో' ఆడే చాలామంది గొప్పవాళ్ళు కూడా పన్నులు ఎగ్గొడుతున్నట్లు వెల్లడి చేశాడు. దీన్ని కూడా లార్డ్ థాంసన్ పట్టించుకోలేదు. అలాంటి సమయంలో 'ది టైమ్స్'ని రూబర్ ముర్డక్ అనే అత్యంత ధనికుడైన పారిశ్రామికవేత్త కొనేయడంతో ఇవాన్స్‌కి మంచిరోజులు చెల్లిపోయాయి. ముర్డక్, అతని కుమారుడు ఎడిటోరియల్ పాలసీలో జోక్యం చేసుకుని, ఇవాన్స్‌పై అజమాయిషీ ప్రారంభించారు. అది భరించలేని ఇవాన్స్ తన ఉద్యోగానికి రాజీనామా చేశాడు.

ప్రస్తుతం ఇవాన్స్ తన అనుభవాలను క్రోడీకరించి 'గుడ్ టైమ్స్, బాడ్ టైమ్స్' అనే పేరుతో తన రచనలలో 'మాస్టర్ పీస్' అనదగ్గ పుస్తకాన్ని రాశాడు. అది ప్రచురణ రంగాన్ని కుదిపేసింది.

## కవల అలవాట్లు

'మన అలవాట్లు, ఇష్టాయిష్టాలు ఎలా రూపుదిద్దుకుంటాయి? అవి వంశపారంపర్యంగా వస్తాయా? లేక కేవలం పరిసరాల ప్రభావం వల్లనే ఏర్పడతాయా?' అనే ప్రశ్నలకు సమాధానం కోసం




అమెరికాలోని మిన్నిసోటా విశ్వవిద్యాలయం పరిశోధనకు పూనుకుంది.

ఆ పరిశోధనకు కొత్తగా పుట్టిన అనేక మంది కవల పిల్లల్ని ఎన్నుకున్నారు. ఆ పిల్లలను వేర్వేరు చోట్ల పెంచేటట్టు తల్లిదండ్రులను ఒప్పించారు. ఇందు కోసం కవల సోదరులైన జిమ్ లూయీస్, జిమ్ స్ప్రింగర్‌లను పుట్టినప్పుడే వేరుచేశారు. ఇద్దరినీ దూరదూరంగా వున్న రెండు నగరాలలో వేర్వేరు ఇళ్లలో పెంచారు. పెళ్లీడు రాగానే ఇద్దరూ పెళ్లిళ్లు చేసుకున్నారు. ఇద్దరి భార్యల పేర్లూ 'లిండా'యే. కొంతకాలం తర్వాత ఇద్దరూ తమ భార్యలకు విడాకులిచ్చారు. మళ్లీ పెళ్లిచేసుకున్నప్పుడు ఆ అన్నదమ్ముల భార్యల ఇద్దరి పేర్లూ బెట్టియే.

వారి మధ్య పోలిక ఈ ఒక్క విషయంలోనే కాదు – వారి అలవాట్లు, ప్రవర్తన కూడా ఒకేలా వున్నాయి. ఇద్దరికీ గోళ్లు కొరికే అలవాటుంది. ఇద్దరూ ఒకే బ్రాండు సిగరెట్లు కాలుస్తారు. వారిద్దరికీ కుక్కలంటే చాలా ఇష్టం. వాళ్లిద్దరూ తాము పెంచిన కుక్కలకి 'టాయ్' అన్న పేరే పెట్టారు. ఇద్దరూ స్కూల్లో చదివేటప్పుడు గణితశాస్త్రంలో ప్రవీణులే! చదువు పూర్తయాక ఇద్దరూ పోలీస్ ఆఫీసర్లై ఆ పదవిలో మంచిపేరు గడించారు.

గత 39 ఏళ్లుగా ఆ కవలల జీవితాల్ని పరిశీలిస్తున్న మిన్నిసోటా యూనివర్శిటీ వాళ్లు పై ఆసక్తికరమైన విషయాలను వెల్లడించారు!

## నవ్వుల క్లబ్

"మీరు నవ్వుతుంటే మీతోటివాళ్లు కూడా మీతో కలుస్తారు. అదే ఏడుపు అయితే, మీరు ఒంటరిగానే ఏడ్వాల్సి ఉంటుంది'' అంటాడు 'నవ్వుల క్లబ్' సంస్థాపకుడైన నరసింహమూర్తి. జనాన్ని వీలైనంతగా నవ్వించడమే అతని 'నవ్వుల క్లబ్' ఆశయం!

మూర్తి 1976లో బెంగుళూరులో ఈ నవ్వుల క్లబ్‌ని స్థాపించాడు. ఇప్పుడా క్లబ్‌కి మద్రాస్, షిమోగా, కాన్పూర్,

బెంగుళూరులలో బ్రాంచీలున్నాయి. ఆ క్లబ్ ప్రసిద్ధి దినదినాభివృద్ధి చెందుతోంది.

నవ్వుల క్లబ్ ప్రతి బ్రాంచిలోనూ వేలాది మంది సభ్యులున్నారు. వారిలో ఎక్కువమంది మధ్యతరగతి కుటుంబాలకు చెందినవారు. ఉద్యోగ, వ్యాపారాల నుండి రిటైరయ్యాక ఈ క్లబ్‌లో చేరిన వృద్ధ సభ్యులు కూడా వున్నారు. మంచి సెన్సాఫ్ హ్యూమర్ కలిగిన ఎంతోమంది



కళాశాల విద్యార్థులు, ప్రొఫెసర్లు సైతం ఈ క్లబ్‌లో సభ్యులుగా వున్నారు.

నరసింహామూర్తి స్వతహాగా మంచి హాస్యప్రియుడు. వృత్తిరీత్యా బెంగుళూర్‌లోని 'ఇంటర్నేషనల్ కెమికల్ అండ్ బయోలాజికల్ ఇన్‌స్ట్రుమెంట్స్ లిమిటెడ్'లో డైరెక్టరు. తన ఆఫీసు గోడలపై నవ్వుపుట్టించే బొమ్మలు, కార్టూన్లూ ఎన్నో పెట్టించాడు. మూర్తి అనేక హాస్య నాటికలు రాయడమే కాక వాటిలో స్వయంగా నటిస్తాడు కూడా!

ముందుగా నిర్ణయించిన ఓ ఆదివారం గాని, ఓ సెలవు రోజున గాని ఆ క్లబ్ సభ్యులు ఒక హాలులో చేరతారు. ముందు అధ్యక్షుడు మాట్లాడిన తర్వాత, సభ్యుల్లో ఒక్కొక్కరూ వేదిక ఎక్కి, తాను విన్న లేదా చదివిన కొత్త జోక్‌ని అందరికీ చెబుతారు. జోక్స్‌తో పాటు ఆసక్తికరమైన సంఘటనలు కూడా చెప్పి మిగిలిన సభ్యుల్ని ఆనందడోలికల్లో వూగిస్తారు.

"ఈ నవ్వుల క్లబ్‌ని దేశమంతటా విస్తరింపజేయాలనుకుంటున్నాను. మనలో హాస్యం బాగా పెంపొందాలి. ఆఫీసులు, ఇళ్లు నవ్వులతో నిండిపోవాలి" అని కోరుకుంటున్నాడు నరసింహామూర్తి!

## బ్రహ్మచార్ల గ్రామం

**1978** నాటికి చైనాలో ఒక గ్రామంలోని యువకులందరూ పెళ్లి కాకుండా బ్రహ్మచారులుగానే వుండిపోయారు. తగినంత ఆదాయంలేక, తమకు తామే భారం కావడం ఇష్టంలేక వాళ్లంతా పెళ్లి మానుకున్నారు.

సింగ్‌చక్ గ్రామం 'ఎల్లోరివర్' అనే నది ఒడ్డున వుంది ఆ గ్రామం చుట్టుపక్కల గల భూముల్లో అధిక భాగం లవణ మిశ్రమమై వుండటంతో, అక్కడ పంటలేవీ పండవు.

అందువల్ల ఆ గ్రామంలోని యువతులు

పెళ్లికి మరో గ్రామంలోని యువకుల్ని ఎంచుకుంటున్నారు. ఇతర గ్రామాల వాళ్లు ఆ వూరి యువకునికి తమ పిల్లను ఇవ్వడానికి సిద్ధపడటం లేదు. దాంతో అక్కడి యువకులంతా బ్రహ్మచారులుగా వుండిపోతున్నారు. ఆవిధంగా ఆ గ్రామానికి 'బ్రహ్మచార్ల గ్రామం' అనే పేరు వచ్చింది.

కాని, 1979లో చైనా పెద్దయెత్తున కుటుంబ సంక్షేమ పథకాన్ని ప్రవేశ పెట్టింది. సింగ్‌చక్ గ్రామవాసులు ఆ పథకానికి మంచి వూపు ఇచ్చారు. దాని ప్రకారం గ్రామంలోని యువతీ యువకులంతా బాగా శ్రమించి పనిచేయడంతో ఆ గ్రామ పరిస్థితిలో క్రమక్రమంగా మార్పు వచ్చింది. మొక్కలవీ పెరిగి, పంటలతో ఎక్కడ చూసినా పచ్చదనం కన్పించసాగింది.

హరిత విప్లవం గ్రామాన్ని అలా మార్చివేయడంతో, చాలాకాలం క్రితం ఆ వూరిని వదిలి వెళ్లిపోయినవాళ్లంతా తిరిగిరాసాగారు. అక్కడి పేదరికాన్ని భరించలేక వాంగ్‌జిందే అనే యువకుడు 1976లో ఆ గ్రామంలోంచి వెళ్లిపోయాడు. కాని, 1979లో అతను సంతోషంగా తన స్వగ్రామానికి తిరిగొచ్చాడు. తిరిగిరావడమేకాక అతను ఓ యువతిని వివాహమాడాడు కూడా. ఆ గ్రామంలో గత పదేళ్ల కాలంలో జరిగిన పెళ్లి అదొక్కటే! వాళ్లిద్దరూ హాయిగా కాపురం చేసుకుంటున్నారు.

వాంగ్ పెళ్లితో మరికొన్ని వివాహాలకి ఆస్కారం కలిగింది. ఆవిధంగా వరుసగా 57 పెళ్లిళ్లు జరిగాయి.

## షియా వెన్న

నిజం కల్పన కంటే అద్భుతంగా వుంటుంది. చెట్లనుంచి వెన్న, పాలు ఉత్పత్తి అవడమనేది అలాంటి అద్భుతమే.

పెరాగువే దేశంలో "గర్డిల్లా" అనే గ్రామంలో ఓ వింత రకమైన చెట్టు వుంది. ఆ చెట్టునుంచి అచ్చం మనం వాడే పాలకు మల్లేనే వుండే రసం వస్తుంది. ఆ చెట్టు పొడి నేలలు, ఎడారి ప్రాంతాలలో పెరుగుతుంది. మిగిలిన చెట్లు ఎండిపోయినా



ఈ చెట్టు ఆకుపచ్చగానే వుండి, పాలు ఇస్తుంది.

వెన్న ఇచ్చే చెట్టు పశ్చిమాఫ్రికాలో వుంది. ఈ చెట్టు వెన్నకు మల్లేనే వుండే పదార్థాన్ని స్రవిస్తుంది. ఆవిధంగా ఉత్ప

త్తయ్యే వెన్నను 'షియావెన్న' అంటారు. చెట్టు బెరడును వొలిచినప్పుడు ఈ వెన్న వస్తుంది. ఇప్పుడు అక్కడి వినియోగదార్లలో 'షియావెన్న' వాడకం ఎక్కువైంది. దాని కోసం బాగా ఎగబడుతున్నారు కూడా.

సెంట్రల్ అమెరికా, లాటిన్ అమెరికా ప్రాంతాలలో పెరిగే కాక్టస్ అనే మొక్క 'వైను'లాంటి రుచి, వాసనగల ద్రవ్యాన్ని స్రవిస్తుంది. ఆ మొక్క కొమ్మలు విరిగినప్పుడు దానికుండే చిన్నచిన్న తొర్రలలో ఈ రకమైన వైను లభిస్తుంది. అందుకే అక్కడివాళ్ళంతా ఈ మొక్కలను అధికంగా నాటుతారు కూడా.

## రోమ సంపన్నులు

"శరీరమంతా రోమమయంగా వుండేవాళ్ళు మానవులకి పూర్వీకులైన వానరాలకు 'ట్రూ-కాపీ' లాంటి వాళ్ళు" అని పేర్కొంటున్నాడో శాస్త్రవేత్త!

నూరేళ్ళ క్రితం పుట్టిన 'జోజో' అనే బాలుడు చూడ్డానికి శునకంలా వుండేవాడు. అతనికి అసాధారణమైన లక్షణాలెన్నో వుండేవి. అతను అనేక భాషల్లో మాట్లాడగల్గి, చదవగల్గి వుండేవాడు. కాని, అతనికి పళ్ళుమాత్రం కొన్నే వుండేవి. 1884లో బి.టి. బర్న్ సర్కస్‌లో ఈ 'జోజో' ప్రధానమైన ఆకర్షణగా వుండేవాడు. ఆ వృత్తిలో అతను లక్షలాది రూపాయలు సంపాదించాడు.

'లియోనెస్' అనునతని ముక్కునుంచి కూడా జుట్టు వేలాడుతుండేది. మొహం చూడ్డానికి సింహంలా వుండేది. వింతేమిటంటే అతను నిజంగా సింహంలానే గర్జించేవాడు. తన మొహం అలా వుండటానికి కారణంగా అతనో గమత్తయిన కథ చెబుతుండేవాడు.

"లియోనెస్ ఇంకా తల్లి కడుపులోనే వున్నప్పుడు ఓసారి ఆమె చూస్తూండగానే తన తండ్రిని ఓ సింహం మింగేసిందట. ఆవిధంగా షాక్ తిన్న ఆమె బిడ్డను కందట! అందువల్ల 'లియోనెస్' సింహం మొహంతో పుట్టాడట!"

ఓ సర్కస్‌లో పనిచేసే 'జూలియా బస్త్రానా' ప్రపంచంలోకెల్లా అందవిహీనమైన స్త్రీ. ఆమె మెక్సికోలో పుట్టింది. జూలియాకు 'గొరిల్లా'కు మల్లే శరీరమంతా రోమమయంగా వుండేది. ఆమె చెవులు, నాసికా పుటాలు పెద్దగావుండేవి. ఆమె ఎత్తుమాత్రం చాలా తక్కువ. నాలుగున్నర అడుగుల ఎత్తుతో చూడ్డానికి ఆడ గొరిల్లాలానే వుండేది.

సర్కస్‌కొచ్చే ప్రేక్షకుల్లో జూలియాకు ఎంత పాపులారిటీ వుండేదంటే, ఆమె మరో సర్కస్ కంపెనీలో మంచి అవకాశం వస్తే వెళ్ళిపోకుండా ఆ సర్కస్ యజమాని ఆమెను పెళ్ళాడేసేడు.

అసహజంగా రోమాలు పెరిగే ఈ 'హైపర్-ట్రైకోసిస్'కి కారణాన్ని, దాన్ని నివారించే మందుని శాస్త్రవేత్తలు ఇంకా కనుగొనలేదు!

## అదొక వృత్తి

వేల్‌మురుగన్ గత 25 ఏళ్ళ నుంచి మద్రాసులోని మైలాపూర్ దగ్గరి స్మశానంలో శవదహనం చేసే వృత్తిలో వున్నాడు.

"ఇది మా కుటుంబ వృత్తి. మేము మూడు తరాల నుంచీ ఈ వృత్తిలో వుంటున్నాం" అని చెబుతున్నాడతను.





"నేను చిన్నతనంలో కొంతకాలం బడికి వెళ్ళినవాడినే! కాని, తర్వాత బడి ఎగ్గొట్టి వచ్చేసి శవదహనం చేస్తుండే మా నాన్న దగ్గిర కూర్చుని కాలుతున్న శవాల్ని చూస్తుండేవాడిని. దీనికి అల వాటుపడిపోయిన మాకు భయం గానీ వికారాలుగానీ వుండవు. వంశపారం పర్యంగా ఈ వృత్తిలో వున్నవాళ్ళేతప్ప ఇతరులెవరూ ఇందులోకి రారు. మేము శవదహనం చేయడానికి ఎలా కష్టపడ తామో, ఎవరైనా అర్ధరాత్రిపూట ఇక్క డికి వచ్చి మాతో కూర్చుని చూస్తే తెలుస్తుంది" అంటూ –

"మేము ఒక్కొక్కప్పుడు పాడైపోయిన శవాల్ని కూడా దహనం చేయాల్సి వుంటుంది. ఉబ్బి దుర్భరమైన దుర్గంధంతో ముక్కు బద్దలుగొట్టే శవాలు కొన్ని వస్తుంటాయి. మేము అంతా భరించి వాటిని దహనం చేసి, మరుసటిరోజు అస్థికలు ఏరాల్సి వుంటుంది. మాకు శవ దహనం గురించి బోధించే బడి ఏదీ వుండదు. అది మాకు వంశానుగతంగా వచ్చేస్తుంది" అని తమ వృత్తిలోని సాధక బాధకాల్ని వివరించాడు వేల్‌మురుగన్.

"దహనానికి ఒక్కొక్క శవానికి 100 రూపాయల రుసుము తీసుకో వల్సింది"గా ఓ బోర్డువారు నిర్ణయించారు. ఆరేటు నిర్ణయించింది 81లో. ఆ 100 రూపాయలూ మాకు మిగిలేవి కావు. దహ నానికవసరమయ్యే కట్టెలు, తదితర మైనవాటికి ఆ వందలోనే ఖర్చుపెట్టాలి. చివరికి మాకు 10 రూపాయలు మిగలడం కూడా కష్టమే అవుతుంది. అందుకే మేము ఇక్కడికి వచ్చినవారిని 'టిప్'గా ఏమైనా ఇవ్వమని కోరతాము. ఆవిధంగా అర్థిస్తామే తప్ప వత్తిడిచేయం"

"నా పాతికేళ్ళ సర్వీసులో నేను డా.రాధాకృష్ణన్, వి.వి.గిరి, యం.జి.ఆర్. తల్లి లాంటి చాలామంది ప్రముఖ వ్యక్తు లను కూడా దహనం చేశాను" అని మరో విశేషం తెలిపాడతను.

"ఈ ఉద్యోగంలో వున్నవారిని 'మేస్త్రీ'లంటారు. నేను 'మేస్త్రీ'లకు పెద్దని. ఇప్పటికి కూడా మాకు నికర మైన జీతం లభించే ఏర్పాటు జరగలేదు.

"మేము ఎన్నో విధాలుగా నిర్లక్ష్యా నికి గురయినవాళ్ళం. ఈ వృత్తిలోకి సులువుగా వచ్చిన వాళ్ళంకాదు. దీనిలో చేరడానికి చాలా కష్టపడితే గాని దొరకని 'కార్పొరేషన్ లైసెన్స్' సంపాదించాలి. కలరా, మశూచి నిరోధక టీకాలు వేసు కున్నట్టు నిరూపించే సర్టిఫికెట్లు అంద జేయాలి. దీనికోసం చాలా డబ్బు ఖర్చు పెట్టాలి.

"మా బతుకుతెరువు నమ్మకం లేనిది. కొన్నిసార్లు అసలు శవాలే రావు. ఒక్కొక్కరోజు పది శవాల వరకూ వస్తుంటాయి. మేము రాత్రంతా శవదహనం వల్ల పుట్టే విషపూరితమైన గాలుల్ని పీలుస్తూ గడపాల్సిందే.

"ఇన్ని ఇబ్బందులు పడుతున్నా మాకు గుర్తింపనేదే లేదు. ఏ ఒక్క ప్రభుత్వమూ మా గురించి పట్టించుకోదు. మేము ఎంత పేదరికంలో మగ్గుతున్నా మంటే – రేపు నేను చనిపోతే నన్ను దహించడానికి 100 రూపాయలైనా ఇన్నేళ్ళలోనూకూడబెట్టుకోలేకపోయాను" అంటూ వాపోతాడు వేల్‌మురుగన్!

## జంతు జ్యోతిష్యం

నేడు మనకు వాతావరణ సూచన లందించే అత్యంతాధునిక పరికరాలతో

కూడిన వాతావరణ పరిశోధనా కేంద్రాలున్నాయి. కాని, పూర్వం గ్రామీణ ప్రజానీకం ఎలాంటి పరికరాల సహాయం లేకుండా వాతావరణంలో రానున్న మార్పుల్ని ముందే కనిపెట్టేవారు. ఇలా వాతావరణ మార్పుల్ని చెప్పగలిగే కళను గ్రామవాసుల్లో ఒక తరంనుంచి మరో తరం అలవర్చుకొనేది.

రాబిన్ బెగ్ అనే ఆయన 'గ్రామీణ పద్ధతిలో వాతావరణ సూచన,అనే పుస్తకం ఒకటి రాశాడు. అందులో 'పూర్వీకులు వన్యప్రాణుల, పెంపుడు జంతువుల ప్రవర్తనను పరిశీలించి, వాతావరణంలో రానున్న మార్పుల్ని వూహించేవారు- అని రాశాడు. ఈరోజు వర్షం కురుస్తుందా? ఎండ కాస్తుందా? తుఫానులాంటి విపరీతాలేమైనా వుంటాయా? – అనేది వాటిని బట్టే చెప్పగలుగుతుండేవారట.

రాబిన్ చాలా చిన్నవయసు నుంచి గ్రామాల్లోనే నివసించాడు. అందువల్ల అతను తన ప్రత్యక్షానుభవాలను క్రోడీకరించి ఈ పుస్తకంలో పొందుపరచాడు.

ఉరుముల ధ్వని మనిషి చెవులకి వినబడక ముందే, ఆకాశం ఉరమబోతున్నట్టు కుక్కలు గ్రహించగలవు. అలాంటి సమయాలలో కుక్కలు చాలా వింతగా ప్రవర్తిస్తాయి.

అదేవిధంగా పందులు తుఫాను ఉనికిని చాలా ఖచ్చితంగా వూహించగలవు. సముద్రంలో తుఫాను సంభవించబోతున్నట్టు ముందుగానే గ్రహించి అశాంతిగా కలియతిరుగుతూ, దగ్గరలో ఏదైనా పొట్టు పోగుపడి వుంటే అవి దానిపైకి దుముకుతాయి.

ఆవులు కూడా వాతావరణంలోని



మార్పుల్ని ఖచ్చితంగానే కనిపెట్టగలవు. ఆవు చెవుల్ని జాడిస్తూ, వాటిని గోడలకి గాని, తలుపులకి గాని రుద్దుకొందంటే చినుకులతో కూడిన వర్షం పడుతుందన్నమాట. ఆవు తన తోకను అశాంతిగా వూపుతుంటే– ఉరుములు మెరుపులతో కుండపోతగా వర్షం కురవనున్నదని సూచన.

కుందేళ్లు తమ కలుగుల్లోంచి కంగారుగా బైటకొస్తే వర్షం రానున్నదని అర్థం. వర్షాన్ని సూచించడానికి లేళ్లు చాలా పొద్దున్నే పచ్చిక తినడం మొదలుపెడతాయి. గాడిదలు దుర్భరంగా ఓండ్రపెడతాయి. పిల్లులు చెవుల్ని వెనక్కి పెట్టి నిలబడతాయి.

కోకిల చెట్టు చిటారుకొమ్మపై కూర్చుని కూస్తే వాతావరణం చక్కగా వున్నట్టు, కోకిల తన తోకను ఆకుల వెనుక దాచుకుంటే వాతావరణం ప్రతికూలంగా మారనున్నట్టు అర్థంచేసుకోవచ్చు. ఆహారాన్వేషణకు వెళ్లిన బాతులు, కాకులు కంగారుగా గూళ్లకు బైలుదేరితే వరాలు కురవబోతున్నట్టు అర్థం!







చతుర క్లిక్ షీట్

# అణ్వాయుధ విధ్వంసం

పూర్వం అర్జునుడు పాశుపతాస్త్రం కొరకు శివుని గురించి తపస్సు చేశాడు. అతని బలాన్ని పరీక్షించిన తరువాత శివుడు అర్జునుడికి పాశుపతాస్త్రాన్ని వరంగా ప్రసాదించాడు. బ్రహ్మాస్త్రం కంటె కూడా ఎక్కువ ప్రభావంగల పాశుపతాస్త్రం ప్రయోగిస్తే శత్రుశేషం ఉండదని నానుడి. బ్రహ్మాస్త్రం, పాశుపతాస్త్రం, వాయవ్యాస్త్రం వంటి ఆయుధాలను పురాణయుగపు రాజులు ప్రయోగించినట్లు రామాయణ, మహాభారత కథల్లో ఉన్నా అంతటి ప్రభావంగల మారణాయుధాలు ఆకాలంలో ఉన్నాయంటే నమ్మశక్యంగాదు.

అయితే ఆధునిక యుగంలో అటువంటి శక్తిగల మారణాయుధాలను తయారు చేస్తున్నారు. అణ్వాయుధాలు ఈ కోవకు చెందినవే. పరమాణు శక్తిని 50 సంవత్సరాల క్రితమే భౌతిక శాస్త్రవేత్తలు కనుగొన్నారు. 1932లో జేమ్స్ చాండ్‌విక్‌కు పరమాణుశక్తిని కనుగొన్నందుకు 1935లో భౌతికశాస్త్రంలో నోబుల్ బహుమతి లభించింది.

పరమాణు నిర్మాణంలో మూడు ముఖ్యమైన అంతర్భాగాలున్నాయి. వాటిలో రెండు విద్యుచ్ఛక్తితో ప్రభావితమైనవి. విద్యుత్ ప్రభావితమైన అణువులను ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు అంటారు. విద్యుత్ ప్రభావితం కాని అణువులను 'న్యూట్రాన్లు' అంటారు. న్యూట్రాన్‌లో హైడ్రోజన్ ఉంటుంది. హైడ్రోజన్ అణువు వ్యాసం అంగుళంలో 0.000,000,005 వంతు వుంటుంది. పరమాణువు 'ప్రోటియమ్'తో కూడివుంటుంది. దాని వ్యాసం హైడ్రోజన్ అణువు వ్యాసంలో 10,000 వంతు కూడివుంటుంది. పరమాణువుని విచ్ఛిన్నం చేయటంవలన అనంతమైన శక్తి ఉత్పన్నమవుతుంది. ఆ శక్తి 'షాక్‌వేవ్'గా మారి దానిలో కొంత భాగం కాంతిగా మారుతుంది. 1950 ప్రారంభంలో అమెరికా భౌతికశాస్త్రవేత్తలు 'ఫ్యూషన్' బాంబుని రూపొందించారు. దానిని ప్రయోగించినప్పుడు దానిలోని న్యూట్రాన్లు శత్రువులకే హాని కలుగజేసేవి. స్థిరమైన ఇతర వస్తువులకు ఎలాంటి నష్టాన్ని కలుగజేసేవి కావు.

1958లో అమెరికా భౌతిక శాస్త్రవేత్త సామ్యూల్‌కోహెన్ న్యూట్రాన్ బాంబుని కనిపెట్టాడు. ఆయనే చిన్న




ఓ అరడజను న్యూట్రాన్ బాంబులు, డజను హైడ్రోజను బాంబులు ప్రసాదించు స్వామీ !!

SIVA PRASAD

తరహా హైడ్రోజన్ బాంబుకి కూడా రూపకల్పన చేశాడు. అమెరికాలోని లివర్ మూర్ అణుశక్తి పరిశోధనా కేంద్రం హైడ్రోజన్ బాంబు, న్యూట్రాన్ బాంబులపై పరిశోధనలు జరిపింది. న్యూట్రాన్ బాంబు తయారుచేసే ప్రాజక్టుని 'డబ్ల్యు 63' అనే కోడ్‌తో వ్యవహరించారు. 1963 వసంతరుతువులో న్యూ మెక్సికో ఎడారిలో ఈ న్యూట్రాన్ బాంబుని ప్రయోగించటంతోపాటు లివర్ మూర్ అణుకేంద్రంలో అనేక రకాల అణ్వాయుధాలపై ప్రయోగాలు చేశారు. అందువలననే న్యూట్రాన్ బాంబు తయారుచేసే పథకానికి అప్పట్లో అంతగా ప్రాముఖ్యత నివ్వలేదు. అమెరికా సైనిక దళాల కేంద్రమైన పెంటగాన్ సైనిక అధికారులు 'ఏంటీ బ్యాలిస్టిక్ మిస్సైల్' ఆయుధాలపైనే ఎక్కువ మోజు చూపారు. అయితే తరువాత ఆ ఆయుధాల వలన కలిగే పరమాణు శక్తి దుష్ఫలితాలను తెలుసుకున్నారు. న్యూట్రాన్ బాంబు ప్రయోగించటంవలన అణుశక్తి దుష్పరిణామాలు ప్రయోగించబడిన దేశంమీదనే గానీ ప్రయోగించిన దేశంపై ఉండవని పరిశోధనల్లో తేలింది. న్యూట్రాన్ బాంబు వలన శత్రువులకే హాని కలుగుతుంది గనుక యుద్ధంలో ఇదే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందని సైనిక నిపుణులు నిర్ధారించుకున్నారు.

ఫలితంగా 1975లో అమెరికా న్యూట్రాన్ ఆయుధాల తయారీకి నాంది పలికింది. 27 అడుగుల పొడవుగల లాంగ్

రేంజ్, షార్ట్ రేంజ్, ఏంటీమిస్సైల్‌ను, రెండున్నర డజన్ల మిస్సైల్ స్ప్రింట్‌లను తయారుచేసి 'గ్రాండ్ ఫోర్క్స్ ఎయిర్ బేస్'లో ఉంచారు. వాటిలోనున్న న్యూట్రాన్ల శక్తిని టి.యన్.టి. అంటారు.

అప్పటి అమెరికా అధ్యక్షుడు 'గెరాల్డ్ ఫోర్డ్' ఈ న్యూట్రాన్ బాంబులను, తదితర అణ్వాయుధాలను తయారుచేయటానికి తగిన నిధులను మంజూరుచేశాడు. బడ్జెట్‌లో ఈ నిధులను 'పబ్లిక్ వర్క్స్' సెక్షన్‌లో చూపించి ఎవరికీ తెలియకుండా అతిరహస్యంగా ఈ ఆయుధాల తయారీని కొనసాగించారు. ఆ తరువాత అధికారంలోకివచ్చిన ప్రెసిడెంట్ కార్టర్ కూడా 1977లో ఆయుధాల తయారీకి అవసరమైన అనుమతినిచ్చాడు. అదే దారిలో రోనాల్డ్ రీగన్ కూడా 1981, ఆగస్టు 6న అనుమతినిచ్చాడు. 1983లో ఫ్రాన్స్ 'న్యూట్రాన్ క్లబ్'లో మెంబరుగాచేరి పసిఫిక్ మహాసముద్రంలోని 'మురురోయా' ద్వీపంలో మొన్న జూన్‌లో న్యూట్రాన్ బాంబుని ప్రయోగించింది. అంటే న్యూట్రాన్ క్లబ్‌లో ఇంత వరకు అమెరికా ఒక్కటే ఉండగా



SIVAPRASAD

...ప్పుడు ఫ్రాన్స్ కూడా చేరిందన్నమాట. ...ణాఫ్రికా, ఇజ్రాయేల్ దేశాలు కూడా ...ట్రాన్ బాంబుల్ని తయారుచేయాలని ...యించినట్లు రాజకీయవర్గాలు భావిస్తు...ను.

...ార్మన్ మోస్ 'ది పాలిటిక్స్ ఆఫ్ ...యేయమ్' అనే పుస్తకంలో 1979లో ద...అట్లాంటిక్ లో జరిపిన అణుపరీక్ష ...లనుసరించి చర్చిస్తూ దక్షిణాఫ్రికా సహ...తో ఇజ్రాయేల్ అణుపరీక్షలు జరిపి అనుమానిస్తున్నాడు. రాజకీయ...రిశీలిస్తే ఇజ్రాయేల్ అలాంటి పరీక్ష...పటానికి అవకాశాలు మెండుగా ఉన్నా... ఆ దేశపు అణ్వాయుధా గారంలో...కరకాల ఆధునిక ఆయుధా లున్నాయి. యుద్ధవ్యూహ పరీత్యా న్యూట్రాన్ బాంబుని సమకూర్చుకోవటానికి ఇజ్రాయేల్ అగ్రరాజ్యాలతో పోటీ చేయబూనుకోవటం అసహజమేమీ కాదు. మూడుసంవత్సరాల క్రితం 1980, జూన్ 27న ఫ్రెంచి ప్రెసిడెంట్ గిస్కార్డ్ న్యూట్రాన్ బాంబు క్లబ్‌లో చేరాలనే నిర్ణయాన్ని ప్రకటించటం, ఆ రంగంలో అమెరికా ఏకచ్ఛత్రాధిపత్యాన్ని నిరోధించటానికే. సోషలిస్ట్ భావాలుగల ప్రెసిడెంట్ డిగోల్ కూడా ఫ్రాన్స్ న్యూట్రాన్‌క్లబ్‌లో చేరే ప్రతిపాదనను సమర్థించారు. అగ్రరాజ్యాలైన అమెరికా,

సోవియట్ రష్యాల అణ్వాయుధాల సరళిని అనుసరించకపోతే ఫ్రాన్స్ వాటి ముందు ధైర్యంగా నిలబడగల అవకాశం ఉండదని వారు గ్రహించారు. అందు వలననే ఫ్రాన్స్‌లోనున్న రాజకీయ పార్టీలన్నీ తమ న్యూట్రాన్ బాంబు విధానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించాయి. చివరికి ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీకూడా రష్యా, అమెరికాల బలానికి ఆయుధాల తయారీలో సాంకేతిక నైపుణ్యానికి ఫ్రాన్స్ సరితూగలేదనే ఆందోళననే వ్యక్తంచేసింది.

ఆయుధాలపోటీలో అగ్రరాజ్యాలతో తలపడటానికి ఫ్రాన్స్‌కి నమ్మకమైన భాగస్వామి కావాలి. యూరప్‌లో అటువంటి దేశం పశ్చిమజర్మనీ ఒక్కటే. పశ్చిమ జర్మనీ పారిశ్రామికంగా ఎంతో ప్రగతిని సాధించింది. ఆయుధాల తయారీలో, యుద్ధ విమానాలు, ఇతర రక్షణ సామగ్రి తయారుచేయటంలో ఉన్నతమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించింది. ఆ దేశంలో అన్నిరకాల వనరులు సమృద్ధిగా ఉన్నాయి. బ్రిటన్‌కు కూడా ఈ పోటీలో నిలబడగల సామర్థ్యం ఉన్నా, ఆ దేశం అనుసరిస్తున్న రాజకీయ విధానం అమెరికాకు వంతపాడేదిగా ఉండటంవలన ఫ్రాన్స్‌కి ఆయుధాల తయారీలో బ్రిటన్‌తో పొత్తు కుదరలేదు. బ్రిటన్ వద్దనున్న ఆయుధాలు మరీ అంత అధునాతనమైనవి కావు. మరో ఏడెనిమిదేళ్ళలో ఆ ఆయుధాలన్నీ పాతబడిపోతాయి. రెండు ప్రపంచ యుద్ధాలలో జరిగిన కష్టనష్టాలకు ఓర్చి పశ్చిమ జర్మనీ అతి స్వల్పకాలంలోనే ఇతర యూరప్ దేశాలతో అన్ని రంగాలలో పోటీచేయగల స్థితికి చేరుకున్నది గనుక పశ్చిమ జర్మనీయే సరియైన భాగస్వామి అని ఫ్రాన్స్‌కి నమ్మకం కుదిరింది. దేశాభ్యున్నతిని దృష్టిలో పెట్టుకుని రాజకీయంగాను, నైతికంగాను పశ్చిమ జర్మనీతో అణ్వాయుధాలకు సంబంధించినఒప్పందం కుదుర్చుకోవటం సమర్థనీయమేనని అభిప్రాయపడ్డారు. సైనిక అవసరాలకు తగినంతగా అణ్వాయుధాలను రూపొందించటంలో, ఉత్పత్తి చేయటంలో పశ్చిమ జర్మనీ అమెరికాకు దీటుగా నిలబడగలదని ప్రపంచ దేశాల దృష్టిలో నిరూపితమైనది. యూరప్ ఖండంలో అణ్వస్త్రాల పోటీలో పశ్చిమ జర్మనీదే పైచెయ్యి అని నిరూపించబడింది. అణుశక్తిని శాంతి ప్రయోజనాలకు వాడటంలో పశ్చిమ జర్మనీ విఫలమయింది. దేశంలో నెలకొని వున్న రాజకీయ వాతావరణం అణుశక్తిని శాంతి ప్రయోజనాలకు వాడటానికి అనుకూలంగా లేదు. ఫ్రాన్స్ మాత్రం ఈ విషయంలో కొంతవరకు సఫలతను సాధించగలిగింది. ఫ్రాన్స్ తన ఇంధనంలో 20 శాతం అణుశక్తితోనే ఉత్పత్తి చేయగలుగుతున్నది. ఫ్రాన్స్ వద్ద జలాంతర్గాములను నడపగల క్షిపణుల భూమిపై ప్రయోగించగల బాలిస్టిక్ క్షిపణులు తగినన్ని ఉన్నాయి. వీటన్నిటితోడు ఫ్రాన్స్ న్యూట్రాన్ బాంబు కూడా సమకూర్చుకున్నది. బ్రి[illegible] వద్ద అణ్వస్త్రాలు ఉన్నా, వా[illegible] 'నాటో' దేశాలన్నిటికీ అధి[illegible] ఉంటుంది. బెల్జియంలోని బ్రస్సెల్సులో 1948లో పశ్చిమ యూరప్ దేశాలూ వేశమై 'నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్'ని ఏర్పాటు చేసుకున్నాయి. [illegible], ఫ్రాన్స్, లక్సెంబర్గ్, నెదర్లాండ్, [illegible]టలీ, నార్వే, పోర్చుగల్, అమెరికాలు




ఈ 'నాటో' సంధిలో ఉన్నాయి. 12 యూరప్ దేశాలు, రెండు అమెరికా ఖండపు దేశాలు, ఆసియాకు చెందిన టర్కీ ఈ ఒడంబడికలో ఉన్నాయి.

1955లో 'వార్సా ట్రీటీ ఆర్గనైజేషన్' ఏర్పడింది. సోవియట్ రష్యా, బల్గేరియా, జెకొస్లొవేకియా, తూర్పు జర్మనీ, హంగరీ, పోలెండ్, రుమేనియా ఈ సంస్థలో సభ్యులు. ఈ 'వార్సా' సంధి దేశాల బలాన్ని ఎదుర్కోటానికే 'నాటో' దేశాలకు అణ్వాయుధాల సేకరణ ఉపకరిస్తుందని సైనిక అధికారులు అంటున్నారు. అయితే 'వార్సా' సంధిదేశాల వద్దనే ఎక్కువ ఆయుధ సామగ్రి ఉన్నట్లు చెబుతున్నారు. రష్యన్ టాంకులు పశ్చిమ జర్మనిపై విరుచుకు పడితే దేశాన్ని సర్వనాశనం చేయగలవని భావిస్తున్నారు. అమెరికా సైనిక విధానాన్ని రూపొందించే ప్రణాళికావేత్తలు తమవద్దనున్న అణ్వాయుధాలు రష్యా బలాన్ని ఎదుర్కొనటానికి చాలవని సమ్మతం కలుగచేయటానికి సర్వవిధాలా ప్రయత్నిస్తున్నారు. అణుశక్తితో ప్రయోగించటానికి వీలుపడే 'షార్ట్‌రేంజి క్షిపణులను' ఈ రష్యన్ టాంకు బలాన్ని ఎదుర్కొనటానికే తయారుచేస్తున్నామంటున్నారు. అదే సమయంలో అమెరికన్ నిపుణులు న్యూట్రాన్ బాంబు వలన అణ్వాయుధాలకంటె తక్కువ ప్రాణనష్టం, ఆస్తినష్టం ఉంటుందని వాదిస్తున్నా ఆ వాదనలో నిజం లేదు. న్యూట్రాన్ బాంబు ప్రయోగం వలన యుద్ధటాంకులే కాకుండా, వాటిని నడిపే సైనికులు కూడా నిర్వీర్యులవుతారు. దాని దుష్పరిణామాల్ని చెప్పటం దుస్సాధ్యం. న్యూట్రాన్ బాంబు ప్రయోగం వలన మానవాళిపై కలిగే దుష్ఫలితాలను ఎవరూ ఇంతవరకు తెలుసుకోలేదు. దానిలో 'గామా' కిరణాలు, రేడియో ధార్మికశక్తి కలిసే ఉంటాయి. యుద్ధభూమిలోనున్న సైనికులే కాకుండా చుట్టుపక్కలనుండే ప్రజలు, పంటభూములు, పశువులు, నదీజలాలు, అణుధూళితో కలుషితం అవుతాయి. రేడియో ధార్మికశక్తిని 'రోంటజన్' అనే ప్రమాణంతో కొలతవేస్తారు. దీనిని సంక్షిప్తంగా 'రెమ్' అంటారు. మైక్రోగ్రాములో పదవవంతు రేడియం శరీరంలో ప్రవేశించినా దాని దుష్పరిణామం ఎంతగానో ఉంటుంది. రేడియం నుండి వెలువడే ధార్మికశక్తి ఎముకలలో పేరుకుని కొన్ని దశాబ్దాల వరకు శరీరానికి హాని చేస్తుంది. దాని నుండి 'ఆల్ఫా', 'బీటా', 'గామా' అనే ధార్మికశక్తి గల పదార్థాలు వెలువడుతాయి. వీటి వలన శరీరంలో రక్తాన్ని ఉత్పత్తి చేయగల 'టిష్యూలు' శాశ్వతంగా మాడిపోతాయి. 600 రెమ్‌ల రేడియో ధార్మికశక్తి గనుక ఒకేసారి శరీరంలోకి ప్రవేశిస్తే ఊహాతీతమైన హాని జరుగుతుంది. అణుయుద్ధంలో న్యూట్రాన్ బాంబును ప్రయోగించిన దూరాన్నిబట్టి ప్రజలకు 100నుండి 500 రెమ్‌ల రేడియో ధార్మికశక్తి తగిలే ప్రమాదం వుంటుంది. 50 నుండి 200 రెమ్‌ల ధార్మిక శక్తికి గురియైనవారు మొదటిరోజునే వాంతులు చేసుకుని బలహీనతకు గురిఅవుతారు. వారి రక్తంలో ఎర్రకణాలు తగ్గిపోతాయి.

జపాన్‌లోని 'నాగసాకి', 'హిరోషిమా' లపై ప్రయోగించిన అణుబాంబు వలన 450 రెమ్‌ల రేడియో ధార్మికశక్తికి ప్రజలు గురియై రెండు – మూడు

తరాలవారు తీవ్రమైన అనారోగ్యానికి గురిఅయ్యారు. యువకులు తక్కువ వ్యవధిలోనే వృద్ధులుగా మారిపోతారు. ఆయుక్షీణం, కంటిలో శుక్లాలు పెరగటం, స్త్రీలలో వ్యంధత్వం, గర్భస్రావం, కాన్సరువ్యాధి, అంగవైకల్యం గల సంతతి కలగటం, జుట్టురాలిపోవటం, చర్మం రంగు మారిపోయి పొడిఆరిపోవటం, రక్తక్షీణం వంటి అనేక రకాల దీర్ఘవ్యాధులకు గురి అవుతారు. జలాశయాలపైన, పాలిచ్చే జంతువులపైన, మాంసం, కూరగాయలపైన కూడా రేడియోధార్మికశక్తి ప్రభావం వుంటుంది. రేడియో ధార్మిక శక్తితో కలుషితమైన నీటిలో పెరిగిన చేపలు తింటే విషాహారం తిన్న లక్షణాలు కనబడతాయి. పప్పుధాన్యాలు, గోధుమలు రేడియో ధార్మిక ధూళితో కలుషితమైతే, వాటితో చేసిన బ్రెడ్, తినుబండారాలు విషాహారంగా మారతాయి. వాటిని తిన్నవారు విష ప్రయోగానికి గురయినట్లే లెక్క. లివర్, కండరాలు, ప్రేగులు, నరాలు, మెదడు దెబ్బతింటాయి.

న్యూట్రాన్ తదితర అణ్వాయుధాలతో యుద్ధ ప్రమాదమే గనుక సంభవిస్తే మానవాళి తిరిగి అంధకార బంధురమైన పాత రాతియుగానికి దారితీస్తుందని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. అపుడు ప్రజలు తమ అవసరాలకు తిరిగి పూర్వకాలపు వస్తుమార్పిడి పద్ధతిలోనేకాసుగోలు అమ్మకం సాగించవలసి వస్తుంది. ఐరోపా, ఆసియా, ఉత్తర అమెరికా, ఓషియానాలలో 10 వేల మెగాటన్నుల అణ్వాయుధాల ప్రయోగం గనుక జరిగితే ఆ తాకిడికి 15 కోట్ల మంది చనిపోతారని, 11 కోట్ల మంది క్షతగాత్రులవుతారనీ ప్రపంచ ఆరోగ్యసంస్థ అంచనా వేసింది. పదివేల మెగాటన్నుల అణ్వాయుధాలంటే అగ్రరాజ్యాల వద్ద ప్రస్తుతం ఉన్న అణ్వాస్త్రాలలో సగం మాత్రమే. 200 మెగాటన్నుల అణ్వాయుధాలను ప్రయోగిస్తే బ్రిటన్‌లోని మొత్తం జనాభాలో 60 శాతం ప్రజలు మరణిస్తారని బ్రిటిష్ మెడికల్ అసోసియేషన్ అంచనా వేసింది. ఒక మెగా టన్నుబాంబు ప్రయోగిస్తే ఏ పట్టణంలోనైనా కనీసం 10 లక్షల మంది ప్రజలు చనిపోతారని రష్యా శాస్త్రవేత్తలు అంచనా వేశారు. అణ్వాయుధాలను ప్రయోగించినపుడు కలిగే ప్రేలుడు వలన 100 నుండి 150 మైళ్ళ వేగంతో గాలులు వీస్తాయి. ఆ గాలి వేగపు తాకిడికే శరీరంపై భరించలేని గాయాలు ఏర్పడతాయి. భవనాలు పేకమేడల్లా కుప్పకూలిపోతాయి. వాటి కిందపడి మరణించే వారిసంఖ్యకూడా గణనీయంగావుంటుంది. అమెరికాలోని బోస్టన్ నగరంపై ఒక మెగాటన్ను బాంబు ప్రయోగిస్తే 7లక్షల మంది చనిపోతారు. మరో 70లక్షల మంది గాయపడతారు. వారందరికీ చికిత్స చేయటానికి అమెరికన్ వైద్య సర్వీసుల్లో ఉన్న డాక్టర్లందరినీ తరలించినా సరిపోరు.

ఈశతాబ్దంఆఖరునాటికిఅణ్వాయుధాల క్లబ్‌లో చేరే దేశాలసంఖ్య 31కి పెరుగుతుందని అంటున్నారు. యూరప్ దేశాలలోని రాజ్యాలన్నీ అణుయుద్ధాన్ని ఎదుర్కొనటానికి ఇప్పటినుండే సన్నద్ధమవుతున్నాయి.

—టి.జి.కె.మూర్తి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

## కొత్తది

## అద్వితీయ శక్తిదాయక పానీయం.
## జిల్లనిపించే నారింజ రుచిగలది!



**విటమిన్-సి తో**
**పరిపుష్టమైనది**

GLL-1174






గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి, మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూలమైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్లు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసరమైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.

# గ్లూకోన్-సి

CHATURA Telugu Monthly, Hyderabad-500 004,

Regd.No. H/HD/402